# ఆశీస్సులు

స్వామి నిశ్చలానంద విరచిత

# విశ్వజ్యోతి

సులభశైలితో గంభీరభావములతో నొప్పుచున్న గ్రంథరాజము. ఇందలి ప్రవచనములు ప్రతివారు నిత్యము పారాయణ చేయవలసిన యుపనిషత్సారములు

*

**శ్రీ శ్రీ శ్రీ జయేంద్రసరస్వతీ స్వాములు**

కంచి కామకోటి పీఠాధిపతులు

20-8-70

# అభిప్రాయము

అక్షరబ్రహ్మోపాసన మూలమున అక్షరబ్రహ్మోపాసన
మొనర్చుచున్నవారిలో
స్వామి నిశ్చలానందగారొకరు.

వీరు రచించిన **విశ్వజ్యోతి** విజ్ఞాన ప్రదమైన యొక
మంచి పుస్తకము. ఇందలి రచన సలక్షణముగ
సుబోధకముగ నొప్పుచున్నది. సందర్భాను
సారముగ మనోహరములైన పద్యములు
ప్రవచనములు కూర్పబడినవి. లోకోప
కారకమైన యిట్టి యుత్తమ గ్రంథ
మును రచించిన వారికి
నా కృతజ్ఞతాపూర్వక
నమస్కారములు.

*


విధేయుడు

**పరాశరం గోపాలకృష్ణమూర్తి,**

విద్యాప్రవీణ, భాషాప్రవీణ, M.A., A.E.S.,
ప్రధాన ఆంధ్రోపన్యాసకుడు, ప్రభుత్వ కళాశాల,
సిద్దిపేట, మెదక్ జిల్లా (A.P.)


15-9-70

# అభినందనము

విశ్వశాంతి సంధాయకమైన **విశ్వజ్యోతి** యను

గ్రంథము సార్థకనామమై యొప్పుచున్నది.

ఇట్టి సద్గ్రంథమును ప్రీతి పూర్వకముగ

పంపించిన

స్వామి నిశ్చలానందగారికి

నా ధన్యవాదములు

*

**డా॥ ఎస్. రాధాకృష్ణ**

మాజీ భారత రాష్ట్రపతి

మైలాపూరు, మద్రాసు-4

**31-8-70**

# అభిప్రాయము

శ్రీ శ్రీ శ్రీ స్వామి నిశ్చలానంద విరచిత

**విశ్వజ్యోతి** గ్రంథమును శ్రద్ధతో చదివితిని.

విజ్ఞానప్రదము, అమృతసారము ననదగు

నిట్టి కావ్యమును లోకమునకు ప్రసా

దించిన స్వాములు ధన్యులు,

ప్రశంసనీయులు.

*

హిందూ ప్రచారక రత్న

కులపతి **ఎస్. బాలకృష్ణ జోషి**

రిటైర్డు హెడ్మాష్టరు

హిందూ తియలాజికల్ హైస్కూలు

మదరాసు

# అభిప్రాయము

పూజ్యపాద **స్వామి నిశ్చలానంద** విరచిత

**విశ్వజ్యోతి** యను దివ్య గ్రంథము విశ్వమునకు
జ్యోతియై యలరుచున్నది. ఇందు లిఖింప
బడిన ప్రతి జీవిత చరిత్రయు ముఖ్య
విషయములు విడువబడక క్లుప్త
ముగ మృదుమధుర శైలితో
నున్నది.

చదివినకొలది చదువవలెనను ఆసక్తి కల్గు
చుండును. పుస్తకము యొక్క తుది
పుటలలోగల ప్రవచనములు ఒక
రత్నరాశి - సాధకులకాసూక్తులు
అమృత తుల్యములు
అత్యావశ్యకములు.

ఇట్లు,

**A. N. మూర్తి**, M.A. (న్యూయార్క్)
పాలకొల్లు, ఆంధ్రప్రదేశ్. 17-9-70

శ్రీ స్వామి నిశ్చలానంద గారికి
అభినందనములు

విశ్వజ్యోతి అను మీ గ్రంథమును తుదిముట్ట జదివితిని; సంతోషించితిని.

విశ్వజ్యోతి లోని ఉపనిషత్సారమును ఉపదేశ ఘట్టము మీ సాధనల ఫలమేనని నా భావము.

నేటి కల్లోలిత ప్రపంచమునకు మనశ్శాంతిని ప్రసాదించగల పరమార్థోపదేశములు చాల ఆవశ్యకములు. అట్టి యుపదేశములను మీరు సంగ్రహించి గ్రంథ రూపమున ప్రకటించుట స్తుతకృత్యము.

ఇది సర్వాంతర్యామియగు భగవంతుని ఉత్తమమైన సేవయని భావించుచున్నాను.

మీ శ్రేయోభిలాషి
వై. నాగేశ శర్మ

# కృతజ్ఞత

విశ్వజ్యోతి గ్రంథము సర్వాంగ
సుందరముగా వెల్వరించుటకు ఆశ్రయ
మొసంగి నా యోగక్షేమముల
నరయుచు స్వకీయ జన్మదిన
సందర్భమున గ్రంథరచనకు
ప్రోత్సాహపరచి 500
రూపాయలు విరాళమొసంగిన

పరమార్థభూషణం శ్రీయుత
**నాదెళ్ల సంపత్తు శెట్టిగారిని**
శ్రీనివాసుడు రక్షించుగాక

స్వామి నిశ్చలానంద
30-12-70 బుధవారము

# అభినందనములు

విశ్వజ్యోతి గ్రంథమును ప్రచురించుటకు

సలహాలొసంగి సహకరించినవారు

బెంగుళూరు వాస్తవ్యులు

గీర్వాణ, ఆంధ్ర, ఆంగ్ల భాషా కోవిదులు

ఉపనిషదర్థ వాచస్పతి

పౌరాణికరత్న

**బ్రహ్మశ్రీ వై. నాగేశ శర్మగారు**

మద్రాసు వాస్తవ్యులు

గీర్వాణ, ఆంధ్ర, తమిళ

భాషా విశారదులు

**శ్రీమాన్ నడాదూరి**

**విజయరాఘవాచార్యులుగారు**

భక్తరత్న

శ్రీమాన్ కరాలపాటి రాధాకృష్ణయ్యగారు

శ్రీ దేవత తిమ్మరాయప్పగారు (బెంగుళూరు)

వీరల శ్రీ శారదాంబ రక్షించుగాక

**స్వామి నిశ్చలానంద**

# ధన్యవాదములు

విశ్వజ్యోతి గ్రంథమును శ్రవణమొనర్చి సంతోషిత స్వాంతులై గ్రంథ ముద్రణమునకు ప్రోత్సాహపరచి విరాళ మొసంగిన దాతలు

బెంగుళూరు వాస్తవ్యులు

శ్రీ దేవత కృష్ణయ్యగారు
శ్రీ దేవత శ్రీరామయ్యగారు
శ్రీ దేవత ఎ. వి. రత్నయ్య శ్రేష్ఠిగారు
శ్రీ యాదాళం నంజయ్య శ్రేష్ఠిగారు
శ్రీ బి. వి. రత్నయ్య శ్రేష్ఠిగారు
శ్రీ వోలేటి అశ్వత్థనారాయణగారు
కుమారుడు సుబ్బయ్యగార్లు
శ్రీ యం. యస్. శ్రీకంఠయ్యగారు
కుమారుడు నాగభూషణ గుప్తగార్లు
శ్రీ కొమర్ల గంగ శెట్టిగారు
శ్రీ యన్. యల్. సత్యనారాయణ శ్రేష్ఠిగారు
శ్రీ పి. గౌరసామి శ్రేష్ఠిగారు
శ్రీ పత్తి ఆదినారాయణ అండ్ సన్సువారు

శ్రీ కె. నారప్ప శ్రేష్ఠిగారు

శ్రీ యస్. పి. వెంకటాచలపతి శ్రేష్ఠిగారు

శ్రీ బి. రంగయ్యగారు

శ్రీ యం. నంజుండయ్యగారు

శ్రీ హెచ్. కె. వి. వెంకటాచలపతిగారు
ధర్మపత్ని గౌరమ్మగార్లు

చిత్తూరు వాస్తవ్యులు

శ్రీ నటకల రామనాథం శ్రేష్ఠిగారు

సిద్ధిపేట వాస్తవ్యులు (మెదక్ జిల్లా)

శ్రీ సహజానంద గీతా సమాజమువారు

శ్రీ రేకా దుర్గయ్యగారి అంబయ్యగారు

శ్రీ జిల్లా జోగయ్యగారి వెంకటేశముగారు

శ్రీ పుల్లూరి మల్లయ్యగారి విశ్వనాథముగారు

శ్రీ వుప్పల మల్లయ్యగారి ఎల్లయ్యగారు

శ్రీ మురంశెట్టి నాగలింగం భార్య బసవమ్మగారు

శ్రీ రాజూరి సోమలింగంగారి లింగయ్యగారు

వీరల శ్రీ వాసవాంబ రక్షించుగాక

—స్వామి నిశ్చలానంద



శ్రీ శ్రీ శ్రీ స్వామి నిశ్చలానందగారు

ఓం

# విశ్వజ్యోతి



జగద్గురు శంకర రామానుజ మధ్వాచార్యుల
జీవిత చరిత్రలు; వారి సిద్ధాంతములు.

శ్రీ వాసవీకన్యకా జీవిత చరిత్రము
ఆమెయొక్క సకలోపనిషత్సారములగు 600 ల ప్రవచనములు.



గ్రంథకర్త:
స్వామి నిశ్చలానంద
శ్రీకృష్ణాశ్రమము
పాలకొల్లు, పశ్చిమగోదావరి జిల్లా.

[వెల : రూ. **10-00**

ప్రథమ ముద్రణము : 1970



## పరమార్థభూషణం,
## శ్రీయుత నాదెళ్ల సంపత్తు శ్రేష్ఠిగారి అభినందనము

స్వామి నిశ్చలానందకృత "విశ్వజ్యోతి" మహాకావ్యము పరంజ్యోతియై భాసించుచున్నది. ఆచార్యత్రయ జీవిత చరిత్రములు, వారి సిద్ధాంతములు నిందు క్లుప్తములుగా నిర్దుష్టములుగా కూర్చబడినవి. ఇందలి పద్యములు ప్రబంధ శైలితో మనోహరములుగా నలరారుచున్నవి. శ్రీ వాసవీ కన్యకా ప్రబోధములు విశ్వసాహిత్యములో ప్రథమస్థానమలంకరించుచున్నవి. ప్రతివారు చదివి తరింపదగిన గ్రంథరాజము.

177, ఎన్. ఎస్. సి. బోస్ రోడ్డు,
మద్రాసు - 1.

ఇట్లు,
(Sd.) నాదెళ్ల సంపత్తు శెట్టి.

ఫ్రీడమ్ ప్రెస్, 138-ఎ, టి. హెచ్. రోడ్డు మద్రాసు 21.

# ఉపోద్ఘాతము

ఆదినుండియు భారతభూమి యవతారపురుషులకు విజ్ఞానవతులగు మహిళామణులకు నిలయము. ధర్మహాని కలిగి యధర్మము ప్రబలునపుడు మహాత్ము లుద్భవించి ధర్మసంస్థాపన మొనర్చుచుందురు. మాక్సుముల్లరు, రస్సెల్, బెర్నార్డు షా మున్నగు పాశ్చాత్యులు 'పవిత్ర భారతభూమిలో తమకు మరణము సంభవించిన నది తమ మహాభాగ్యముగ దలంతుమ'ని పలికి రన్నచో మనదేశ ప్రశస్తి యెట్టిదో గ్రహింపనగును.

క్రీ. శ. 788 ప్రాంతమున నాస్తికమతములు, వేదబాహ్య మతములు ప్రబలిన తరి శంకరాచార్యు లుద్భవించి యద్వైత మతమును నెలకొల్పి యాస్తికమతమునకు రాజమార్గము నిర్మించి తరువాతి మతాచార్యుల ప్రచారమునకు సుగమమార్గమును నెలకొల్పిరి. వారు ముప్పదిరెండేండ్లు మాత్రమే జీవించియున్నను నితరులు ముప్పదిరెండుకోట్ల వత్సరములకైన సాధింపలేని ఘన కార్యముల సాధించి విశ్వవిఖ్యాతి నందిరి. వారి జననము క్రీ. శ. 788. నిర్యాణము 820.

క్రీ. శ. 1017 వ సంవత్సరమున శ్రీమద్రామానుజాచార్యులు జన్మించి సర్వజనసులభ మగునట్లు జ్ఞానముతోగూడిన భక్తికి ప్రాధాన్య మొసగిరి. వారిది పరిపూర్ణజీవితము. నూటయిరువది సంవత్సరములకాలము జీవించి విశిష్టాద్వైత మతమును స్థాపించిరి. వారి జననము క్రీ. శ. 1017 న. నిర్యాణము 1137 న.

క్రీ. శ. 1199 లో మధ్వాచార్యు లుద్భవించి ద్వైత మతమును స్థాపించి భక్తికి ప్రాధాన్యమిచ్చిరి. వారు డెబ్బదియేనిమిది

సంవత్సరములు జీవించియుండి విశ్వశ్రేయ మాచరించిరి. వారి జననము 1199 న. నిర్యాణము 1277 న.

క్రీ. శ. 1006 లో పశ్చిమగోదావరిజిల్లా పెనుగొండయందు శ్రీ వాసవీ కన్యక యుద్భవించి పశుబలయుక్తుడైన విష్ణువర్ధనుని నాత్మబలసమన్వితయై యెదిరించి సత్యాగ్రహమొనర్చి నిర్జించి విశ్వజ్యోతియై విలసిల్లెను.

కొందరు శ్రీ వాసవీ కన్యక వైశ్యకులమునకు మాత్రము సంబంధించిన దైవమందురు. ఇయ్యది సత్యసమ్మతము కాదు. శ్రీరాముడు క్షత్రియకులజుడైనను సర్వసద్గుణశోభితు డగుటచే సర్వమానవాళికి నారాధనీయు డయ్యెనుగదా! అట్టులే శ్రీ వాసవీ కన్యక వైశ్యులకు మాత్రము గాక అందఱకు నారాధ్యదైవమే.

శ్రీ వాసవీ కన్యక యగ్నిప్రవేశ సమయమున లోకకల్యాణ మునకై సకలోపనిషత్సారమును నుపమానములతో సులభ పద్ధతిలో నాఱువందల ప్రవచనములలో ప్రబోధించి నాస్తికుల ఆస్తికులుగా నరుల నారాయణులుగా మార్చిన మహిళామణి. ఈ వాసవీ కన్యకా వృత్తాంతము క్రీ. శ. 10, 11 వ శతాబ్దుల మధ్య జరిగినటుల శతావధాని శ్రీ దోమా వేంకటస్వామిగుప్త, విద్వాన్ రాజగుప్తగారలు వ్రాసియున్నారు.

పురాణ చరిత్ర పద్ధతులలో ప్రకృతవృత్తాంతమున నించుక భేదము కలదు. వైశ్యులు కైలాసమునుండి గోవుకర్ణముల ద్వార మున భూలోకమునకు వచ్చి నట్లు పురాణమున గలదు. వైశ్యులు హిమాలయమునుండి దిగువభాగమునగల ఉత్తర గోకర్ణ క్షేత్ర మునకు వచ్చినట్లు చరిత్రమున గలదు. పశ్చిమగోదావరి జిల్లా

లోని పెనుగొండలో శ్రీ వాసవీ కన్యకా చరిత్రమునకు చెందిన ప్రత్యక్ష చిహ్నములు నేటికిని గలవు. నేను నలుబది సంవత్సరములుగ శ్రీ వాసవీ కన్యకకు సంబంధించిన యనేకగ్రంథములు పరిశోధించితిని. త్రిమతాచార్యుల జీవితచరిత్రలవలె శ్రీ వాసవీ కన్యకచరిత్రమును చరిత్రప్రసిద్ధి గాంచినదే. శ్రీ వాసవీకన్యక జననము క్రీ. శ. 1006 లో స్వచ్ఛందమరణము క్రీ. శ. 1022 న.

పలుచోటులలో నీ వాసవీకన్యకా చరిత్రము నుపన్యసించు సమయములందు శ్రోతలు గ్రంథరూపమున నీ చరిత్రమును వెల్వరింప ప్రోత్సహించుటవలన మూడేండ్లక్రితము దీనిని వ్రాయబూని తూర్పుగోదావరి జిల్లాలోని ర్యాలిలో నొక సంవత్సరమును, బెంగుళూరు విశ్వేశ్వర పురమునందు గల కన్యకాపరమేశ్వరీ యాలయమున రెండేండ్లు వ్రాసి ప్రకృతరూపమున గ్రంథమును రూపొందింప గలిగితిని. మొదట దీనిని వినిపింప నాలకించి శ్రీ దేవత కృష్ణయ్యగా రానందభరితులై ముద్రణార్థము ప్రథమ విరాళమొసగి ప్రోత్సహించిరి.

మహాత్ముల జీవిత చరిత్రములు వారిసిద్ధాంతములు తెలిసికొనుట యత్యంతావశ్యకము. వారి జీవితములబట్టి మన జీవితముల జిక్కుబఱచుకొని కృతార్థులము గాగలుగుదుము.

నేడు ప్రజానీకమున లౌల్యప్రవృత్తులు పొడుకొన్నవి. దేశపరిపాలకులును నధికారప్రాబల్యమే ముఖ్యమని తలంచుచున్నారు గాని పరమార్థమున శ్రద్ధవహింపకున్నారు. అహింసామార్గమున పాశ్చాత్యులను సత్యాగ్రహ మహాస్త్రముతో లోగొని మనదేశమునకు స్వారాజ్యము సాధించి యొసగిన గాంధీమహాత్ముని యనుయాయులందును నైకమత్యము లోపించి పరమార్థ

దృష్టి నశించి యంతఃకలహములు పెచ్చుపెరిగినవి. నిరపాయము, మహోన్నత సౌఖ్యప్రదమునగు మార్గమును లోకులకు జూపు వారు లేకపోవుటయే గాక పైపెచ్చు చలనచిత్రములు విశృంఖల మగు నవినీతినే వ్యాపింపజేయుచున్నవి. విద్యావంతులును విషయ ప్రవృత్తులు బురికొల్పు గ్రంథములందు మిక్కిలి యాసక్తి చూపుచున్నారుగాని రామాయణ మహాభారతాది యుత్కృష్ట గ్రంథములయెడ నాదరణచూపకున్నారు. కావున నెట్లైనను నుప నిషత్సారమును లోకులకు బంచిపెట్టి ధర్మప్రవృత్తుల నొనర్ప వలెనన్న యుత్సాహముతో మిక్కిలి సులభమగు పద్ధతిలో నుప మానములతో నిందు నారువందల ప్రవచనములు కూర్పబడినవి. ఈ కావ్యము త్వరలో తమిళము, కన్నడము, నాంగ్లము మున్నగు భాషలలో ననువదింపజేయబడును. బ్రహ్మవిద్యా ప్రబోధకము లగు గ్రంథములు వ్రాయించి ప్రోత్సాహపఱచి ముద్రింపజేసి ప్రచారమునకు దెచ్చుటయే ఘనకార్యము. అన్ని దానములకన్న విద్యాదానము ప్రశస్తము.

అన్న మరజాములోపల నరిగిపోవు
వస్త్రమొసగిన చినుగును వత్సరమున
విద్యకై చేయు దానంబు విస్తరించి
పిల్లపిల్ల తరాలుగా పెరుగుచుండు.

పరమార్థదృష్టిగల భక్తుల ప్రోత్సాహముతో విశ్వజ్యోతి మహాకావ్యము నిట్లు గ్రంథరూపమున పాఠకమహాశయుల కందిం చుటవలన కృతార్థుడనని భావించుచున్నాడను.

ఓం తత్సత్.

బెంగుళూరు
26-6-1970

స్వామి విశ్వలానంద

# ప రి చ య ము

పరంజ్యోతిని సందర్శింపదగు దివ్యచక్షుస్సును లోకులకు ననుగ్రహించిన యవతారస్వరూపులు మతాచార్యులు వారి దివ్య చరిత్రములు భారతీయులకు నిత్యము ననుసంధింపదగినవి. వారి దివ్యప్రబోధములు నిరంతరము స్మరింపదగినవి. ప్రజలు దివ్య భావనను విస్మరించు కాలములందెల్ల నిట్టి మహనీయు లవతరించి తమ యనుష్ఠానములవలనను, నుపదేశములవలనను సనాతన మగు వేదాంతతత్త్వముల జనులలో ప్రచారములోనికి తెచ్చు చున్నారు. అట్టివారి చరిత్రమును సారముగ లోకుల కందించు గ్రంథరత్నము "విశ్వజ్యోతి."

దీనిని విరచించినవారు శ్రీశ్రీశ్రీ నిశ్చలానందస్వామివారు. వీరు తమ యనన్య సాధారణమగు గంభీర వాగ్వర్ష ప్రకర్షవలన నాంధ్రుల ముగ్ధులగావించుచు ధర్మప్రచారమే జీవితలక్ష్యముగా గొన్న త్యాగధనులు. వీ రనేక గ్రంథముల పరిశోధించి మతా చార్యుల జీవితములలోని సారతమాంశములను లలితపద్ధతిలో నీ గ్రంథరూపమున వెలయించిరి. ధర్మసంస్థాపనకు దన జీవితము త్యాగముజేసిన శ్రీ వాసవీకన్యకను వారు మతాచార్యుల కోవలో జేర్చుట ప్రశంసనీయము.

ఈ గ్రంథమున నెడనెడ వారు మృదుపదగుంభిత మధుర శయ్యాసౌభాగ్యముతో నొప్పారుచున్న పద్యములను గూర్చిరి. అవి మిక్కిలి మనోహరములు, రసికజనానందకరములును. వారు యతులగుటవలన ననుభవపూర్వకముగ గ్రహించిన యుత్తమ వేదాంత విషయములనెల్ల నిందు పొందుపఱచిరి. శ్రీ వాసవీ

కన్యకా ప్రవచనముల నిందు గూర్చిన తీఱు వారి ప్రజ్ఞాపరిణతికి నికషోపలము. భగవద్గీతవలె నీ ప్రవచనములు నిత్య పారాయణ మొనర్పదగిన వన్నచో నది యతిశయోక్తికాదు. మహోన్నత శాస్త్ర విషయములను గూడ వారెల్లరకు సులభముగ నవగతమగు విధమున నిందు వివరించుట మిక్కిలి యభినందింపదగినది. ఇట్టి యత్యుత్తమ గ్రంథము నాంధ్రులకు నొసగి వారిని ధన్యులను గావించిన శ్రీ స్వాములవారు మిక్కిలి వంద్యులు.

మదరాసు
16-6-70

సుధీజన విధేయుఁడు
విద్వాన్ నడాదూరి విజయరాఘవాచార్యులు

# అనుక్రమణిక

పుట.

మొదటి అధ్యాయము

రెండవ అధ్యాయము



మూడవ యధ్యాయము

నాలుగవ యధ్యాయము

పుట.

**అయిదవ అధ్యాయము**

# విశ్వజ్యోతి

## మొదటి అధ్యాయము

## జగద్గురు శంకరాచార్యుల జీవిత చరిత్రము

శ్లో. నాగేంద్రహారాయ త్రిలోచనాయ
భస్మాంగరాగాయ మహేశ్వరాయ
నిత్యాయశుద్ధాయ దిగంబరాయ
తస్మై నకారాయ నమశ్శివాయ.

కేరళదేశమందు కాలటి యను అగ్రహారముగలదు. అందు శివగురుడు ఆర్యాంబ యను పుణ్యదంపతులు గలరు. వారు సంతాన ప్రాప్తికి పరమేశ్వరుని ప్రార్థింప శంకరుడు ప్రత్యక్షమై నేను నీ గర్భమందు జన్మించెదనని అనుగ్రహించెను.

ఆర్యాంబకు తొమ్మిదవనెలయందు పుత్రుడు జన్మించెను. తలిదండ్రులు ఆ పిల్లవానికి శంకరుడని నామకరణము గావించిరి. యెనిమిదవఏట శివగురుడు పుత్రునకు ఉపనయనముజేయ సంకల్పించెను. శివగురుడు మరణించుటచే శంకరునికి బంధువులే ఉపనయనము గావించిరి. శంకరుడు విద్యాభ్యాసమునకై నర్మదానదీ ప్రాంతమందుగల గోవిందభగవత్పాదాచార్య లను గురువు నాశ్రయించి సన్న్యాసాశ్రమము స్వీకరించెను.

శంకరుడు ఏకసంధాగ్రాహి యగుటచే అనతికాలములోనే సకలోపనిషత్సారమును గ్రహించెను.

ఒకరోజు ప్రాతఃకాలమందు కుంభవర్షము కురిసి నర్మదా నది పొంగిపొరలి ప్రవహించుచుండెను.

శంకరుడు గురుదేవుని ఆశ్రమము కూలిపోవు నను భయముచే ప్రవాహమునంతయు తన కమండలములో ఇమిడ్చెను. ఈ దృశ్యమును గాంచిన గోవిందభగవత్పాదాచార్యులు శంకరుని మహిమకచ్చెరువొంది ఇతడు ధర్మసంస్థాపనార్థమై జన్మించిన పరమేశ్వరుడని తెలిసికొని అద్వైతపరముగా బ్రహ్మసూత్రములకు భాష్యములు వ్రాయుమని కాశీక్షేత్రమునకు బంపెను.

శంకరాచార్యులు కాశికి జనుదెంచి విశ్వేశ్వరుని స్తోత్రము జేయ విశ్వేశ్వరుడు సాక్షాత్కరించి బదరీక్షేత్రమునకుబోయి ప్రస్థానత్రయమునకు భాష్యములను వ్రాయునట్లాజ్ఞాపించెను.

కాశీవిశ్వేశ్వరుని ఆదేశానుసారముగా శంకరులు అద్వైతపరముగా ప్రస్థానత్రయమునకు భాష్యములనువ్రాసి ఆసేతుహిమాలయము పర్యటించి అద్వైతమతము స్థాపించి జగద్గురు స్థానము అలంకరించిరి.

శ్రీ శంకరాచార్యులు ప్రథమశిష్యుడగు పద్మపాదాచార్యులను పురుషోత్తమ క్షేత్రమందుగల గోవర్ధన మఠమునకు,

ద్వితీయశిష్యుడు సురేశ్వరాచార్యులను శృంగగిరియందుగల శారదా పీఠమునకు,

తృతీయశిష్యుడు హస్తామలకాచార్యులను ద్వారకయందుగల శారదా పీఠమునకు,

చతుర్థశిష్యుడు తోటకాచార్యులను బదరికావనమందుగల జ్యోతిర్మఠమునకు అధిపతులుగా నియమించి తాము ముప్పదిరెండవ వత్సరమున శివసాయుజ్యమొందిరి.

# అద్వైత సిద్ధాన్తము

బ్రహ్మమే నిత్యసత్యము. సర్వాధిష్ఠానత్వ సర్వవ్యాపకత్వ నిరుపాధికత్వ నిర్గుణత్వ అపరిచ్ఛిన్నత్వ సత్య శివ సుందర సర్వ లోక మహేశ్వరత్వమే పరమేశ్వరస్వరూపము. అనిర్వచనీయ మగు మాయామహిమచే కల్పిత ప్రపంచము ఖండముగా కని పించినను బ్రహ్మము అఖండము.

స్థితప్రజ్ఞునకు మాయాకల్పితనామరూపములు గోచరింపవు. మాయాశక్తికి స్వాధీనమయినదంతయు అనిత్యము.

మాయాకల్పిత నామరూపవ్యూహమును భేదించుకొని సింహ విక్రమము కలవాడవై సంసారమను వల తుత్తునియలుజేసి వెలికిరమ్ము. నీ సత్యాన్వేషణ కార్యక్రమమందు విసువుజెందక స్థిరప్రయత్నమొనర్చి యోగారూఢుడవుగమ్ము. అపుడు నామ రూపమయమాయాప్రపంచమదృశ్యమై సచ్చిదానంద పరమాత్మవై భాసించెదవు.

శుద్ధసత్వగుణప్రధానమగు ప్రకృతియే మాయ యనబడును. మలినసత్వప్రధానమగు ప్రకృతియే అవిద్య యనబడును. తమోగుణ ప్రధానమగు ప్రకృతియే తామసి యనం బరగుచు జగత్కారణం బగును. బ్రహ్మము మాయోపాధిచే నీశ్వరుడనియు నవిద్యోపాధిచే జీవుడనియు వ్యవహరింపబడును. సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వ సర్వ కర్తృత్వ సర్వనియామకత్వాది గుణవిశిష్టుండగుటచే సగుణబ్రహ్మ మనబడును.

బ్రహ్మము సత్యమనియు జగత్తు మిథ్యయనియు జీవుడే బ్రహ్మమనియు అద్వైతసిద్ధాన్తము.



# జగద్గురు రామానుజాచార్యుల జీవిత చరిత్రము

## అవతారిక

శ్లో. మేషార్ద్రా సంభవం విష్ణోః దర్శనస్థాపనోత్సుకం
తొండీరమండలే శేషమూర్తిం రామానుజంభజే.

శ్రీ రామానుజాచార్యులు జగద్గురువులు, అవతారపురుషులు. వీరు నూటయిరువది సంవత్సరములు జీవించి తాను విశిష్టమని భావించిన విశిష్టాద్వైతమతమునకై జీవితమును ధారబోసిన మహనీయులు.

మొదట వీరికి గురువులైనవారు కడపట వీరికి శిష్యులైరి. ప్రపంచచరిత్రలో గురువులకు గురువులగుట అత్యద్భుతము.

శ్రీరంగక్షేత్ర నివాసియగు యామునాచార్యులు విశిష్టాద్వైత మతమునకు ప్రథములు. ద్రావిడమున శ్రీ ఆళవందార్ అని వీరు ప్రసిద్ధులైరి.

వీరికిని రామానుజాచార్యులకును ద్రోణాచార్యులకు ఏకలవ్యునకు గల గురుశిష్యసంబంధమేగాని ఒకరినొకరు కలిసికొన్న భాగ్యము కలుగలేదు.

ఐనను వారిపై వీరికి వీరిపై వారికి విశ్వాసముగలదు. శ్రీరామానుజులు వర్ణాశ్రమవిచక్షణలేకుండ ప్రతిభగలవారి నంద

రిని తన మతములో చేర్చుకొనుటవలన విశిష్టాద్వైతము ఉచ్చ స్థితిలో నున్నది.

ఇందుకు నిదర్శనము తిరుపతి, శ్రీరంగము, జగన్నాథము, కాంచీపురము మున్నగు నెన్నియో వైష్ణవక్షేత్రములు వెలసి యుండుటయే. శ్రీరామానుజులను సంస్కృతమున యతిరాజు లనియు, ద్రావిడమున శ్రీభాష్యకారర్, ఎంబెరుమానార్, ఉడయ వర్, ఇళైయాళ్వార్ అనియు నందురు.

### శ్రీ రామానుజులకు ప్రారంభగురువు

యాదవప్రకాశులు (ద్రావిడమున గోవిందజీయర్)
గోష్ఠీపూర్ణులు (ద్రావిడమున తిరుక్కోట్టియూర్‌నంబి)
పూర్ణార్యులు (ద్రావిడమున పెరియనంబి)
కాంచీపూర్ణులు (ద్రావిడమున తిరుక్కచ్చినంబి)
వరరంగాచార్యులు(ద్రావిడమున తిరువరంగపెరుళుమాళ్ అరయర్)
శ్రీశైలపూర్ణులు (ద్రావిడమున తిరుమలనంబిగారు)

వీరు రామానుజుని ఉన్నతాదర్శములకు మహోదాత్తతకు ముగ్ధులైరి. విశిష్టాద్వైత సిద్ధాన్తమునకు రామానుజసిద్ధాన్తమని ప్రఖ్యాతిగల్గెను.

## జీవిత చరిత్ర

తూర్పుసముద్రమునకు పశ్చిమమున మూడుయోజనముల దూరమందు భూతపురి గలదు. ద్రావిడమున శ్రీపెరుంబూదూర్ అని దానినందురు. అందు బ్రహ్మనిష్ఠుడు కేశవాచార్యులుండిరి.

వీరిధర్మపత్ని కాంతిమతి. వీరు విష్ణుభక్తితత్పరులు. వీరికి సంతానము లేనందున ఇలువేల్పగు శ్రీకృష్ణుని సంతానప్రాప్తికి ధ్యానించిరి.

శ్లో. తయేష్ట్వా ద్విజవర్యాయ ప్రసన్నః పార్థసారథిః
ప్రాప్స్యామ్యహం తే పుత్రత్త్వం ఇతిస్వప్నే తమబ్రవీత్.

శ్రీకృష్ణుడు స్వప్నమందు సాక్షాత్కరించి లోకకల్యాణము కొరకు నేనే నీ గర్భమందు పుత్రుడనుగా జన్మించెదనని పలుక కేశవాచార్యులు పరమానందభరితు లయ్యెను. కాంతిమతి గర్భమును ధరించి శ్రీకృష్ణుని గర్భమందు ధరించిన దేవకీదేవివలె మిగుల ప్రకాశించెను.

## రామానుజుల జననము

శ్లో. చైత్రమాసే శుక్లపక్షే పంచమ్యాం గురువాసరే
మధ్యాహ్నే కర్కటే లగ్నే నక్షత్రే రుద్రదైవతే
పుత్త్రిం దృష్ట్వా కాంతిమతీ ప్రోద్యంత మివభాస్కరం
హర్షేణోత్ఫుల్లనయనా ముమోద సహబాంధవైః.

చైత్ర శుద్ధ పంచమి గురువారము మధ్యాహ్న కాలమందు ఆర్ద్రా నక్షత్రము కర్కట లగ్నమున సూర్యప్రభాభాస మానుడగు పుత్త్రుడు ఆమెకు జన్మించెను.

ఆ ముహూర్తమున ఆకాశము నిర్మలమై యుండెను. నదులు స్వచ్ఛముగా ప్రవహించుచుండెను. దేవదుందుభులు మ్రోసెను. దేవతలు పుష్పవర్షమును కురిపించిరి. గోవులు మెరు గారి క్షీరధారలు వర్షించుచుండెను. శ్రీశైలపూర్ణులు తన సహో దరికి పుత్త్రుడు జన్మించెనని తెలిసి భూతపురికి చనుదెంచి, రామా

నుజు లని నామకరణ మొనర్చిరి. తలిదండ్రులు బంధువులు ముద మొందిరి. కేశవాచార్యులు రామానుజునకు సకలోపనిషత్సారమును బోధించిరి.

రామానుజునకు పదునారవ సంవత్సరమున తంజమాంబ యను వధువుతో విధివిహితముగా వివాహము జరిగెను. వివాహానంతరము పంద్రెండవ సంవత్సరమున కేశవాచార్యులు పరమ పదించిరి.

రామానుజుడు పితృకార్యముల నాచరించి, యాదవ ప్రకాశులను పణ్డితునియొద్ద విద్యాభ్యాసమునకై సకుటుంబముగా భూతపురిని వీడి కాంచీపురమందు స్థిరనివాస మేర్పరుచుకొని విద్యాభ్యాసము చేయుచుండెను.

సహజ పాండిత్యము, ప్రతిభగల రామానుజుని గాంచి యాదవప్రకాశులు మహాత్ముడని భావించిరి.

## రామానుజుడు రాజపుత్రికకు భూత విముక్తి కల్గించుట

కాంచీపురమును పాలించు రాజుకొమార్తెకు భూతము పట్టెను. తన్నివారణకై మహామాంత్రికుడగు యాదవప్రకాశుని రాజాహ్వానింప శిష్యబృందముతో రాజభవనమునకు చేరెను.

ఇట్లు చనుదెంచిన యాదవప్రకాశుని మహారాజు పూజించి తన కొమార్తెను చూపించెను.

యాదవప్రకాశుని చూచినంతనే రాజపుత్రిక పండ్లు పటపట కొరుకుచు ప్రళయకాల మేఘమువలె గర్జించెను. ఎవని పేరు

విన్నంతమాత్రమున భూతములు పర్వెత్తునో అట్టి యాదవ ప్రకాశుడు భయభ్రాంతుడై వణకుచుండెను.

శ్రీరామానుజుడు గురువున కపఖ్యాతి గల్గెనని తలంచి నిర్భయుడై రాజపుత్రికను సమీపించి తన పాదమును శిరముపై నుంచెను.

రామచంద్రుని పాదస్పర్శచే శాపమునుండి విముక్తినొందిన అహల్యవలె బ్రహ్మరాక్షసినుండి రాజపుత్రిక విముక్తయయ్యెను.

బ్రహ్మరాక్షసునకు శాపవిముక్తిగల్గి గంధర్వుడై రామానుజుని పాదములకు నమస్కరించి వెడలిపోయెను. ఈ దృశ్యమంతయు జూచుచున్న మహారాజానందభరితుడై రామానుజునకు కనకాభిషేకము గావించి యాదవప్రకాశుని గూడ సత్కరించెను.

శ్రీరామానుజులు తనకు సమర్పింపబడిన పారితోషికముల నన్నిటిని గురువునకు సమర్పించిరి.

ఐనను యాదవప్రకాశుని యంతరంగమందు నా శిష్యునకు ఖ్యాతి నా కపఖ్యాతి గల్గెనని రాగద్వేషములు అభివృద్ధి యగుచుండెను.

క్రమక్రమముగా రామానుజుని కీర్తి శుక్లపక్ష చంద్రుని పగిది విస్తరించుచుండెను.

రామానుజుల కీర్తి విని, పినతల్లి కుమారుడు గోవిందార్యులు కాంచీపురమునకు చనుదెంచిరి.

ఇటుల చనుదెంచిన గోవిందార్యులను రామానుజులు గాఢా లింగనము గావించుకొనిరి.

రామానుజులు గోవిందార్యులు గూడ యాదవప్రకాశుని యొద్ద వేదముల నభ్యసించుచుండిరి.

శ్లో. సత్యజ్ఞానాది వాక్యానివదన్తి బ్రహ్మణో గుణాః
అపార్థం శ్రుతివాక్యానాం కి మర్థం బ్రూహియాదవ.

యాదవప్రకాశులు బ్రహ్మము నిర్గుణుడు నిరాకారుడని చెప్పుచుండ రామానుజు లిట్లనిరి.

బ్రహ్మము సత్యము, జ్ఞానము ఆనందమని శ్రుతి తెల్పు చున్నది. అవి పరమాత్ముని గుణములని శ్రుతి అభిప్రాయము. అట్టిచో గుణసహితుడగు పరమాత్ముని నిర్గుణుడని మీరు శ్రుతికి అపార్థమును ఎందుకు కల్పించుచున్నారని ప్రశ్నించెను.

అందుకు యాదవప్రకాశు లిట్లనిరి. గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినటుల నీవు పాఠశాలకు వచ్చినది మాకు పాఠములు చెప్పుటకా చెప్పించుకొనుటకా యని గద్దించెను.

యాదవుని అభిప్రాయము గ్రహించిన రామానుజులు ఇంటికి చనుదెంచి పాఠశాలకు వెళ్లుట మానుకొనిరి.

## శ్రీ రామానుజుని చంపుటకు ప్రయత్నము

ఒకరోజున యాదవప్రకాశులు శిష్యులతో నిట్లనిరి. షట్ శాస్త్రములయందు చతుర్వేదములయందు ప్రపంచఖ్యాతి బొందిన నేను అల్పబుద్ధిగల రామానుజుని వలన అవమానము నొందితిని.

గురువునకే పారముజెప్పు ఈ గురుద్రోహిని తీర్థయాత్రానెపమున త్రివేణీసంగమములో త్రోసినచో అతనికి మోక్షము మనకు పుణ్యము కల్గుననగా గురువుల వాక్యములను శిష్యులు ఆమోదించిరి. కొన్నిరోజులు చనినపిదప యాదవప్రకాశుడు రామానుజు నాహ్వానించి ఇట్లనెను.

“పక్షులలో గరుత్మంతుడు, పర్వతములలో హిమాలయ మెటుల శ్రేష్ఠమో నా శిష్యులందరిలో నీ వొక్కడవే ఏకసంధా గ్రాహివి. నీవు రానికారణమున నాకు చిత్తశాంతి లేదు, నీవు పాఠశాలకు వచ్చుచో ప్రశాంతికల్గు” నన రామానుజు లెప్పటి వలెనే పాఠశాలకు వచ్చుచుండిరి.

ఒకరోజు యాదవప్రకాశుడు రామానుజునితో “మాఘశుద్ధ పూర్ణిమ ప్రయాగలో కుంభమేల జరుగును. చాలమంది దిగంబర సాధువులు సత్పురుషులు చనుదెంచెదరు, వారిని సందర్శించు భాగ్యము కల్గును. ఆ దినమందు ప్రయాగలో స్నాన మాచరించు వారికి జన్మరాహిత్యమే కల్గు” ననెను.

శ్రీరామానుజుడు ప్రయాణమునకు సమ్మతించి ఇంటికిజని తల్లి యనుజ్ఞనొంది గురువుతో, తోడి సహచరులతో ప్రయాగకు పయనమై వెళ్లుచుండిరి. రామానుజులతో సహోదరుడైన గోవిందార్యులు రహస్యముగా నిట్లనిరి.

ఈయాత్రయొక్క ముఖ్యోద్దేశ్యము యాదవప్రకాశుడు నిన్ను హత్యచేయుటకే ననియు తత్‌క్షణమే మరలి వెళ్లుమని తెల్పెను. వెంటనే రామానుజుడు మార్గమును తప్పించి వేరొక మార్గముపట్టెను. యాదవప్రకాశుడు రామానుజుని గానక వెదకు

టకు శిష్యులను పంపించెను. శిష్యులు వెదకి వెదకి వేసారి మాకు కనిపించలే దనిరి.

ఆ వాక్యములకు యాదవప్రకాశులు హృదయమున ఆనంద మొంది పైకి ఇట్లనిరి. "రామానుజా! నీకప్పుడే నూరేండ్లు నిండినవా" యని విచారమును వెలిబుచ్చిరి.

## వ్యాధదంపతుల దర్శనము

యాదవప్రకాశుని వ్యూహమునుండి విడువడిన రామానుజుడు మహారణ్యమున దారిగానక చిక్కుబడి శ్రీమన్నారాయణుని సంస్మరించె. అంత శ్రీరామానుజునకు ధనుర్బాణములు ధరించిన వ్యాధదంపతులు కన్పించి ఇట్లనిరి.

మహాశయా ! ఇది భయంకరారణ్యము. ఇందనేక క్రూర మృగములు సంచరించుచుండును. మీరొంటరిగా సంచరించుటకు కారణమే మన రామానుజు లిట్లనిరి.

మాఘస్నానమునకు ప్రయాగకు బయలుదేరితిని. మార్గ మధ్యమం దనేక అపశకునములు కన్పించుటచే స్వగ్రామమైన కాంచీపురమునకే వెళ్లుటకు సంకల్పించితిని దారితెలియక చిక్కుబడిన నాకు దారిచూపించు డని కోరిరి.

అంత నాదంపతులు మేముగూడ కాంచీపురమునకే వెళ్లు చుంటిమి. ఈ అరణ్యమునందుగల మార్గములన్నియు మాకు పరిచితములే యనియు మిమ్ము నిరపాయముగా మీ యింటికి చేర్చెదమనియు పలికిరి.

రామానుజుడా వాక్యముల కానందించి వ్యాధ దంపతుల నను సరించి అనేక నదీనదములుదాటి కాంచీపురము సమీపింప సూర్యు డస్తమించెను. వ్యాధదంపతు లొక చెట్టుక్రింద రామానుజు లొక చెట్టుక్రింద విశ్రమించిరి.

అంత వ్యాధ స్త్రీ భర్తతో మార్గాయాసముచే బడలితిని, అపరిమితమగు దాహము వేయుచున్నదన ఆమె భర్త నలుదిక్కుల కారుచీకటులు క్రమ్ముకొనెను, తెల్లవారిన వెంటనే నీదాహము తీర్చెద ననెను. ఈసంభాషణ వినుచున్న రామానుజు లిట్లు తలంచిరి.

భయంకరారణ్యమున చిక్కుబడిన నాకు మార్గము చూపించిన పుణ్యదంపతులగు వీరికి ప్రత్యుపకారము చేయలేకపోతినని చింతించి అరుణోదయమైనంతనే మీకు మంచి తీర్థము గొని వచ్చెదను. అంతవరకు ఓపికపట్టు డని పల్కిరి.

అంత నా దంపతులు రామానుజులు సుఖముగా నిద్రించిరి. తెల్లవారినంతనే రామానుజులు సమీపమందుగల బావినుండి ముమ్మారు మూడుదోసిళ్ళతో మంచి తీర్థ మాదంపతులకీయ వారు పరమానందభరితులై త్రాగిరి. నాల్గవపర్యాయ ముదకము తెచ్చు సరికి వ్యాధదంపతు లదృశ్యులైరి.

## రామానుజుడు కాంచీపురమును గాంచుట

శ్లో. అవిదూరే ప్రకాశన్తే గోపురాణి సమన్తతః
ఇయం క్షీర నదీ పుణ్యాపురోద్యానవనం శుభం

శ్రీరామానుజులు ప్రాకారములచే గోపురములచే క్షీరనదీ తోయములచే సంశోభితమైన కాంచీపురము గాంచి పరమానంద భరితుడై తల్లికి పురజనులకు జరిగిన వృత్తాంతమంతయు విన్పించిరి. అంత నా పురజనులలో కొందరు. శ్రీ రామానుజుడు పునర్జన్మ మొందెననియు కొందరు లక్ష్మీనారాయణుల అనుగ్రహముచే యాదవప్రకాశుని పద్మవ్యూహమునుండి బయటపడెననియు కొందరు ఆత్మబలసమన్వితుని పశుబలమేమి చేయగలదనియు కొందరు ధర్మమును రక్షించువారిని వారి ధర్మమే సంరక్షించుననియు అనేకవిధములుగా చెప్పుకొనుచుండిరి. అంత కాంతిమతి పుత్రునితో నిట్లనెను.

శ్లో. కాంచీపూర్ణ ఇతిఖ్యాతో నిత్యం హరిపరాయణః
శబర్యంశేన సంభూత శమాదిగుణసంయుతః.

బిడ్డా! సూతకుల సముద్భూతుడు కాంచీపూర్ణులను మహనీయుడు గలడు. అతడు శ్రీమన్నారాయణునకు అంతరంగ భక్తుడు. దివ్యదృష్టిగలవాడు. వారికీ వృత్తాంతమెరిగింపు మన రామానుజులు కాంచీపూర్ణులకు నమస్కరించి జరిగిన వృత్తాంత మంతయు విన్పించెను. అంత కాంచీపూర్ణు లిట్లనిరి.

శ్లో. రామానుజ మహాప్రాజ్ఞ త్వయ్యస్తి కరుణాహరేః
తస్మాత్త్వమాపదో ముక్తః కాంతిమత్యాత్మ సంభవ!

రామానుజా! నీవు ధర్మాత్ముడవు. విష్ణుభక్తి నిరతుడవు. అందువలన లక్ష్మీనారాయణులు నీ చేతి తీర్థమును త్రాగగోరి వ్యాధదంపతులై నీకు సాక్షాత్కరించిరి. ప్రతినిత్యము వరదరాజస్వామికి

ఆ బావి నీటితో నభిషేకము చేయుము. నీకు సకలశుభములు కల్గు ననెను.

రామానుజులు కాంచీపూర్ణుల ఆదేశానుసారము ప్రతి నిత్యము బంగారు కలశములతో ఆ బావి తీర్థమును వరదరాజ స్వామి కభిషేకింపుచు తన జీవితమును స్వామికైంకర్యమునకు అంకిత మొనర్చుకొనిరి. భగవదనుగ్రహపాత్రుడగు శ్రీరామానుజుడు వైష్ణవసిద్ధాన్తప్రబోధకుడై ప్రతివాదిభయంకరుడై విజ్ఞానమూర్తియై యుండెను. సద్గుణసంపన్నుడైన రామానుజుని కీర్తి దిగంత పరివ్యాప్త మయ్యెను.

## యామునాచార్యులు, వైష్ణవ ప్రవక్త నన్వేషించుట

శ్లో. తస్మిన్కాలే రంగధామ్ని యామునార్యః కృపానిధిః
వేదవేదాంత సంపన్నః పరవాదిభయంకరః
శిష్యైః పరివృతో నిత్యం శరణాగతరక్షకః
శ్రీమద్వైష్ణవసిద్ధాన్తపాలకశ్చ బభూవ సః.

శ్రీరంగమందుగల యామునాచార్యులు తన శిష్యులకిట్లాదేశించిరి. సర్వలక్షణ లక్షితుడు ఉపనిషదర్థవాచస్పతి విశిష్టాద్వైత సిద్ధాన్తప్రవక్త తరుణవయస్కుడు విష్ణుభక్తుడు సర్వ సద్గుణ సంపన్నుడెచటగలడో తెలిసికొని రండని పంపగా. వారు ఆసేతుహిమాచలము సంచరించి వచ్చి యామునాచార్యులతో,

మహాశయా! మీరు తెల్పిన లక్షణము లన్నియు కాంచీపురమందు గల రామానుజులకు కల వనిరి.

అంత యామునాచార్యులు నా తదనంతరము విశిష్టాద్వైత సిద్ధాన్త ప్రవక్త కలడని సంతృప్తి నొందిరి.

## యాదవప్రకాశుని పశ్చాత్తాపము

యాదవప్రకాశులు శిష్యబృందముతో ప్రయాగ, కాశి మొదలగు పుణ్యక్షేత్రములను సేవించుకొని కాంచీపురము జేరి రామానుజుని వృత్తాంతమంతయు తెలిసికొని ఆత్మబలసమన్వితు డగు రామానుజునితో వైరము తనకు వినాశహేతువని నిశ్చ యించుకొని తన దుష్కృత్యమునకు పశ్చాత్తాపమొంది రామాను జుని ఆహ్వానించెను.

స్థితప్రజ్ఞులైన శ్రీ రామానుజులు యాదవప్రకాశుల హృదయాభిప్రాయమును గ్రహించి యథాప్రకారము యాదవుని కడ విద్య నభ్యసించుచు గురుసేవాపరాయణులై యుండిరి.

## యామునాచార్యులు రామానుజుని దర్శించుట

శ్లో. తతః కదాచిత్ శ్రీరంగాత్ యామునః శిష్యసంవృతః
రామానుజంద్రష్టుకామః పురీం కాంచీం యయౌ జవాత్.

శ్రీరంగక్షేత్రమునుండి యామునాచార్యులు శిష్యబృంద ముతో బయలుదేరి రామానుజుని చూచు తలంపుతో కాంచీపురము నకు చనుదెంచిరి.

యామునాచార్యుల ఆగమనవార్త తెలిసికొని కాంచీ పూర్ణులు ఎదురేగి అర్ఘ్యపాద్యాది విధులచే పూజించిరి.

కాంచీపూర్ణులు యామునాచార్యులు కరిగిరిపై వెలసిన వరదరాజస్వామిని సేవించి తీర్థప్రసాదములను స్వీకరించిరి. మరునాడుదయము యామునాచార్యులు రామానుజుల జూచు తలంపుతో పర్వతమునుండి దిగివచ్చుచుండిరి. యాదవప్రకాశులు శిష్యబృందముతో వరదరాజస్వామిని సందర్శించు వేడ్క పర్వత మెక్కుచుండిరి.

అంత యామునాచార్యులు కాంచిపూర్ణులతో నిట్లనిరి. భస్మోద్దీపిత ఫాలభాగుడై దండకమండలములను ధరించి ప్రమథగణములతో చనుదెంచు ఇమ్మహనీయు డెవ్వరని యడుగ కాంచీపూర్ణులిట్లనిరి.

ఈ మహిాత్ములే యాదవప్రకాశులు. సర్వశాస్త్రార్థ కోవిదులు, సర్వమంత్రవిశారదులు. అద్వైతమతప్రవక్తలని తెల్పి ఇట్లనిరి.

ఈతని వెనువెంట ద్వాదశోర్ధ్వపుండ్రములను ధరించి శ్రీమన్నారాయణునివలె కన్పించు ఈ మహాభాగులే రామానుజులని పల్కిరి.

అంత యామునాచార్యులు కాంచీపూర్ణులతో నిట్లనిరి.

శ్రీ రామానుజులు ధర్మసంస్థాపనార్థమై జన్మించిన శేషతల్పశాయి. ఇమ్మహాత్మునితో సంభాషించుట కిది సమయము కాదని పల్కి యామునాచార్యులు శిష్యబృందముతో శ్రీరంగమున కేగి రామానుజుని యభ్యుదయము కొరకు విశ్వవిఖ్యాతమైన "స్తోత్ర రత్నమును" రచించిరి.

## కప్యాసశ్రుతి

ఒకరోజు ప్రాతఃకాలమందు యాదవప్రకాశులు శిష్యులకు పాఠములు చెప్పుటలో శ్రుతి కపార్థమును చెప్పుచుండ ప్రాజ్ఞులైన రామానుజులు కన్నీరు కార్చుచుండిరి. యాదవప్రకాశులు రామానుజులతో ఎందు కేడ్చుచుంటి వనెను. రామానుజులును గురువర్యా! కప్యాసశ్రుతికి మీరు అపార్థము చెప్పుటవలన ననెను.

యాదవప్రకాశుడు ఆగ్రహముతో సరియగు అర్థమేదో తెల్పు మనెను. అంత రామానుజు లిట్లనిరి.

శ్లో. కప్యాస మితి వాక్యస్య వక్ష్యామ్యర్థం శ్రుణుద్విజ!
కంజలం పిబతీ త్యస్మాత్ కపిరిత్యుచ్యతేరవిః
తేన సంస్ఫుటితం పద్మం కప్యాస మితి కథ్యతే
త త్తుల్యే లోచనే విష్ణోరిత్యర్థోస్యా శ్రుతేర్మతః.

కం. జలమును, పిబతి, త్రాగుచున్నాడు, కపి, సూర్యుడు. సూర్యకిరణములచే వికసింపజేయబడిన పద్మములవంటి నేత్రములు గల విష్ణువని శ్రుతి చెప్పుచుండ మీరు కోతి పిఱ్ఱలవంటి నేత్రములు గల విష్ణువని సామ్యము చెప్పుట అసమంజసమని యాదవప్రకాశుని సిద్ధాన్తమును రామానుజులు సమంజసముగా ఖండించిరి.

సత్యసమ్మతమైన రామానుజుల వాక్యములకు విరుద్ధముగా యాదవప్రకాశులు

అసంబద్ధప్రలాపీ! నాకడకు నీవు వచ్చుట నాకు పాఠములు చెప్పుటకా చెప్పించుకొనుటకా యని పరుషముగా పల్కెను. అంత

రామానుజులు యాదవప్రకాశుని వీడి ఎప్పటివలెనే వరదరాజ స్వామి కైంకర్యమం దుండిరి.

## రామానుజులు శ్రీరంగమునకు బయలుదేరుట

శ్లో. తతః శ్రీరంగనగరే యామునార్యో యతీశ్వరః
దేవరాజం సముద్దిశ్య స్తోత్రరత్నం విధాయచ.

యాదవప్రకాశులకు రామానుజులకు స్పర్ధలు కల్గుటయు రామానుజుడు వరదరాజ కైంకర్యనిరతుడై యుండుట మొదలగు విషయముల నన్నిటిని తెలిసికొని యామునాచార్యు లానంద భరితులై రామానుజుని తన సన్నిధికి రప్పించుటకై పూర్ణార్యు లను కాంచీపురమునకు బంపిరి. పూర్ణార్యులు కంచి వరదరాజ స్వామి సన్నిధియందు గానముచేయుచుండ రామానుజులు పరమా నంద భరితులై పూర్ణార్యులతో నిట్లనిరి.

మహాశయా! మధురమంజులమైన ఈ స్తోత్రరత్నమును రచించిన మహాకవి ఎవ్వరన రామానుజులతో పూర్ణార్యు లిట్లనిరి.

శ్లో. రంగక్షేత్రే మహాన్ కశ్చిత్ యామునార్య ఇతి శ్రుతః
అస్తి ద్విజకులేజాతో వేదవేదాన్త పారగః.

ఈ స్తోత్రరత్నమును శ్రీరంగక్షేత్రవాసులైన యతి సార్వభౌములు సద్బ్రాహ్మణులు యామునాచార్యులు రచించి రనుటయు రామానుజునకు వారిని సందర్శించు కుతూహలము కల్గెను. కాంచీపురమునుండి పూర్ణార్యులతో శ్రీవారు పయనమై పరమపావనమైన కావేరీనదిని సందర్శించిరి.

ఆ కావేరీ సైకతతలమున తండోపతండములుగా నున్న శ్రీవైష్ణవులను సందర్శించి యామునాచార్యులు పరమపద మలంకరించి రనువార్త విన్నవారై పెన్నిధిని గోల్పోయిన పేదభంగి క్రుంగి పోయిరి.

అంత పూర్ణార్యులు రామానుజులు ధైర్యము వహించి యామునాచార్యుల దివ్యదేహమును దర్శించిరి. అచటనున్న వైష్ణవులంగాంచి రామానుజులు నమ్రతతో నిట్లనిరి. యామునాచార్యుల సన్నిధి భాగ్యమే నాకు లభించియున్నచో భూలోకము నుండి వైకుంఠమునకు సోపానములు నిర్మించి వైష్ణవుల నందరిని పరమపదమునకు చేర్చి యుండెడివాడను. అట్టి యదృష్టమునకు నోచుకొనని దౌర్భాగ్యుడనని నిట్టూర్చిరి.

## రామానుజుల ప్రతిజ్ఞలు

శ్రీరామానుజులు, పూర్ణార్యులు, శ్రీవైష్ణవులు యామునాచార్యుల చరమవిగ్రహము జూడనయ్యది వికసిత ముఖారవిందముతో నొప్పుచుండెను. కుడిచేతియందు మూడు వ్రేళ్లు ముడుచుకొని యుండెను. దానిం గాంచి రామానుజులు ఆశ్చర్యపరవశులై వ్రేళ్లు ముడుచుకొని యుండుటకు కారణమేమన శ్రీ వైష్ణవులిట్లనిరి. ఇంతకుముందు వ్రేళ్లు తెరవబడి యుండెను. ఇపుడు వ్రేళ్లు ముడుచుకొని యుండుటకు కారణ మూహింపజాలము. మహాత్ములు మీరే నిర్ణయింపు డని పలికిరి. అంత రామానుజు డిట్లు ప్రతిజ్ఞ సల్పెను.

శ్లో. అహం విష్ణు మతే స్థిత్వా జనా నజ్ఞాన మోహితాన్
పంచసంస్కార సంపన్నాన్ ద్రావిడామ్నాయ పారగాన్
ప్రపత్తి ధర్మనిరతాన్ కృత్వారక్షామి సర్వదా
ఏవం రామానుజాచార్యే వదత్యాత్మవతాం వరే
మహాత్మా యామునాచార్యో జహౌ వేకాంగుళిం తదా
తతః ప్రోవాచ ధర్మాత్మా వాక్యం రామానుజః పునః.

నేను శ్రీ వైష్ణవ సిద్ధాన్తమును ప్రతిపాదించి ప్రజలను పంచసంస్కార సంపన్నులను గావించెదను.

ద్రావిడవేదమును పఠించున ట్లొనర్చెదను. ప్రజలను విష్ణు భక్తుల నొనర్చెదను. అజ్ఞానులను విజ్ఞానులుగా మార్చుటకు ప్రయత్నించెదను. నా జీవితమంతయు వైష్ణవమత ప్రచారమున కంకిత మొనర్చెద నని శపథము గావింప అందరు చూచుచుండ యామునాచార్యులు ఒక వ్రేలు తెరచిరి.

శ్లో. సంగృహ్యా నిఖిలా నర్థాన్ తత్త్వజ్ఞాన పరం శుభం
శ్రీ భాష్యంచ కరిష్యామి జనరక్షణ హేతునా.

సకలోపనిషత్సారమును సంగ్రహించి జగత్కల్యాణము నకై శ్రీభాష్యమును వ్రాసెదనని ప్రతిజ్ఞ నేయ యామునాచార్యులు రెండవ వ్రేలుతెరచిరి.

శ్లో. జీవేశ్వరాదీన్ లోకేభ్యః కృపయాయః పరాశరః
సందర్శయన్ తత్స్వభావాన్ తదుపాయ గతీస్తథా.

జీవేశ్వరుల వ్యక్తిత్వమును వారివారి స్వభావములను వా రాచరించు విధులను వానివలన వారు పొందు గతులను విశద

పరచి పురాణరత్నమును రచించిన పరాశరమహర్షి ఋణమును తీర్చుకొనుటకై శ్రీ వైష్ణవులలో నొకరికి పరాశరమహర్షి యని నామమిడి వారి ఋణమునుండి విముక్తుడ నయ్యెదనన యామునులు మూడవ వ్రేలు తెరచిరి.

ఆ విచిత్రమును గాంచిన పూర్ణార్యులు శ్రీ వైష్ణవులు వర రంగాచార్యులు రామానుజుని పురుషోత్తము డనియు జగద్గురు వనియు శ్లాఘించిరి.

శ్రీ రామానుజుడు యామునాచార్యుల వ్రేళ్లను తెరపించి కృతకృత్యులై అచట నున్నవారికి వందన మాచరించి ఇట్లనిరి.

శ్లో. మహాప్రమాదో మే జాతః కిం కరిష్యామి వైష్ణవాః
కరుణా రంగనాథస్య మయ్యేవం విద్యతేధునా.

జగత్ప్రభువైన శ్రీరంగనాథునకు నాయం దనుగ్రహము లేదు. యామునాచార్యులతో సంభాషించు భాగ్యమును నోచుకొన నైతినని విచారగ్రస్తుడైన రామానుజునితో వైష్ణవు లిట్లనిరి.

మహాశయా! జరిగినదానికి విచారించి ప్రయోజనము లేదు. పరమానంద స్వరూపుడైన శ్రీరంగనాథుని సందర్శన మాత్రమున దుఃఖనివృత్తియు సుఖప్రాప్తియు కల్గునని యెన్ని విధముల ప్రార్థించినను శ్రీ రామానుజుడు శ్రీ రంగనాథుని దర్శింపకయే సహ్యాపర్వతప్రభవమైన కావేరిని దాటి, ఉన్నతములగు గోపురములచే ప్రకాశించుచున్న కాంచీపురముం గాంచి, క్షీరనది యందు స్నానమాడి, వరదరాజస్వామిని సేవించి, గృహమునకు చనుదెంచి సుఖముతో నుండిరి.

## కాంచీపూర్ణుని దేవతార్చన కాహ్వానించుట

శ్లో. కాంచీపూర్ణ మువాచేదం వచనం వదతాం వరః
మద్గృహే భోజనం హృద్యం కర్తవ్యం భవతా ధృవం.

శ్రీరామానుజులు కాంచీపూర్ణులం గాంచి మా యింటికి ఆతిథ్యమునకు దయచేయవలసినదని ప్రార్థింప కాంచీపూర్ణులు తన దివ్యదృష్టిచే నంతయు తెలిసికొని ఇతడు (తళియప్రసాదమును) నేను భుజింపగా మిగిలిన యన్నమును ఆరగించుట కుత్సాహపడుచున్నాడని యెరింగి అంగీకరించిరి.

అంత రామానుజులు పరమానందభరితులై ఇంటికి చనుదెంచి తంజమాంబచే సమస్తము సిద్ధము చేయించి తిరువారాధనాదుల శీఘ్రముగా నాచరించి కాంచీపూర్ణుల రాకకై నిరీక్షించుచుండిరి. కాంచీపూర్ణుల దర్శనము కానందున ఆతిథ్యమునకు వచ్చెదరో రారో యను సందేహము గలిగి రామానుజులు వారి ఇంటికి దక్షిణ మార్గముగా నేగిరి.

కాంచీపూర్ణులు తమ మఠమునుండి ఉత్తరమార్గమున రామానుజుని ఇంటికి చనుదెంచి తంజమాంబా! నీ భర్తగా రేమి చేయుచున్నారన నా సాధ్వి ఇట్లనియెను.

నా భర్త మీ రాకకై నిరీక్షించి మీరు రానందున విష్ణుపూజ గావించి మిమ్మాహ్వానించుటకై మీ మఠమునకే వెళ్లిరి. కొంత సేపు విదానించుచో మీ రుభయులు భుజింపవచ్చునన కాంచీపూర్ణులిట్లనిరి. ఇప్పటికే వేళ మించినందున నాకు ఆకలి యగుచున్నది. వెంటనే వరదరాజస్వామి సేవకు వెళ్లవలెను రామానుజులు వచ్చు పర్యంత ముండుటకు వీలుగాదని పలుక నాయమయు కాంచీ

పూర్ణులకు అరటియాకులో సమస్త పదార్థములు వడ్డించెను. కాంచీ పూర్ణులు తృప్తిగా భుజించి తూర్పుమార్గమున తమ మఠమున కేగిరి.

తంజమాంబ తన పరివారముచే వారు భుజించిన విస్తరిని బయట వేయించి కాంచీపూర్ణుల భుక్తశేషమును దాసీలకొసంగి స్నానమాడి మడితో వంట చేయుచుండెను.

రామానుజులు కాంచీపూర్ణుల మఠమునకేగి శిష్యులవలన సమస్త విషయములు తెలిసికొని యింటికి చనుదెంచి మరల నెందుకు వంటచేయుచుంటి వని పత్నినడుగ రామానుజులతో తంజమాంబయు నిట్లనియెను.

కాంచీపూర్ణులు శూద్రులు. ఆతని భుక్త శేషమును బ్రాహ్మణులు భుజింపరాదుగదా! అందువలన ఆ పదార్థములను దాసీల కొసంగి వంటచేయుచుంటి ననగా. సమదృష్టిగల రామానుజుడు విషమదృష్టిగల తంజమాంబతో నిట్లనియెను.

కాంచీపూర్ణులు శూద్రులని తెలిసికొంటివేగాని ఆయన హృదయమెట్టిదో తెలిసికొనని జడమతివని పల్కి కాంచీపూర్ణుల భుక్తశేషము లభింపనందున నిరాశచెంది మఱియు నిట్లనిరి.

నీవు తెలియక చేసిన మొదటి తప్పిదము మన్నించితిని. జాగ్రత్త యని హెచ్చరించి తిరువారాధనము గావించి భగవన్నివేదితాన్నమును భుజించి వెడలిపోయిరి.

## యామునాచార్య విరహితమైన శ్రీరంగము

యామునాచార్యులు లేని శ్రీరంగము పతిలేని సతివలె నిస్తేజమైయుండ పూర్ణార్యులు శ్రీరంగనాధుని స్మరించుచు నిద్రింప స్వప్నమందు రంగనాథుడు సాక్షాత్కరించి యిట్లనియెను.

పూర్ణార్యా! వైష్ణవసిద్ధాన్త ప్రవక్త శ్రీ రామానుజులు కాంచీపురమందు గలరు. వారికి పంచసంస్కారములను గావించి శ్రీరంగమునకు గొనిరమ్ము జగత్కల్యాణము చేకూరును. అనగా పూర్ణార్యులు మేల్కొని పరమానందభరితులై శిష్యసహితముగా కాంచీపురమునకు వచ్చుచుండిరి.

శ్రీరంగమునుండి పూర్ణార్యులు పరివారముతో వచ్చుచున్న వార్త నెరింగి రామానుజులు ఎదురేగి మధురాంతకమున వారిని అర్ఘ్యపాద్యాది విధులచే పూజించి ఇట్లనిరి.

ఈ శరీరము క్షణభంగురము. ఆలసింపక మీ శిష్యుని పంచసంస్కారసంపన్నుని గావించి కృతార్థుని గావింపవలెను. అని ప్రార్థింప మధురాంతకమునగల కోదండరాముల సన్నిధిలో హోమముగావించి తప్తము గావింపబడిన శంఖచక్రములతో జగద్గురువులగు రామానుజుని కుడిభుజమందు సుదర్శనచక్రమును ఎడమభుజమున పాంచజన్యశంఖమును ముద్రించి ఆపన్నివారక మంత్ర ముపదేశించి ఆరాధనకై అర్చారూపముతో నున్న వరదరాజుల విగ్రహమునిచ్చి పూర్ణార్యులు కృతకృత్యులైరి.

పంచసంస్కారసంపన్నులైన శ్రీ రామానుజులు శరత్కాల చంద్రునివలె ప్రకాశించిరి.

వైష్ణవసామ్రాజ్య పట్టభద్రులైన రామానుజులగాంచి పూర్ణార్య లిట్లనిరి.

యామునాచార్యుల తదనంతరమున విశిష్టాద్వైత సిద్ధాన్త ప్రవక్తవు నీ వొక్కడవే. వర్తమానకాలములో అనేక పాషండ

మతములు విజృంభించి నాస్తికత్వమును ప్రచారము చేయుచున్నవి. వానిని ఖండించి ఆస్తికత్వమును స్థాపించుట నీధర్మము. అనగా పూర్ణార్యుల వాక్యములు శిరసావహించి సకుటుంబముగా పూర్ణార్యులను కాంచీపురమునకు తోడ్కొని కరిగిరి వరదరాజస్వామిని సందర్శించి జరిగిన వృత్తాంతమంతయు కాంచీపూర్ణుల కెరిగించిరి.

అంత కాంచీపూర్ణులు పంచసంస్కారసంపన్నులైన శ్రీ రామానుజులగాంచి ఇతడు జగద్గురువని భావించెను.

కాంచీపూర్ణులు పరమానందభరితులై రామానుజులను దీవించిరి.

శ్రీ రామానుజులు వారి ఆశీస్సులను బొంది, పూర్ణార్యులను సకుటుంబముగా తన గృహమునకు తోడ్కొనిపోయి వారు నివసించుటకందు నర్ధభాగమునిచ్చి ప్రతినిత్యము పూర్ణార్యులకడ ద్రావిడ వేదము నధ్యయనము జేయుచు ఆరు మాసములు గడపిరి.

శ్రీ రామానుజులకడ కొక వైష్ణవుడు చనుదెంచి రాత్రి తాను భుజింపలేదనియు, ఆకలి దహించివేయుచున్నదనియు ప్రార్థించిరి.

రామానుజులు తంజమాంబను పిలిచి మన ఇంటనున్న చల్దియన్నమును పెట్టమని పల్కెను. ప్రతికూలవతియగు తంజమాంబ వెంటనే లేదనెను. రామానుజుడు భాండమందుగల అన్నమును జూపి రెండవతప్పు మన్నించితిని. ఇక నపరాధము చేయుచో క్షమించనని పల్కెను.

## రామానుజులు భార్యను పరిత్యజించుటకు కారణములు

రామానుజుల భార్యయు, పూర్ణార్యుల భార్యయు, మంచి నీటికై నూతికేగిరి. నీరు చేదుటలో తంజమాంబ చేదపై పూర్ణార్యులభార్య నీరు చేదునపుడు కొన్ని బిందువులు పడెను. అంత తంజమాంబ ఇట్లనెను.

శ్లో. క్వతేజాతిః క్వతేశీలం క్వతేద్రవ్యాది సంపదః
ఇత్యేవ పరుషం వాక్యం వదతీం తాం ప్రియాంప్రతి.

మా ఇంటిలో నివసించుచు మా యన్నము తినుచు క్రింద మీదెరుగక సంచరించు అధమజాతివి. అనగా పూర్ణార్యులభార్య తంజమాంబతో నిట్లనెను.

గురుపత్నినను పూజ్యభావములేక నోటికివచ్చినట్లు వదరుచుంటివి. భగవంతుడు నిన్ను క్షమింపడని పల్కి ఇంటికి చనుదెంచి పూర్ణార్యులతో తంజమాంబ పలికిన యప్రియములు విన్పింప పూర్ణార్యులు పత్నీ సహితముగా శ్రీరంగమున కేగిరి.

రామానుజులు ఇంటికి చనుదెంచి పూర్ణార్యులు కన్పింపనందున ఇరుగుపొరుగువారివలన వృత్తాంతమంతయు తెలిసికొని రామానుజుడు తంజమాంబతో నిట్లనెను.

1. కాంచీపూర్ణుల భుక్తశేషమును దాసీల కొసగుట.

2. ఆకలిగొన్న వైష్ణవునకు అన్నముంచుకొని లేదనుట.

3. గురుపత్నియను పూజ్యభావమును విస్మరించి దుర్భాషలాడి సద్గురువును గురుపత్నిని ఇంటినుండి వెడలనడుచుట యను క్షమింపరాని అపరాధములు గావించితివి. పరమార్థమున

కడ్డువచ్చు దేనినైనను విడుచుట ధర్మము. తల్లిని భరతుడు, తండ్రిని ప్రహ్లాదుడు, గురువును భీష్మాచార్యులు తిరస్కరించు నటుల నిన్ను పరిత్యజించి ప్రశాంతినొంది జీవితమంతయు లోక కల్యాణము నొనర్చుచు గడపెదనని పలుక తంజమాంబ గడ గడ వడంకెను.

## రామానుజులు సన్న్యసించుట

శ్లో. లేఖ్యం కృత్వా ప్రయత్నేన భార్యాయాః పితురాలయాత్
వివాహార్థం సముద్దిశ్య ప్రేషితం శ్వశురేణతః.

శ్రీ రామానుజులు ప్రతికూలవతియగు భార్యను విసర్జించుట కొాక ఉపాయ మాలోచించిరి.

ఒక వైష్ణవుడు రామానుజుల ఇంటికివెళ్ళి తంజమాంబతో నిట్లయెను.

నీ తమ్ముని వివాహము మాఘశుద్ధదశమినాడు ఇంక వారమురోజులు కలవని సృష్టించిన శుభలేఖ యిచ్చి మీ తండ్రి గారు నిన్ను నీ భర్తను శీఘ్రముగా తోడ్కొని రావలసినదిగా నన్ను పంపించిరని పసుపు కుంకమ పెట్టి ప్రయాణముచేయ తంజ మాంబ సంతసించెను.

అంత రామానుజులు ఇంటికి చనుదెంచి విషయమంతయు తెలిసికొని భార్యతో నిట్లనెను.

నేను నాల్గురోజులు నిదానించి వచ్చెదననియు ఆభరణ ములు పెట్టుకొని పెండ్లికి వెళ్లుట మంచిదనియు ఆమె సొమ్ము లన్నియు నిచ్చి తంజమాంబను ప్రయాణముచేసి పంపిరి.

శ్రీరామానుజులు తన ఇంటగల సర్వస్వము బీదలకు పంచి పెట్టి శ్రీ వరదరాజ సన్నిధిని కాషాయము, త్రిదండము, కమండలమును ధరించి సన్న్యాసమును స్వీకరించిరి. ఆశ్రమ స్వీకారము గావించిన ఆ యతిసార్వభౌమునిపై దేవతలు పుష్పములను వర్షించిరి.

శ్రీరామానుజులు ఆశ్రమ స్వీకారానంతరము కాంచీపురమందే ఒక మఠమున నివసించుచుండిరి.

కాంచీపూర్ణులు ఆశ్రమ స్వీకారము గావించిన రామానుజునకు యతిరాజులని నామకరణము గావించిరి.

రామానుజుని మేనల్లుడు దాశరథి యనువాడు తన మేనమామ ఆశ్రమ స్వీకారము చేయుట తెలిసికొని కాంచీపురమందు గల మఠమున జేరి ప్రథమ శిష్యు డయ్యెను.

కూరేశు డను మహాపండితుడు రామానుజుల నాశ్రయించి ద్వితీయ శిష్యుడుగా చేరి శాస్త్రముల నభ్యసించుచుండెను.

## యాదవప్రకాశునికి తల్లి హితము చెప్పుట

శ్లో. ఊర్ధ్వపుండ్ర ధరం ధీరం కాషాయాంబర శోభితం
త్రిదండ ధారిణం ప్రాజ్ఞం నారాయణ మునిం యథా.

ఆకర్ణాంత విశాలనేత్రుడై ఆజానుబాహువులు కల్గి ఊర్ధ్వపుండ్రములను ధరించి కాషాయాంబర శోభితుడై సర్వలక్షణ సంపన్నుడైన శ్రీ రామానుజుని గాంచి యాదవప్రకాశుని తల్లి నమస్కరించి, ఇంటికి చనుదెంచి సంభ్రమాశ్చర్య సమన్వితయై యాదవప్రకాశునితో నిట్లనియెను.

పుత్రా! శ్రీ రామానుజులు వైష్ణవమతస్థాపనార్థమై వైకుంఠమునుండి అవతరించిన శ్రీమన్నారాయణుడు గాని మానవ మాత్రుడు గాడు.

పూర్వము నీకు వారియందుగల శత్రుభావమును విస్మరించి మిత్రభావముతో నుండుము. విష్ణుభక్తి లేనివా డెంత ధనవంతుడైనను, బలవంతుడైనను, విద్యావంతుడైనను అతని జీవితము నిష్ప్రయోజనము.

నీది శాస్త్రజ్ఞానము, ఆ మహనీయునిది అనుభవజ్ఞానము. నీది పశుబలము, వారిది ఆత్మబలము. వారిని నీవు ఆశ్రయించుచో ప్రబలుడ వయ్యెదవు. లేనిచో దుర్బలుడ వయ్యెదవు. నీ క్షేమమును గోరి చెప్పుచుంటినని పల్కు తల్లి వచనములు హృదయమున హత్తుకొనుటయు శ్రీరామానుజ ప్రపత్తి ఒక్కటియే ప్రశాంతి యని భావించి శిష్య పరివృతుడై నక్షత్రముల మధ్య చంద్రుని వలె సంశోభితుడైన శ్రీరామానుజుం గాంచి ఊర్ధ్వపుండ్రములను శంఖచక్రములను ధరించుటవలన కలుగు ప్రయోజనమేమని ప్రశ్నింప శ్రీ రామానుజు లిట్లనిరి.

శ్లో. దక్షిణేతు భుజే విప్రో బిభృయాద్వై సుదర్శనం
సవ్యేతు శంఖం బిభృయా దితి బ్రహ్మవిదో విదుః.

కుడిభుజమున సుదర్శనమును, ఎడమభుజమున శంఖమును ధరించుట శుభమని బ్రహ్మజ్ఞానులు పల్కుదురు. (పరాశర స్మృతి).

శ్లో. ధృతోర్ధ్వపుండ్రః పరమీశితారం
నారాయణం సాంఖ్య యోగాభి గమ్యం.

ఏజాతివాడైనను ఊర్ధ్వపుండ్రములను ధరించినవాడై భక్తియోగముచే బొందదగిన సర్వనియంత యగు శ్రీమన్నారాయణు నెరింగినచో సంసారబంధవిముక్తుడై శ్రీ మహావిష్ణువును బొందగల్గును (మహోపనిషత్). ఆత్మబలసమన్వితుడగు శ్రీ రామానుజుని వాక్యములు హృదయమున హత్తుకొన,

శ్లో. యతిరాజ దయాసింధో దీనం మా మవలోకయ
మత్కృతా నపరాధాంస్తాన్ క్షమస్వ బహుధాపురా.

పండితసార్వభౌముడు యాదవప్రకాశుడు శ్రీ రామానుజాచార్యులకు సాష్టాంగ వందనమాచరించి పూర్వము అజ్ఞాన వశమున నేను చేసిన తప్పిదములు క్షమింపుడని ప్రార్థింప కరుణాసముద్రుడగు శ్రీ రామానుజాచార్యులు లేవనెత్తి పంచసంస్కారసంపన్నుని గావించి సన్న్యాసాశ్రమ మొసంగి గోవిందదాసు లని నామధేయమిడి ఇట్లనిరి.

నీవు పూర్వము వైష్ణవు లను యతులను దూషించితివి. ఆ దోషము పోవుటకు ఒక మహాగ్రంథమును వ్రాయుమని అనతీయ యతిధర్మసముచ్చయమను గ్రంథమును వ్రాసి తన పాపమును పోగొట్టుకొని శ్రీరామానుజులను ధ్యానించుచు యాదవప్రకాశులు విష్ణుసాయుజ్య మొందిరి.

## శ్రీరంగమునకు రామానుజులు చనుదెంచుట

శ్రీ రామానుజాచార్యుల ఉనికిచే కాంచీపురము నిత్యసూరులతో ప్రకాశించు వైకుంఠమువలె నొప్పుచుండెను.

రామానుజుల కీర్తి, ప్రతిభ, ప్రజ్ఞ భారతదేశమంతట పరివ్యాప్తమయ్యెను. శ్రీరంగము యామునాచార్య విరహితమై పతిలేని సతివలె నిస్తేజమైయుండ వైష్ణవులందరు యామునాచార్యుల పుత్త్రుడు వరరంగాచార్యులతో నిట్లనిరి.

ఆచార్యా మీ తండ్రిలేని లోటు తీరుటకు ఏ విధముచేతనైనను రామానుజుని శ్రీరంగమునకు గొనివచ్చుచో శ్రీరంగము మారట వైకుంఠమేయగును. అందుకు నీ వొక్కడవే సమర్థుడవని ప్రార్థించిరి. వారి ప్రార్థన మంగీకరించి వరరంగాచార్యులు రామానుజుని శ్రీరంగమునకు గొనివచ్చెదనని ప్రతిజ్ఞసల్పి కాంచీపురమున కేగిరి. శ్రీరంగమునుండి శిష్యబృందముతో వరరంగాచార్యులు కాంచీపురమునకు వచ్చుచున్నట్లు తెలిసికొని రామానుజులు, కాంచీపూర్ణులు, శ్రీ వైష్ణవబృందము పరమానందభరితులై వరరంగాచార్యులకు పూర్ణకుంభములతో నెదురేగి వరదరాజస్వామి సాన్నిధ్యమునకు గొనివచ్చిరి.

వరరంగాచార్యులు తన గానమాధుర్యముచేతను అనేక విధములగు నాట్యభంగిమలతోడను నృత్యముచేయ అచటనున్న వైష్ణవులందరు పరమానందభరితులై ఈ మహనీయుడు యామునాచార్యులకు తగిన పుత్త్రుడేయని ప్రస్తుతించిరి.

వరరంగాచార్యులను సన్మానించుటకు కాంచీపురమందలి వైష్ణవ లోకసదస్సును నేర్పాటుగావించి రత్నఖచితములైన మకర కుండలములతో కాశ్మీరు శాలువలతో సన్మానించుటకు ప్రయత్నింప వరరంగాచార్యు లిట్లనిరి.

జడములైన ఈ రత్నములతో నాకు ప్రయోజనము లేదు. చైతన్యయుతమగు యతిరాజరత్నముకొరకు వచ్చితి.

శ్రీరంగక్షేత్ర వైష్ణవచకోరములు శ్రీ రామానుజచంద్రుని కొరకు నిరీక్షించుచున్నవని పలుక ధర్మసమ్మతమైన ఆచార్యుల వాక్యముల కందరు సమ్మతించిరి. అంత శ్రీరామానుజులు, కూరేశుడు, దాశరథి మొదలగు ప్రముఖశిష్యులు వరరంగాచార్యులు, కాంచీపురమునుండి బయలుదేరి శ్రీరంగక్షేత్రముచేరి పరమపవిత్రమైన కావేరీనదియందు స్నానమాచరించి ఊర్ధ్వ పుండ్రములను ధరించిరి. రామానుజులు శిష్యబృందముతో వచ్చు చున్న వార్త తెలిసి శ్రీరంగమంతయు ఆనంద తరంగములతో నుప్పొంగుచుండెను. శ్రీరంగక్షేత్రవాసులైన పూర్ణార్యులు శ్రీవైష్ణవులు శిష్యులతో చనుదెంచుచున్న శ్రీరామానుజులను గాంచి వైకుంఠనిలయుడగు శ్రీమన్నారాయణమూర్తి యని భావించిరి.

వారందఱు శ్రీరంగమునకు చనుదెంచుచున్న రామానుజులకు, సఫలీకృత మనోరథుడై వచ్చుచున్న వరరంగాచార్యులకు పూర్ణకుంభములతో నెదురేగి సత్కరించి వారలతో సప్తప్రాకారములను దాటి విష్వక్సేనాదులకు నమస్కరించి శ్రీరంగనాయకులు వేంచేసియుండు విమాన మంటపమున కేగిరి.

శ్లో. శయానం శేషశయ్యాయాం అపశ్య ద్రంగనాయకమ్
వివస్వత్కోటి సంకాశం శరచ్చంద్ర నిభాననమ్.

కోటిసూర్యప్రభాభాసమానుడై శేషతల్పశాయియైన శ్రీరంగనాథుని సేవించి శ్రీపాదతీర్థమును శఠకోపమును స్వీకరించి కొని గరుడమంటపమున కూర్చుండిరి.

అంత పూర్ణార్యులు వరరంగాచార్యులు శ్రీవైష్ణవులు శ్రీరామానుజులను పరివేష్టించి ఇట్లు ప్రార్థించిరి:

ధర్మసంస్థాపనార్థమై యుద్భవించిన శ్రీమన్నారాయణుఁడ వని తమ ప్రవర్తనవలన తెలిసికొంటిమి. యామునాచార్య విరహితమై యనాథయైన శ్రీరంగమును దాము సనాథను జేసి యుద్ధరింప శ్రీరంగమునకు విచ్చేయుఁడని యేకగ్రీవముగ నర్థించిరి. ధర్మ సమ్మతమైన వారి ప్రార్థనము నంగీకరించి శ్రీరామానుజులు శ్రీరంగమున నుండుటకు నిశ్చయించుకొనిరి.

రామానుజులు దాశరథి, కూరేశుడు మొదలగు శిష్య వరేణ్యులతో శ్రీరంగమందు స్థిరనివాస మేర్పఱచుకొని, వైష్ణవ తత్త్వప్రబోధము చేయుచు శ్రీరంగ క్షేత్రవాసులు చూపు ఆద రాభిమానములకు ముగ్ధులై, కాంచీపురమును విస్మరించి సుఖముతో కాలము గడపుచుండిరి.

## రామానుజులు గోష్ఠీపూర్ణుల నాశ్రయించుట

శ్లో. గోష్ఠీపూర్ణ గురుశ్రేష్ఠ రహస్యార్థాన్ విశేషతః
మామకాయ వదప్రాజ్ఞ లక్ష్మణార్యాయ ధీమతే.

పూర్ణార్యులు శ్రీరామానుజాచార్యులతో "గోష్ఠీపురమున నొక మహనీయుడు గలడు. వారిని గోష్ఠీపూర్ణులందురు. అమ్మహ నీయుడు యామునాచార్యుల కడ శుశ్రూషజేసి వారి కృపవలన ననేక రహస్యార్థములను దెలిసికొనిరి. నీవు వారి నాశ్రయించి అష్టాక్షరీమంత్రోపదేశము నొందుచో మీకు పరిపూర్ణ జ్ఞానము కలుగు ననిరి. శ్రీ రామానుజులు గోష్ఠీపురమున కరిగి వారిని

సందర్శించి సాష్టాంగప్రణామము గావించి యష్టాక్షరీమంత్రము నుపదేశింపవలసినదిగా ప్రార్థించిరి. గోష్ఠీపూర్ణులు సర్వలక్షణ సంపన్నుడగు రామానుజులనుగాంచి వారిని పరీక్షింపగోరి "మంత్రార్థ మత్యంత దుర్లభమైనది. దాని కధికారి కానరాద"ని పలికి యుపదేశించుటకు విముఖులుగా నుండిరి. ఐనను శ్రీ రామానుజులు పట్టినపట్టు విడువక పదునెనిమిది పర్యాయములు శ్రీరంగమునుండి గోష్ఠీపురమునకు బోయిరి. గోష్ఠీపూర్ణులును శ్రీ రామానుజుని పట్టుదలకు గురుభక్తికి సంతసించి

శ్లో. ఏకఏవత్వమాగచ్ఛ సదండ స్సపవిత్రకః
తస్యవాక్యం తదాకర్ణ్య లక్ష్మణార్యో ముదాన్వితః.

మాఘ శుద్ధ పంచమినాడు నీ వొక్కడవే రావలసినది. వచ్చునపుడు దండమును బవిత్రమును గొనిరావలసినదనియు నాజ్ఞాపించిరి. శ్రీరంగమునుండి శ్రీ రామానుజులు మాఘ శుద్ధ పంచమినాడు బయలుదేరి గోష్ఠీపురముజేరి యిరువురు శిష్యులతో తాము గోష్ఠీపూర్ణులకు సాష్టాంగ వందనముల నాచరించిరి. తనకు నమస్కరించుచున్న రామానుజునితో గోష్ఠీపూర్ణు లిట్లనిరి.

"నిన్నొకడనేకదా రమ్మంటిని. ఇరువురు శిష్యులతో కలసి వచ్చితివే మ"నగా రామానుజులును "వచ్చునపుడు ఉపవీతము, త్రిదండమును గొనిరావలసినదని నా కాజ్ఞాపించితిరిగదా. కాన తాము సెలవిచ్చినట్లు చేసితిని. కూరేశుడు నాకు యజ్ఞోపవీతస్థానీయుడు. దాశరథియే నాకు దండస్థానీయుడ"ని పలికిరి.

చతురమతియైన రామానుజుల వాక్యములకు గోష్ఠీపూర్ణు లానందభరితులై యిట్లనిరి. మంత్రార్థమునకు అర్హత నీయందే

కలదు. నీ కొక్కనికే మంత్రము నుపదేశించెదను. పిదప తగు సమయమున నీయిరువురకు నీవు ఉపదేశింపుమని యాదేశించి రామానుజులకు మాత్రము అష్టాక్షరీమంత్రము నుపదేశించిరి.

శ్లో. మంత్రమష్టాక్షరం దివ్యం సర్వసిద్ధికరం సదా
ముముక్షూణాం సదాజప్యం భుక్తిముక్తి ఫలప్రదమ్.

"ఓం నమోనారాయణాయ" అను నీ యష్టాక్షరీ మంత్రము భుక్తి ముక్తి ఫలప్రదము, సర్వసిద్ధికరము. వైష్ణవుల కింతకు మించిన మహామంత్రము లేదని గోష్ఠీపూర్ణులు రామానుజుల కుపదేశించి సంతృప్తినొందిరి. శ్రీరామానుజులు మంత్రమును మంత్రార్థమును బడసి తన్ను కృతార్థునిగా దలంచుచు సంతసించిరి.

గోష్ఠీపురమునందు నృసింహస్వామి బ్రహ్మోత్సవములు అతివైభవముగా జరుగుచుండెను. ఆ ఉత్సవముల కరుదెంచిన వారిలో కోరినవారికందరికి దయాసముద్రులగు శ్రీరామానుజులు అష్టాక్షరీమంత్రమును బహిరంగముగ నుపదేశించుచుండిరి. ఈవిషయమును తెలిసికొని గోష్ఠీపూర్ణులు రామానుజుల బిలిపించి మిక్కిలి రహస్యమైన యష్టాక్షరీమంత్రమును తరతమ భేదము లెంచక యందఱకు బహిరంగముగా నుపదేశించి గురుధిక్కార మొనర్చితివి. దీనివలన నీకు గలుగు ఫలితమేదో తెలియునా యని యడిగెను. అందులకు రామానుజులు నరకమే ఫలితమని సమాధానము చెప్పిరి. 'తెలిసి యేల పాపమొనర్చితివ'ని గోష్ఠిపూర్ణులు ప్రశ్నించిరి. అందులకు రామానుజులు 'గురువర్యా! నావలన మంత్రమును మంత్రార్థమును దెలిసికొని యిందఱు ముక్తులగుచుండ నేనొక్కడను నరకమనుభవించుట నా మహాభాగ్యమని.

భావించుచున్నాన'ని విన్నవించిరి. గోష్ఠిపూర్ణులు రామానుజుని విశాలహృదయమున కచ్చెరువొంది యిట్లు భావించిరి. తన సుఖమును మాత్రము గోరువాడు అల్పుడు. తన సుఖమును బరుల సుఖమును గోరువాడు మధ్యముడు. పరుల సుఖమునకై తన సుఖమును బరిత్యజించి యెంతటి దుఃఖమునైనను ఓర్చుకొనువాడు మహాత్ముడు. అని శ్రీరామానుజులు అవతారపురుషు లను దృఢ విశ్వాసముగలిగి గాఢాలింగనమొనర్చుకొని "ఎంబెరుమానారే" (మాకు ప్రభువా) యని పలికి యచటనున్న వైష్ణవులను జూచి గోష్ఠిపూర్ణులు 'నేటినుండియు వైష్ణవసిద్ధాంతము రామానుజ సిద్ధాంతమని ప్రసిద్ధినొందునుగాత'మనిరి. అందువలన విశిష్టాద్వైత మతము రామానుజమతమని ప్రసిద్ధమయ్యెను. తదనంతరము గోష్ఠిపూర్ణులవలన రామానుజులు చరమశ్లోకమునుగూడ నుపదేశ మంది గోష్ఠిపురమునుండి శ్రీరంగము చేరిరి.

## శ్రీరామానుజులు తన ప్రతిజ్ఞను నెరవేర్చుకొనుట

శ్లో. శ్రీభాష్యం లోకరక్షార్థం కరిష్యామి న సంశయః
తస్మాదవశ్యం కర్తవ్యం శ్రీభాష్యమధునైవహి.

రామానుజు లిట్లు తలంచిరి. ఆయువు క్షణభంగురము. యామునాచార్యుల చరమదశయందు మూడు ప్రతిజ్ఞలు సలిపి యుంటిని. అందు మొదటిదిగ నా జీవితమును విశిష్టాద్వైతమత ప్రచారమున కంకితమొనర్చితిని. రెండవది శ్రీభాష్యరచనము. అని సంకల్పించి కర్తవ్యపరాయణులైన శ్రీరామానుజులు సకలోప నిషత్సారమును గ్రహించి సుస్పష్టముగా, శాస్త్రసమ్మతముగా,

బ్రహ్మసూత్రములకు విశిష్టాద్వైతపరమగు వ్యాఖ్యయగు శ్రీభాష్యమును విరచించి రెండవప్రతిజ్ఞను నెరవేర్చుకొనిరి.

## కూరత్తాళ్వార్ చరిత్రము

కంచికి సమీపమున 'కూరమ'ను నగ్రహారము కలదు. ఆ యగ్రహారమున కధిపతియగు బ్రాహ్మణశ్రేష్ఠుడు నిత్యసత్యవ్రతుడు, సకలైశ్వర్యసంపన్నుడు, నిరతాన్నదాత. ఆయనకు కూరనాధు డను ప్రసిద్ధికలిగెను. అతని ధర్మపత్నియగు ఆండాళ్ మహాపతివ్రత. ఈ దంపతులు తమ ద్రవ్యమంతయు విశిష్టాద్వైతమత ప్రచారమునకై వెచ్చించి అంతఃకరణప్రేరణమువలన శ్రీరంగక్షేత్రము చేరిరి. జగత్ప్రఖ్యాతి నందిన కూరనాధుడు శ్రీరంగక్షేత్రమునకు విచ్చేయువార్త తెలిసి రామానుజులు వైష్ణవబృందముతో నెదురేగి తోడితెచ్చి వారు నివసించుటకు నొక గృహము నేర్పాటుగావించి సత్కరించిరి.

కూరనాథుఁడు ఉంఛవృత్తితో కాలము గడపుచు రంగనాథుని సేవించుచు మహానందముతో వెలసియుండిరి. శ్రీరంగనాథుని యనుగ్రహమువలన ఆండాళ్ శుభప్రదమైన శుభకృత్ నామసంవత్సర వైశాఖ శుద్ధ పూర్ణిమ యనూరాధానక్షత్రప్రయుక్త పుణ్యలగ్నమునందు జానకీదేవికుశలవులనువలె కవలపిల్లలను బడసెను. అంత శ్రీరామానుజులు పెద్దపిల్లవానికి పరాశరభట్టరనియు, రెండవవానికి వ్యాసభట్టరనియు నామకరణముగావించి, పరాశరభట్టరును తనకు ప్రతినిధిగా విశిష్టాద్వైతసిద్ధాంతసామ్రాజ్యమునకు పట్టభద్రుని గావించి తన మూడవప్రతిజ్ఞను నెరవేర్చుకొనిరి.

శ్రీ రామానుజాచార్యులు అఱువదిసంవత్సరములకాలము శ్రీరంగమందును అఱువదిసంవత్సరములకాలము వేదాద్రి, కాంచీపురము, భూతపురి మున్నగు క్షేత్రములందును వసించి మొత్తము నూటయిరువది సంవత్సరములు జీవించి ఆసేతుహిమాచలము తీర్థయాత్రగావించి తమజీవితమును వైష్ణవమత ప్రచారమునకై వినియోగించి దాశరధి, కూరేశులు, వ్యాసభట్టర్, పరాంకుశ పూర్ణులు మున్నగువారలను విశిష్టాద్వైతమతప్రచారకులనుగా నియమించి

శ్లో. రామానుజో జగామాశు తద్విష్ణోః పరమం పదమ్
మాఖశుద్ధదశమ్యాంతు మధ్యాహ్నే మందవాసరే.

మాఖశుద్ధదశమి శనివారము మధ్యాహ్నకాలమందు శ్రీరామానుజాచార్యులు పరమపదమలంకరించి కృతార్థులైరి.

శ్రీరామానుజాచార్యుల జీవితచరిత్రము విన్నవారు, చదివినవారు, వ్రాసినవారు శ్రీమన్నారాయణుని యనుగ్రహామునకు పాత్రులై అంత్యమందు శ్రీమహావిష్ణు సాయుజ్యముపొంది కృతకృత్యులయ్యెదరు.

ఓం తత్సత్

## విశిష్టాద్వైత సిద్ధాంతము

శ్రీమన్నారాయణు డొక్కడే జగత్కారణభూతుడు. సృష్టికాలమందును, ప్రళయమందును సమస్తభూతములు గలవు. సృష్టికాలమునందు స్థూలరూపముగలిగి ప్రళయకాలమందు సూక్ష్మ

రూపము గలిగియుండును. సూక్ష్మదశలోనున్న జీవజగత్తులకు అంతర్యామియై స్థూలదశను గల్పించి జగన్నాటకమాడించు జగచ్చక్రవర్తి శ్రీ మహావిష్ణువు.

సూక్ష్మదశలోని చేతనాచేతములతోగూడి కారణభూతుడై స్థూలదశలోని చేతనాచేతనములతోగూడి కార్యభూతుడై యుండుటచే కార్యకారణరూపములైన బ్రహ్మలకైక్యముగాన విశిష్టాద్వైతమన బడును. రూపరహితమైన ఆకాశమునుండి వాయువును, స్వప్నమందు సంకల్పమును, రక్తశుక్లకలిత మాంసపిండమునందు రూపమును గ్రుడ్డునందులేని చిత్రములు నెమలిపింఛమునందును బీజమునలేని పరిమళము పుష్పమందును వృక్షమునందులేని మాధుర్యము ఫలమునందును స్వభావముగా గలిగినట్లు స్థిరముగానున్న పరబ్రహ్మమునుండి ప్రపంచ ముద్భవించెను. దూది దూదిగానున్నపుడు కట్టుకొనుటకు కప్పుకొనుటకు వీలుగాదు. వస్త్రరూపము ధరించినపుడే వీలగును. మట్టి మట్టిగ నున్నపుడు స్నానపానముల కుపయోగింపదు. భాండరూపము గలిగినపుడే వీలగును. అటులనే రూపనామరహితమై యొప్పు పరబ్రహ్మమే భక్తుల నుద్ధరించు కొరకు శ్రీమహావిష్ణువై మన దుఃఖములను పోగొట్టును.

అద్వైతు లనునట్లు భగవంతుడు నిరాకారుడైనచో పంచభూతములు, సూర్యచంద్రులు, స్వర్గనరకములు, ఇహపరములు లేనివారమేనందురు విశిష్టాద్వైతులు.

ఓం తత్సత్

# జగద్గురు మధ్వాచార్యుల జీవిత చరిత్రము

శ్లో. శ్రీమన్మధ్వ మతే హరిః పరతరః సత్యం జగత్తత్త్వతః
భిన్నా జీవగణా హరేరనుచరా నీచోచ్చ భావంగతాః
ముక్తిర్నైజ సుఖానుభూతి రమలా భక్తిశ్చ తత్సాధనం
హ్యక్షాదిత్రితయం ప్రమాణ మఖిలామ్నాయైక వేద్యోహరిః.

కర్ణాటకదేశమున శివసారూప్య మను గ్రామముకలదు. అందు మధ్యగేహభట్టు వేదవతి యను పుణ్యదంపతులకు క్రీ. శ. 1199 విళంబినామసంవత్సరము ఆషాఢ బహుళ చతుర్దశినాడు ద్వైత మతస్థాపనాచార్యులు వాయ్వంశమున పుత్త్రుడుగ జన్మించిరి. ఆ మహనీయుని జననకాలమునందు దేవతలు పుష్పములను వర్షించిరి. తలిదండ్రులా బిడ్డకు వాసుదేవాచార్యులని నామ కరణము గావించిరి.

సర్వలక్షణ సమన్వితుడగు నా బాలుడు పాఠశాలకుబోయి యాడుకొనుచుండ గురువుగారు ఆ బాలునిచూచి నీవు చదువుకొన వచ్చితివా? ఆడుకొనుటకా? యని ప్రశ్నింప నేను చదువుకొనియే యాడుకొనుచుంటినని సమాధాన మొసగి ఉపక్రమమునుండి యుపసంహారమువఱకు పాఠ మప్పగించెను. పూవు పుట్టగనే పరిమళించునట్లుగ నితనిలో నా చిన్నతనమునందే వెలసియున్న ప్రతిభనుజూచి గురువుగా రానందభరితులై యాశీర్వదించి పంపిరి. ఒకనాడు వాసుదేవాచార్యులు ఇట్లు భావించిరి. ఉత్కృష్టమగు మనుష్యజన్మమునెత్తి పరమార్థదృష్టిలేక కామినీ కాంచనములందే

నిమగ్నులైన నాస్తికుల యజ్ఞానజాడ్యమునకు విష్ణుభక్తియే దివ్యౌషధము. ఇందుకు సద్గురువు నాశ్రయించి నా జీవితమును ప్రజాసేవ కంకితము చేయవలెనని సంకల్పించి యనంతేశ్వరుని ధ్యానించుచు నిద్రించెను. వాసుదేవాచార్యుల స్వప్నమందు అనంతేశ్వరుడు సాక్షాత్కరించి "ఆచార్యా! ప్రస్తుతము స్వామి సన్నిధియందుగల అనంతప్రేక్షకాచార్యుల నాశ్రయించి సన్న్యసించు టొక్కటే నీ కర్తవ్యమ"ని పల్కి యదృశ్యుడయ్యెను. హస్తినావతినుండి యనంతప్రేక్షకాచార్యులను యతీశ్వరులు ప్రశాంతికై యుడిపి యనంతేశ్వరస్వామి సన్నిధినిజేరి నివసించుచుండ మరునాడుదయమే వాసుదేవాచార్యులు అనంతప్రేక్షకాచార్యులను సందర్శించి సన్న్యాసాశ్రమ మనుగ్రహింపవలసినదని ప్రార్థింప సర్వలక్షణ సంశోభితుడగు నా బాలుని ముఖవర్చస్సునకు, నతని పలుకులలోని మాధుర్యమునకు నచ్చెరువంది యితడు లోకకల్యాణమునకై ప్రాదుర్భవించిన మహాత్ముడని తలంచి యంగీకరించెను.

తలిదండ్రులైన వేదవతియు మధ్యగేహాభట్టును తమ యేకైక పుత్త్రుడు ఆశ్రమస్వీకారము చేయుటకు సంకల్పించుట మున్నుగాగల విషయములను దెలిసికొని దుఃఖించుచుండిరి.

దుఃఖించుచున్న తలిదండ్రులను గాంచి వాసుదేవాచార్యులు ఇక నొక సంవత్సరమునకు దీర్ఘాయుష్మంతుడు, వంశోద్ధారకుడు నగు పుత్త్రుడు మీ కుదయింపగలడు. పిదపనే నే నాశ్రమస్వీకారము చేసెద నని యుపశమన వాక్యములు పలికి వారి నోదార్చెను.

వాసుదేవాచార్యులు పలికినట్టుల నొక సంవత్సరమునకు మధ్యగేహాభట్టునకు పుత్త్రుడు జన్మించెను. ఆ బాలునకు విష్ణు

తీర్థులని తలిదండ్రులు నామకరణము గావించిరి. పిదప అనంత ప్రేక్షకాచార్యుల సన్నిధిని వాసుదేవాచార్యులు సన్న్యాసాశ్రమమును స్వీకరించిరి. గురువు తన శిష్యునకు మధ్వాచార్యులని నామకరణము గావించిరి. లోకకల్యాణమునకై యాశ్రమస్వీకారము గావించిన మధ్వాచార్యులపై దేవతలు పుష్పవర్షమును గురియించిరి. దిక్కులు నిర్మలములై యొప్పెను. నదులు స్వచ్ఛ జలపూరితములై ప్రవహించెను. మధ్వాచార్యులకు ఆనంద తీర్థ భగవత్పాదాచార్యులనియు ప్రసిద్ధికలదు. మధ్వాచార్యులు పదునేడవ సంవత్సరమున నానేతు హిమాలయము పర్యటించి వాదములందు ప్రతిపక్షులను జయించి సర్వజ్ఞు లను ప్రశంసను బొందిరి.

మహాత్ములు తమకొఱకు తపస్సుచేయ నక్కరలేదు. లోకకల్యాణముకొఱకు భౌతికశక్తుల స్వాధీన మొనర్చుకొనుటకు తపస్సు చేసియే తీరవలెను. అందువలన మధ్వాచార్యులు యిరువదవయేట బదరికారణ్యమున శ్రీ మహావిష్ణువును గుఱించి యఖండ తపమొనర్చి విష్ణు సాక్షాత్కారమొంది భగవంతుని యాదేశానుసారముగ ప్రస్థానత్రయమునకు ద్వైతపరముగా భాష్యములను వ్రాసి జగత్ప్రఖ్యాతి నందిరి.

మానస సరోవర ప్రాంతమందు వేదవ్యాసాశ్రమము గలదు. వేదవ్యాసులు బదరికాశ్రమమందుగల మధ్వాచార్యులను నాహ్వానించిరి. ఆ యాహ్వానమును బురస్కరించుకొని మధ్వాచార్యులు శిష్యబృందముతో వచ్చుచుండ వేదవ్యాసాశ్రమవాసులు పూర్ణకుంభములతో నెదురేగి స్వాగత మొసంగిరి. మధ్వాచార్యులు వేదవ్యాసమహర్షికి నమస్కరించి ద్వైతపరముగ తాను రచించిన ప్రస్థానత్రయ భాష్యమును విన్పింప వేదవ్యాసులు

పరమానందభరితులై వారిని పూర్ణప్రజ్ఞులని యాశీర్వదించిరి. సఫలీకృత మనోరథుడైన యాచార్యులు గోకుల బృందావన యాత్రకు బయలుదేరిరి.

మధ్వాచార్యులకు మార్గ మధ్యమందు జగన్మోహన సౌందర్యముగల కృష్ణవిగ్రహము కన్పింప వారు పరమానంద మొంది యా దివ్యమంగళ విగ్రహమును ప్రాణప్రదముగా భుజములమీద నిడుకొని బృందావనయాత్ర పూర్తిచేసి యంత రంగ శిష్యుడైన జయతీర్థులను ఉడిపియందు ఆ శ్రీ కృష్ణవిగ్రహ మును ప్రతిష్ఠింప నియమించిరి.

అక్షోభ్యతీర్థులు, పద్మనాభతీర్థులు, నరహరితీర్థులు, మాధ తీర్థులు అను నలుగురు శిష్యులను ద్వైతసంప్రదాయ ప్రవక్తలుగా నియమించిరి.

మధ్వాచార్యులు డెబ్బదియేడుసంవత్సరముల ఆఱునెలల యిరువదిదినములు స్వసంప్రదాయస్థానము నధిరోహించి పద్మనాభ తీర్థులను తమ స్థానమున నాచార్యునిగా పట్టాభిషిక్తులను గావించి బదరికాశ్రమమునకు జని నిరంతరము మహర్షులతో తత్త్వచింతన చేయుచు మధ్వసిద్ధాంతము (ద్వైతమతము) భూమండలమున పరివ్యాప్తముగావలెనని శ్రీమహావిష్ణుని ధ్యానించుచు విష్ణుసాయుజ్యము నొందిరి.

## ద్వైతసిద్ధాంతము

ప్రపంచము, పరమాత్మ రెండును సత్యములే. ప్రపంచమునకు ప్రకృతి పరమేశ్వరుడు కారణభూతులు. ఈ రెండుతత్త్వములు నిత్యములు. ప్రకృతి పరమేశ్వరాధీనముగాన జగత్తు బ్రహ్మాధీనము.

మధ్వాచార్యులు జీవబ్రహ్మైక్యసిద్ధాంత ప్రచారమున నిరుత్సాహము, నిస్పృహజనించిన కాలమున జీవుని వ్యక్తిత్వమును కనబఱచిరి. భగవంతుడు పరిపూర్ణుడనియు, దోషరహితుడనియు ప్రబోధించి ముముక్షువుల దృష్టిని బ్రహ్మజిజ్ఞాసకు పురికొల్పి భగవత్తత్త్వమును ప్రబోధించిన జగద్గురువు మధ్వాచార్యులు సర్వలోకవంద్యులు. అద్వైతులు చెప్పునట్లు బ్రహ్మము నిర్గుణము కాదు. సగుణము, సచ్చిదానందస్వరూపము, సృష్టిస్థితిలయములకు కారణము, సమస్తకల్యాణగుణపరిపూర్ణము, దోషరహితము, సర్వవ్యాపకము, సర్వప్రేరకము ఆ బ్రహ్మమే నారాయణుడు. అతడు ప్రపంచమునకు మూలకారణుడు. అతనికి సమానుడుగాని యతనికంటె నుత్తముడుగాని మఱియొకడులేడు. అతడు జీవునకు సాధ్యుడు. ప్రతిఫలాపేక్ష లేక యందఱను తండ్రివలె నాదరించువాడగు భగవంతునియొక్క కల్యాణగుణములను జీవులు తమతమ శక్త్యనుసారముగ తెలిసికొనగలుగుదురు. వేదములన్నియు నతని మహిమను వర్ణించుచున్నవి. అతని యనుగ్రహమువలననే మన మతనిని పొందగలుగుదుము. సమస్త కల్యాణగుణ పరిపూర్ణుడు దోషరహితుడు శ్రీమహావిష్ణువు. అతడు సర్వోత్తముడు, ఇట్లు విశ్వమునకు భక్తితత్త్వమును ప్రబోధించిన జగద్గురువు శ్రీమదానందతీర్థ భగవత్పాదాచార్యులు సర్వలోకవంద్యులు.

ఆంధ్రప్రదేశము పశ్చిమగోదావరిజిల్లా పాలకొల్లు శ్రీకృష్ణాశ్రమ
స్థాపకులగు నిశ్చలానందస్వామిచే విరచితమగు
విశ్వజ్యోతి కావ్యము మొదటిఅధ్యాయము
సంపూర్ణము.

# వి శ్వ జ్యో తి

## రెండవ అధ్యాయము

## శ్రీవాసవీ కన్యకా జీవిత చరిత్రము

శ్లో. శ్రీమద్భారతదేశరక్షణపరాం సర్వేశ్వరీం సర్వదాం
దివ్యాష్టాదశ పీఠసంస్థితకళారూపాం జగత్పావనీమ్
జాతాం శ్రీపెనుగొండ పట్టణవరే శ్రీవైశ్యవంశోద్భవాం
సేవే వాసవికన్యకాం సకరుణాం చిన్మూర్తి మత్యాదరాత్.

శా. అల్లాయంచు మహమ్మదీయులు జహోవాయంచు సత్క్రైస్తవుల్
పుల్లాబ్జాక్షయటంచు వైష్ణవులు శంభోయంచు శైవుల్ సదా
ప్రోల్లాసంబున గొల్వనెల్లరకు సంపూరాయురారోగ్య సం
పల్లాభంబు లొసంగి ప్రోచు పరమాత్మా! నిన్ను సేవించెదన్.

శ్లో. శ్రీమద్వైశ్యకులాబ్ధికైరవహితం ప్రేమాస్థితం ధీయుతం
సత్యాన్వేషణ తత్పరం భరతభూస్వాతంత్ర్య సంధాయకమ్
జ్ఞానాజ్ఞానవిచక్షణం మునివరం స్వార్థక్రియా దూరగం
గాంధీం మోహనదాసనామక మహాత్మానం భజేహం భృశమ్.

## చరిత్ర ప్రసిద్ధమగు పెనుగొండ

శ్రీ వాసవీకన్యకా జన్మస్థానము పెనుగొండ యన్నది ప్రసిద్ధము. కాని నేడు పలుచోట్లలో పెనుగొండ యను పేరుగల గ్రామములు కలవు. వీనిలో నేది పరమేశ్వరియొక్క జన్మస్థానమగునో నిర్ణయింపవలసియున్నది.

పశ్చిమగోదావరిజిల్లాయందున్న పెనుగొండసమప్రదేశము. ఇచట కన్యకాపరమేశ్వరీ ఆలయము కలదు. అనంతపురముజిల్లా యందుగల పెనుగొండ పర్వతప్రాంతము. ఇక్కడ కన్యకాపరమేశ్వరీ ఆలయము కలదు. దక్షిణ కన్నడ(సౌత్ కెనరా)అ. 8000.ల ఎత్తుగల పీఠభూమి. ఇక్కడ నొక పెనుగొండ గలదు. దీనిని అక్కడివారు 'దొడ్డబెట్ట' అందురు. ఈమూడు పట్టణములందును వైశ్యులు గలరు. ఈ మూడు ప్రదేశములలో నేది వాసవీదేవి యొక్క జన్మస్థానమగునో తెలియక యనేకులు అనేకవిధములుగా చెప్పుచుందురు.

శాసనములను, చరిత్రలను బరికించినచో శ్రీవాసవి జన్మభూమి పశ్చిమగోదావరిజిల్లా యందుగల పెనుగొండ యనియే నిర్ధారణ మగుచున్నది.

పెనుగొండ యనుపేరు ఏర్పడుటకు కారణము, వైశ్యుల యాదినివాసము హిమాలయపర్వతమందుగల మహాగిరి. కాన వారీప్రదేశమునకు తమ మొదటి జన్మభూమిని జ్ఞాపకముంచుకొనుటకై పెనుగొండయని పేరు పెట్టుకొనిరి. పెనుగొండ యనగా మహాగిరి.

# ఆర్యవైశ్యులు కొలతలలో ప్రారంభమున లాభమనుటకు కారణము

## ధర్మనందన చరిత్రము

క్రీ. పూ. 560 సంవత్సరమున నర్మదానదీ సలిలప్రపూరితమై, గోసంరక్షణమునకు ప్రసిద్ధిచెందియుండిన ప్రతిష్ఠానపురమున శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడు నగు చూడామణియను వైశ్యుడు గలడు. అతని ధర్మపత్ని సౌభాగ్యవతి. ఆ పుణ్యదంపతులకు చైత్ర శుద్ధ దశమి, భానువారము, పునర్వసు నక్షత్రము కూడిన శుభదినమున సింహలగ్నమునందు బ్రహ్మవిదుడగు పుత్త్రుడు జన్మించెను. దైవజ్ఞులు ఆ బాలునకు ధర్మనందనగుప్త యని పేరిడిరి.

అతడు గురుకులమున చ్యవనమహర్షి యొద్ద వేదాధ్యయన మొనర్చుచు నొకనాడు ఫలములకొఱకు నరణ్యమునకు పోగా రోదనధ్వని వినిపించెను. అచటికిపోయి చూడగా నొక కిరాతుడాంగీరసుడను బ్రాహ్మణుని బంధించి కొనిపోవుచుండ ధర్మనందనగుప్త చూచి కిరాతునితో 'దుర్మార్గుడా! బ్రాహ్మణ హింస రౌరవాది నరకప్రాప్తికి కారణమగును. ఏల యింతటి పాపమున కొడిగట్టెదవు? నీవు కోరినంత ద్రవ్యమిచ్చెదను. ఈతనిని వదలి పెట్టుము'' అనగా నతనితో కిరాతుడు

శ్లో. శక్త్యై వింధ్యనివాసిన్యై వార్షికం పౌరుషం బలిం
దాతవ్యం కిలమే వత్స హ్యేత ద్వంశానువర్తనమ్.

వింధ్యపర్వతనివాసిని మహాకాళి మా యిలువేల్పు. ఆ దేవికి ప్రతిసంవత్సరము నరబలి నొసంగుట మా వంశాచారము. అందువలన నీ ధనముతో నాకు పనిలేదనెను. అంత ధర్మనందనుడు విచారముతో బోయరేడా! భయభ్రాంతుడైన యీ బ్రాహ్మణుని వదలిపెట్టుము. మహాకాళికి బలినిమిత్తమై నేను నీవెంటవచ్చెదను. అందువలన బ్రాహ్మణప్రాణ సంరక్షణ పుణ్యఫలము కలుగుటయే కాక నీ కోరికయు నెఱవేఱును. అని ధర్మయుక్తముగ పలుకగా నతని వచనములకు సమ్మతించి బ్రాహ్మణుని విడిచిపెట్టి ధర్మనందనుని తనవెంట గొనిపోయెను.

ఆ సమయముననే జయసింహుడనురాజు తన సైన్యములతో వేటనిమిత్తమై యచ్చటికి వచ్చెను. కిరాతు డా రాజును చూచి భయభ్రాంతుడై ధర్మనందనా! నేను వచ్చువఱకు నిందుండుమని పలికి యొక బిలముననుంచి చాపరాతిచే నా బిలమును కప్పిపైచి సమీపమందుగల వృక్షమునెక్కి గుబురుగనున్న యాకుల నడుమ దాగియుండెను. జయసింహుడు విశ్రాంతికొఱకు నా వృక్షచ్ఛాయను విడిసియుండి దైవవశమున జెట్టుపై చూపులబఱపి యందు దాగిన కిరాతుని జూచి యెవరిప్రాణములు తీయుటకు పొంచియున్నావ'నుచు నతనిపై బాణమును బ్రయోగింప నతడు మరణించెను. కైలాసనివాసియగు పరమేశ్వరునకు కంఠాభరణమగు వాసుకికి పాతాళనివాసియగు నాదిశేషుడు ఆహ్వానము పంపగా వాసుకి జ్యేష్ఠభ్రాతపిలుపును శిరసావహించి కైలాసమునుండి శరవేగమునవచ్చి పాతాళబిలము మూయబడి యుండుటచూచి యే దుర్మార్గుడో మార్గావరోధము కల్గించెనని పూత్కరించెను. వాసుకి విషాగ్నిజ్వాలలకు బిలద్వారమున కడ్డముగనున్న బండ

భస్మమయ్యెను. అంత గుహాంతర్భాగమున బాలభానునివలె దివ్య ప్రకాశముతో నొప్పుచు నంతర్ముఖుడై యున్న ధర్మనందనుని గాంచి వాసుకి యాశ్చర్యచకితుడై,

"నాగలోకస్య మార్గోహి కిమర్థ మిహాతిష్ఠసి"

మహాత్మా! ఇది పాతాళమార్గము. ఇందేల వసించెదరన్న ధర్మ నందను డిట్లనెను. 'మహాశయా! ఈ శరీరమును బ్రాహ్మణ ప్రాణసంరక్షణకొఱకు బోయవానికి దత్తము చేసితిని. ఆతడు కారణాంతరమున నన్నిందుంచెను అనగా విని వాసుకి ధర్మ నందను నాత్మార్పణశీలమునకు ముగ్ధుడై నమస్కరించి పాతాళ లోకము చేరెను.

అక్కడ కర్కోటకుడు మున్నగు మహానాగములచే పరి వృతుడై యధ్యక్షపీఠము నలంకరించియున్న యాదిశేషునకు వాసుకి నమస్కరించెను. ఆదిశేషుడు సభలో నాసీనులై యున్న వారలంజూచి 'కృతయుగమునుండి నేటివఱకు దానశీలమున నత్యు త్తముడుగా గణింపదగిన వాడెవడ'ని ప్రశ్నింప కొందఱు మాంధాతయనియు, కొందఱు బలిచక్రవర్తియనియు, కొందఱు శిబిచక్రవర్తియనియు దమకు తోచిన వారిని పేర్కొనుచుండ వాసుకి "వీరు పేర్కొన్న వారందఱకన్న ధర్మనందనగుప్త యధికుడు. వారందఱు నడిగిన దానినిచ్చినదాతలు. ధర్మనందన గుప్త కిరాతునకు కోరకయే తనప్రాణము లర్పించిన మహాదాత' యని యతని వృత్తాంతమును వినిపించెను. సభాసదు లందఱు నాశ్చర్యమొంది వాసుకిని నా మహాత్ముని సందర్శన భాగ్యమును గల్గింపవలసినదని ప్రార్థింపగా వాసుకియు నంగీకరించెను. బిల ద్వారమునకు వచ్చి ధర్మనందనునకు నమస్కరించి కిరాతుడు మర

ణించిన వృత్తాంతమును దెల్పి యాదిశేషుని సన్నిధికి దోడి తెచ్చెను. అంత ధర్మనందనుడు ఆదిశేషునకు నమస్కరించి యిట్లు స్తోత్రము చేసెను.

శ్లో. ఫణామణి వినిర్ధూత సమస్త తిమిరాయచ
ఆదిదేవాయ శాంతాయ భోగినాం పతయే నమః.

స్వార్థరహితుడవై ప్రపంచశ్రేయముకొఱకు వేయి పడగల మీద భూభారమును ధరించిన మహనీయుడవని యనేక విధముల ప్రార్థింప నాదిశేషు డనుగ్రహించి వరము కోరు మనగా ధర్మ నందనుడు "ప్రణవస్వరూపిణియు సమస్త బ్రహ్మాండములకు నాధారభూతయు నగు పరమేశ్వరియందు నా చిత్తము స్థిరముగ నుండున ట్లనుగ్రహింపుమ"ని కోరెను. ఆదిశేషు డట్లే యగుగాక యని యనుగ్రహించి "ధర్మనందనా! నీకొఱకై నీ తలిదండ్రులు నిరీక్షించుచున్నారు. త్వరగ నరిగి వారి చింత మాన్పు మన ధర్మ నందను డతనియొద్ద సెలవుగైకొని ప్రతిష్ఠానపురమును జేరెను. అతనిని చూచి తలిదండ్రులు మిక్కిలి యానంద మొందిరి.

ఆ ధర్మనందనుడే పునర్జన్మమున లాభగుప్తగ జన్మించెను. ఇతనిని నాగాఖ్యుడనియు నందురు. ఇతనిభార్య నారీమణి. నూట రెండు గోత్రముల యార్యవైశ్యుల యగ్నిప్రవేశ సమయమందు లాభగుప్తయు నారీమణియు నాదర్శప్రాయులై ప్రథమమందు భాస్కరాచార్యునిచేత వీరకంకణమును గట్టించుకొని యగ్నిప్రవేశ మొనరించిరి. ఇతనికి సంతానము లేనందున నితనిగోత్ర మంత రించెను. అందువలన నూటయొక గోత్రములు మాత్రమే నిలిచి యుండెను. లాభగుప్త యాదర్శప్రాయుడగుటచే నార్యవైశ్యులు కృతజ్ఞత కొఱకు "కాశ్యపఋషి గణముఖికుల" గోత్రము వారికి

దైవకార్యములయందు శుభకార్యములయందు ప్రథమ తాంబూలము నిచ్చి దైవసాన్నిధ్యమున నుంచెదరు. శ్రీవాసవి గోత్రము వారికి ద్వితీయ తాంబూల మిచ్చెదరు.

(ప్రాభాతసఋషి-పెండ్లికుల)

తదుపరి తక్కినవారికి తాంబూలమిచ్చు నాచారము నేటికిని పలుప్రాంతములందు గలదు. ఇత డాదర్శప్రాయుడగుటచే ఆర్య వైశ్యులు కొలతలయందు ప్రారంభమున లాభమని యితనిని స్మరించుట సంప్రదాయమైనది.

## కుసుమశ్రేష్ఠి వృత్తాంతము

పరమ పవిత్రమైన భరతఖండమున నాంధ్రదేశ మత్యంత ప్రసిద్ధమైనది, అయ్యది తృణ కాష్ఠ జల సమృద్ధమై పవిత్రనదీమ తల్లులతో సకలభాగ్యముల కాలవాలమై సర్వశోభాయమానమై వెలసియున్నది. గోదావరి, కృష్ణ, పినాకిని, తుంగభద్ర మున్నగు నదు లందలి ప్రజలకు స్నానపానముల కుపయోగపడుచు నాంధ్రావనిని యావద్భారతదేశమునకు ధాన్యాగారముగ నొనర్చి రక్షించు చున్నది. అందు గోదావరి నాసికా త్ర్యంబకమునందు జన్మించి తొమ్మిదివందల మైళ్లు ప్రవహించి తూర్పుకనుమలనుదాటి సముద్రములో ప్రవేశించుటకుముందు సప్తర్షులచే ప్రార్థింపబడి వారి వారి నామములతో నొక్కొక్కపాయగా చీలి సముద్రములో కలియుచున్నది. ఆ పాయలకు గౌతమి, వృద్ధగౌతమి, తుల్యా, ఆత్రేయ, భారద్వాజి, కౌశికి, వాసిష్ఠి యను పేర్లేర్పడినవి. అందు వాసిష్ఠీనదికి పశ్చిమమున పెనుగొండ పట్టణము మహోన్నతమై

యున్నది. ఆ నగరమునకు చుట్టును (1) నిరవద్యకము, (2) ఏలూరు, (3) నారాయణపురము, (4) విశాలము, (5) శివపురము, (6) ఆచంట, (7) నరసాపురము, (8) ధనదము, (9) ధర్మము, (10) జగన్నాథపురము, (11) కళింగము, (12) పాంచాలము, (13) పాలకొల్లు, (14) త్రిగుణము, (15) భీమవరము, (16) ఘంటసాల, (17) పిఠాపురము అను నగరములు గలవు. ఈనగరముల కన్నింటికి (18) పెనుగొండయే ముఖ్యపట్టణమై యలరారుచున్నది.

కుసుమశ్రేష్ఠి ఆ పట్టణమును రాజధానిగా చేసికొని యా ప్రాంతమును పాలించుచుండెను. అతడు

సీ. నిరుపేద విద్యార్థు లరుదేర ముదమార
        బరితృప్తుల నొనర్చి పంపుచుండు
సుకవీశ్వరులు తన్ను జూడవచ్చిన యంత
        గనకాభిషిక్తులగా నొనర్చు
దేవ భూదేవ సేవావిశేషములందు
        నందఱి కన్న ముందంజవేయు
నఖిల సత్కార్య ప్రయత్నములకు మార్గ
        దర్శియై ప్రజల ప్రోత్సాహపఱచు

సకల వైశ్యసభా ప్రదేశములయందు
నగ్రపీఠాదికారంబు నందుచుండు
వరహితుడు బంధుడు విభుండు గురుడు నగుచు
నాటి పెనుగొండ పురి వైశ్యకోటి కతడు.

పేదవిద్యార్థులకు ద్రవ్యదానము, కవులకు సువర్ణదానము, బ్రాహ్మణులకు భూదానము, దైవకార్యములకు వివిధార్థప్రదానము గావించుచు సత్కార్యాచరణమున కాదర్శప్రాయుడై ఐశ్వర్యమున కుబేరుడై వెలసియుండెను. అన్నివిధముల నతని కీడుజోడై పతివ్రతాతిలకమన్న ప్రసిద్ధినందిన యాతని ధర్మపత్ని కుసుమాంబ యొకనాడు పతిచరణముల నొత్తుచు దీనముగ నిట్లనెను.

"నాథా! సంసారవృక్షమునకు అమృతఫలమగు సంతానము లేని యఖండైశ్వర్య మడవిగాచిన వెన్నెలవలె నిష్ప్రయోజనము గదా!

దినమణి రానిరోజు కడుధీమణి మంతిరి లేనిరాజు వా
సన గనరానిపూవు బుధసంతతి గల్గనితావు రేనిపా
లనము లేని ధాత్రి మృగలాంఛను డొప్పనిరాత్రి సంతతిన్
గనని విభూతి వ్యర్థములు గావొకొ బూదినిబోయు నేయిగన్.

ఫాలంబందున గ్రమ్మ ముంగురులతో బంగారు మై చాయతో
గాలందెల్ ఘలుఘల్లు మంచు మొఱయంగా నాడు నాట్యంబుతో
బాలిమ్మంచును జేరవచ్చు పసిపాపం గౌగిటం జేర్చి చ
న్బాలానించెడు ముచ్చటల్ గలవె యీ పాపిష్ఠ జన్మంబునన్.

పాలబుగ్గల పసిపాపలను లాలించు భాగ్య మీ జన్మమునకు లేకపోయినది గదా! యని కంట తడిబెట్టగా కుసుమశ్రేష్ఠి కుసుమాంబ ముంగురులను సవరించుచు నోదార్చుచు నిట్లనెను. "ప్రాణేశ్వరీ! సంతానము కలిగినంత మాత్రమున దుఃఖము తీరునా? ఆ కలిగిన సంతానము అంగవికలులైనను అజ్ఞానులైనను దుఃఖము,

తలిదండ్రులకు తమ వార్ధక్యమున నా బిడ్డలు ఆదరింపనిచో దుఃఖము. ఇట్లు పలుదుఃఖములకాస్పదమగు సంతానము కలిగినను, లేకున్నను దుఃఖము తప్పదు. ప్రపంచము శోకమయము. భగవంతు డానందమయుడు. సుఖదుఃఖములు రెండును మనోధర్మమే గాని యాత్మధర్మముకాదు. కాన నీ మనస్సును అనిత్యములు, సుఖాభాసములు నగు ప్రపంచ విషయములందుండి మరల్చి నిత్య సుఖప్రదుడగు భగవంతుని యందు జేర్చుట శ్రేయమని హితమును బోధించి మఱియు నిట్లనెను.

"సుతులచేత పుణ్యసుగతి నొందుదునని
మనుజుడుండు కర్మ మతము దగిలి
ఏనుగు పడియున్న యెత్తునా మశకంబు"

"సతుల జూడజూడ సంసారి కాగోరు
సుతులు పుట్టబుట్ట వెతలబడును
గతులు చెడగ చెడగ కర్మమం చేడ్చురా"

ప్రాణేశ్వరీ! ఏనుగు ఎత్తుబడిన దోమ యెత్తగలదా? పట్టుపురుగు తాను అల్లుకొను గూటిలో బంధింపబడి దుఃఖముల పాలగునట్లు దుఃఖము ఆగంతుకమని తెలిసి యాత్యంతిక దుఃఖ నివృత్తికి, సత్య సుఖప్రాప్తికి పరమేశ్వరుని ప్రార్థింపుము"— అనగా విని కుసుమాంబ యిట్లనెను. "నాధా: మీరు మహాత్ములరు. నేనో అల్పమతిని. ఐనను ఒక్క మనవి. త్రేతాయుగమందు దశరథచక్రవర్తి, సంతానప్రాప్తికై పుత్రకామేష్టి నొనర్చ రత్నములవంటి రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు జన్మించిరి. సత్సంతానము ఇహపరసాధకములని శాస్త్రములు ప్రశంసించుట మీ రెఱుం

గనిదికాదు.'' అని తన యావేదనను వెలిబుచ్చెను. కుసుమాంబ పలికిన ధర్మసమ్మతమైన వాక్యములకు సమ్మతించి శ్రేష్ఠియు పదునెనిమిది నగరములందు గల 714 గోత్రముల వారి కాహ్వానము లను బంపి వారిని వెంట నిడుకొని భాస్కరాచార్యు లను సందర్శించెను. కుల గురువగు భాస్కరాచార్యులు తనకు నమస్కరించిన శిష్యులను ఆశీర్వదించి తన దివ్యదృష్టిచే వారి రాకకు గారణమును గ్రహించి యిట్లనెను.

శ్లో. దాక్షాయణీ యోగ విసృష్ట దేహా
పునర్హిమాద్రే స్తనుజా బభూవ
సాస్వాంశతః కీర్తి కుమారికాభూత్
సైవాధునా వాసవి కన్యకాస్యాత్.

పూర్వజన్మమందు జగన్మాత దక్షప్రజాపతి పుత్రిక దాక్షాయణియై జన్మించెను. ఆమె తన తండ్రిచే పరాభవింపబడి యోగాగ్నిని కల్పించుకొని శరీరము చాలించి రెండవ జన్మము నందు మేనకా హిమవంతులకు పార్వతియను పేర కుమారియై జన్మించెను. ఆమెయే మూడవ జన్మమందు సోమదత్త మహర్షికి కుమారియై జన్మించి కీర్తికన్యక యను పేర ప్రఖ్యాతి నొందినది. ఆమెయే నీకు పుత్రికగా జన్మించి వాసవీకన్య యను పేరితో ప్రసిద్ధి నందగలదు. అని పలుకగా గురువుల యనుగ్రహమునకు వారు పరమానందభరితులై పార్వతీదేవి చరిత్రయు, కీర్తికన్యకా వృత్తాంతమును వినగోరుచున్నామని ప్రార్థించిరి. అంత భాస్కరా చార్యు లిట్లు చెప్పదొడగిరి.

## పార్వతీపరిణయము

శ్లో. శ్రీగౌరీం ధృతపంకజాం త్రిణయనాం
శ్వేతాంబరాం సింహగాం
చంద్రోద్భాసిత శేఖరాం స్మితముఖీం
దోర్భ్యాం వహన్తీం గదామ్
విష్ణ్వింద్రాంబుజయోని కామత్రిదశై
స్సంపూజితాంఘ్రిద్వయాం
గౌరీం మానసపంకజే భగవతీం
భక్తేష్టదాం త్వాంభజే.

దాక్షాయణి దక్షప్రజాపతిచే పరాభవింపబడి పునర్జన్మమందు నోషధీప్రస్థపురాధీశ్వరుడగు హిమవంతునకు జన్మించి పార్వతి యను పేర ప్రసిద్ధిగాంచెను. ఆమె మేనకాహిమవంతుల భవనమున శుక్లపక్షచంద్రబింబమువలె దినదిన ప్రవర్ధమానయై నిరంతరము పరమేశ్వరుని ధ్యానించుచుండెను. పరమశివు డామె భక్తికిమెచ్చి స్వప్నమున సాక్షాత్కరించెను.

సీ. పులికళాసమున నిశ్చల పూర్వకాయుడై
పర్యంకబంధోర్ధ్వపాణి యగుచు
సర్వోన్నమద్వృద్ధ జడలురోభాగరు
ద్రాక్షమాలికలతో రాపులాడ
మించివాయువుల కుంభించి కపాలని
ర్గత తేజమున జంద్రకళనుగప్పి
నాసాగ్రదృష్టి సనశ్వరంబగు నాత్మ
సాక్షాత్కృతిం బొంది శబ్దభంగ

రహిత రత్నాకరంబునా లలినెసంగి
నిత్యశుద్ధమ్మ బుద్ధమ్మ నిర్మలమ్మ
నద్వయంబును సచ్చిదానంద మాత్మ
తాన యగుచు శివుండు ప్రత్యక్షమయ్యె.

తలమీద నర్ధచంద్రుడు, జడలలో జాన్హవి, భుజములందు సర్పహారములు, వక్షస్థలమందు రుద్రాక్షమాలలు, నడుమున పులిచర్మము, చేత త్రిశూలము మెఱయ నిజతేజస్సముపేతుడై నిస్తరంగ సముద్రముపగిది ప్రశాంత గంభీరాకృతితో సాక్షాత్కరింప హైమవతి మేల్కాని నిత్యసుఖప్రదుడగు పరమేశ్వరుని యనుగ్రహము పడయగోరి జయవిజయులను చెలులతో యోజన విస్తీర్ణమైన వటవృక్షముక్రింద పర్ణశాలలో తపము సల్పుచుండెను. ఆమె నిశ్చలచిత్తమునకు పరమేశ్వరు డానందభరితుడై యామె తపమొనరించుచున్న వటవృక్షముకడకు బ్రహ్మచారి రూపమున వచ్చి యామె చిత్తమును బరీక్షింపదలచి యిట్లనెను.

సీ. రత్నముల్ వలయునా రత్నాకరంబు నీ
యన్నయౌ మైనాకు డున్నచోటు
ఐశ్వర్యమేదైన నభిలషించెదవేని
స్వర్ణసానువు నీదు జనని తండ్రి
స్వర్గలోక నివాస సౌఖ్యము గోరిన
నీవు పుట్టినయిల్లు దేవభూమి
వరుని గోరితి నంటివా వృథా యాతడే
శోధించి వచ్చు నీ సోయగంబు

నటులగాదేని నీ కష్ట మభవుడెఱుగు
క్రమతమమైన యట్టి నీ గాత్రసుమము
భోగ బాహ్యమ్ముగా వాడి పోవనేల?
తెల్పవే వారిజాక్షి నీ దృఢమనమ్ము.

'పర్వతరాజపుత్త్రీ! నీవు పవిత్రాత్ముడైన హిమవంతుని పుత్త్రివి. నీ జన్మభూమియే స్వర్గసదృశము. నీ మాతామహుడు బంగారుకొండ. నీ భ్రాత మైనాకుడు రత్నాకర నివాసి. నీవు సహజసౌందర్యవతివి. ఈ నవయౌవనమున నిట్టి ఘోర తప మేల పూనితివి? నేను బ్రాహ్మణ బ్రహ్మచారిని. నీయిచ్ఛ ననుస రించి సంచరించెద. నన్ను వివాహమాడు మ'ని పలుకుచున్న యా వటుని యభిప్రాయమెఱింగిన పార్వతికి బదులుగ నామెచెలి యగు జయ యా బ్రహ్మచారికి నమస్కరించి మహాత్మా! ఈమె పరమే శ్వరు నాత్మేశ్వరునిగా భావించి తపము సలుపుచున్నది. మా చెలిపై యతని కెన్న డనుగ్రహము కలుగునో యనెను.' బ్రహ్మ చారి మందస్మితముతో జయనుజూచి యిట్లనెను.

సీ. చిటచిట ధ్వనులలో నెగలు జల్లెడి కన్ను
లా ముఖమ్మను ముద్దులాడు టెటుల
కన్నుబుస్సని యాడు కటిత్రాచుగములున్న
కంఠంబు నేరీతి గౌగిలింప
గుచ్చుకోనెముకలు గోలవెట్టెడి పుఱ్ఱె
లాముఖంబును కూర్మి నానుటెటులు
కట్టిన పులితోలు గని కడుభీతితో
బర్వెత్తు నెద్దుపై పయనమెటులు

బ్రతుకు తిరిపెము వాసము వల్లకాడు
భూతిపూత దిగ్వసనంబు బొల్లియెద్దు
వాహనము దలయేటి చేపలను గొలుకు
కొంగగోల; కాపురమెట్లు గూడు నీకు ?

అయ్యారే! పద్మనయనమునకు వికృతనయనమా? చంప నపు బూతకు చితిభస్మమా! పట్టుపుట్టమునకు పులిచర్మమా? రత్నాలమాలకు కపాలమాలయా? భర్మ్యహర్మ్యమునకు శ్మశానమా? దేనికి దేనితో పొత్తు? నీ యభిప్రాయము నెఱింగిన ప్రజలు నవ్వరా? యని పలుకుచుండ పార్వతి యాగ్రహించి యిట్లనెను. "ఇక నీమాటలు కట్టిపెట్టుము.

సీ. తనదు భక్తులకు సుందర హర్మ్యముల నిచ్చి
తా నివసించు కందరములందు
దనదు భక్తులకు కుందనపుమాలికలిచ్చి
తా దాల్చు రుద్రాక్ష తావళములు
తనదు భక్తులకు చందనచర్చ లొనగూర్చి
తన దేహమున భస్మమును ధరించు
దనదు భక్తులకు కేదారమ్ముల ఘటించి
తా నివసించు శ్మశానమందు
మునుగ ద్రావగ మున్నీరు మోసి తెచ్చి
కాలకూటము మ్రింగి లోకాల గాచె
త్రిపురముల గూల్చి జగముల తీరు నిల్పె
ఖండపరశుండు గజచర్మ మండనుండు.

అతడు అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు. సర్వకారణ కారణుడు. అతని నిందించువారికే గాదు, ఆ నిందలను వినువారికి

గూడ దోసము కలుగును. ఇటనుండి నీవు కదలనిచో నేనే కదలి పోవుచున్నానని తటాలున లేచి పార్వతి పైట సవరించుకొనగా,

సీ. ఈశార్పణముగ నర్చించుట తన యుర
మున ప్రకాశింపగ బూలదండ
నందంబుగా నుత్తమాంగంబునందుండి
చలువనీయగ చిన్ని చందమామ
మాటిమాటికి హరా మహనీయ వైభవా
స్పద యంచు వినుతింప ప్రమథగణము
గగనమ్ము మార్మ్రోయ ఘననిస్వనము భాతి
అంకె వైవగ వెల్లరంగుగిత్త
పిన్ననవ్వొరమోము సమున్నతభుజ
స్కంధము ల్వెలయంగ ప్రచండసూర్య
దివ్య తేజోవిమోహిత దేవబృంద
మూర్తి గన్పించె గడు జగన్మోహనముగ.

ధవళకాంతులు ప్రసరింపజేయు వృషభవాహనము, శిరమున తెమ్మెరల వ్యాపింపజేయు గంగాభవాని, తలమీద నమృతమును జిందు నర్ధచంద్రుడు, భక్తిరసోద్విగ్న మనస్సుతో తాండవము సల్పు ప్రమథగణము గలిగి శతకోటి మన్మథ సౌందర్యముతో వికసిత ముఖారవిందుడై పరమశివుడు సాక్షాత్కరింపగా కన్నులార జూచి పార్వతి యానందబాష్పములు జాలువార బ్రహ్మానంద పరవశయై నమస్కరింప భవు డిట్లనెను.

హైమవతీ! మృత్యుంజయుడనైన నన్ను నీవు మధుర భక్తిచే జయించితివి. నీ యచంచలప్రేమ నెఱింగియు నిన్ను పరిశోధింప మాఱువేషమున వచ్చితిని. తపమొనర్చుచున్న నీదు

శాంతమయరూపమును జూచితిని. నీదు ప్రసన్న వచనములను వింటిని. అని పాణిగ్రహణ మొనర్ప యత్నింప నతని యతి ప్రాయమును గ్రహించి తమ దర్శనమున నేను ధన్యనైతిని. సాలంకృతకన్యాదానమొనర్చి నా తలిదండ్రులు ధన్యులు గావలదా యని పార్వతి పలుక నా వచనములకు నానందమొంది యట్లే యగుగాక యని కైలాసమున కేగెను.

అంత శంకరుడు సప్తర్షులను సంధానకర్తలగా బంపెను. ఆ మహర్షులు ఓషధీప్రస్థపురము జేరి మేనకా హిమవంతులను పార్వతీ కల్యాణమునకు సమ్మతింపజేసిరి మహర్షులు కృతకృత్యులై కైలాసమునకేగి పరమేశ్వరునకు సకలమును విన్నవించిరి. అరుంధతి పరమశివుని పెండ్లికుమారుని గావించెను. అంత పరమేశ్వరుడు వృషభారూఢుడై యోషధీప్రస్థ పురమునకు ప్రమథగణములతో త్రయస్త్రింశత్కోటి దేవతలతో పెండ్లి కుమారుడై వచ్చుచుండ పురస్త్రీలు సౌధోపరిభాగమునుండి యా పరమేశ్వరుని సందర్శించి పరమానందమొందిరి.

సీ. వీడచే యణిమాది విశ్రుతైశ్వర్యము
లెల్ల దాగైకొన్న యీశ్వరుండు
అష్టమూర్తులతోన నఖిలంబు దానయై
పరమపావనుడైన భవ్యయశుడు
కాలకూటవిషంబు గళసీమనే నిల్పి
కుక్షిలోకము గాచు దక్షుడితడె
ఇతడచే మృత్యువు నెదిరించి శూలాన
దొక్కజీల్చిన యట్టి యుక్కుతునక

ఇతడశే గౌరితపమున కిచ్చ మెచ్చి
వరము లొసగిన ధరై ్మకవ ర్తనుండు
భళిర శతకోటి మన్మథ భాగ్యమూ ర్తి
గంటి మారౌర కన్నుల కలవుదీఅ.

అని ప్రశంసించుచుండిరి.

అంత పరమేశ్వరుడు వివాహ మంటపమును సమీపించి బ్రహ్మయు శ్రీమహావిష్ణువు కై దండలొసగ వివాహవేదిక కడకు వచ్చెను. చతుర్ముఖుడు బ్రహ్మాసనమున గూర్చుండి మేనకాహిమ వంతులచే సమంత్రకముగ కన్యాదాన మిప్పించెను. శంకరుడు హైమతీగళమున మంగళసూత్రమును గట్టెను. వధూవరులు తల బ్రాలు జల్లుకొనిరి. గంధర్వులు గానమొనర్ప నప్సరసలు నృత్యము సేయ దేవతలు పుష్పవర్షమును గురిపింప సకలలోకములకు సర్వ మంగళములను గూర్చునదై పార్వతీపరమేశ్వరుల కల్యాణ మత్యంత వైభవముతో జరిగెను.

ఓం తత్ సత్

## కీర్తి కన్యకావృత్తాంతము

శ్లో. రేఖామయధ్వజ సుధా కలశాతపత్ర
వజ్రాంకుశాంబురుహ కల్పక శంఖ చక్రైః
భవ్యై రలంకృత తలౌ పరత త్త్వ చిహ్నైః
శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే.

భాస్కరాచార్యులు ఆర్యవైశ్యులకు పార్వతీ వృత్తాంతము నెరిగించి బ్రహ్మవిదుడగు సోమదత్త మహర్షిచేత ప్రార్థింపబడి

యా పార్వతియే సోమదత్త మహర్షికి కీర్తికన్యగా జన్మించెనని పలుకగా వారిని జూచి యార్యవైశ్యులు ఆచార్యవర్యా! ఆ కీర్తి కన్యకా వృత్తాంతమును వినిపింపుడనిపల్క భాస్కరాచార్య లిట్లు చెప్పదొడగెను

## ఆర్యవైశ్యుల యాదినివాసము

ఆస్తికవర్యులారా! ఆర్యవైశ్యుల మొదటి నివాసము మహాగిరి. ఇయ్యది హిమాలయ శిఖరములలో నొకటి. సముద్ర మట్టమునకు అ. 21200 ల యెత్తున నున్నది.

తే. ఆ మహాగిరియందుండు నాదిశక్తి
భక్తరక్షణశీల శ్రీ భద్రకాళి
యార్యరక్షణదీక్ష దీ వ్యన్మహిమను
మేలి దైవంబుగా బొల్చి మేల్మినిడుచు.

తే. ఆ పరాశక్తి యెల్ల బ్రహ్మాండములను
నేరుపైనట్టి దృష్టి ప్రసారముననె
బ్రోచుచుండు దయామయి పూజ్యమాత
యద్భుతంబగు విభవాన నలరుచుండు.

సర్వశక్తులకు నధిష్ఠానమగు నా పరంజ్యోతి స్వరూపిణి యాదిశక్తి సాన్నిధ్యమున నేడువందల పదునాల్గు గోత్రముల యార్యవైశ్యులు సకుటుంబ సపరివారముగ నివసించుచుండిరి. ఈ చిచ్ఛక్తియే సంకల్పమాత్రమున సృష్టిస్థితిలయములు చేయు చుండును. ఈమెకు దుర్గ, భద్రకాళి, విజయ. వైష్ణవి, కుముద,

చండిక, కృష్ణ, మాధవి, కన్యక, మాయ, నారాయణి, ఈశాన, శారద, అంబిక యను పదునాలుగు పేర్లు కలవు.*

* ఆదినుండియు వైశ్యులలో నేటివఱకు చాలమంది శక్తిపూజా దురంధరులు. వారిది జీవహింసలేని మార్గము. నేటికిని వైశ్యులు శ్రీకన్యకాపరమేశ్వరిని ప్రముఖ దైవముగా పూజించుచున్నారు. సాధారణముగ వైశ్యులుండు ప్రతి గ్రామమందును శ్రీవాసవీ కన్యకాపరమేశ్వరీ ఆలయముండును ఆలయము లేనిచోట ఆ పరమేశ్వరీ విగ్రహమునో, ఛాయాచిత్రమునో తమతమ గృహములలో నెలకొల్పి పూజలు సలుపుచుందురు. ఆలయములకు నేటివలెగాక గ్రామ వైశ్యబృందమునకు పెద్దయైన పెద్దశెట్టిగారి కుమార్తె యర్చకురాలై దేవీ పూజలు నిర్వర్తించుచుండెడిది. ఆమె బ్రహ్మచారిణియై మానవాకృతి దాల్చిన పరమేశ్వరివలె నుండెను వైశ్యులు ఆమెవలన తీర్థప్రసాదములను స్వీకరించుచుందురు.

ఆదిశంకరులు సౌందర్యలహరిలో త్రిమూర్తులకన్న ఆదిశక్తికి విశిష్టతను పేర్కొనిరి. దేవీభాగవతములోను సృష్టిస్థితిలయములకు నాదికారిణియని ఆదిశక్తి మహిమ వివరింపబడియున్నది. కాన వైశ్యులు దేవిని ముఖ్యదైవముగ పూజించుట శాస్త్రవిహితమే. ఆదినుండియు నేటివఱకు భరతఖండమున స్త్రీకి విశిష్టస్థానము కలదు. 'మాతృదేవోభవ' యని శ్రుతి. గార్హస్థ్యమున ధర్మపత్నికి నత్యంత గౌరవ మొసగబడియున్నది. ధర్మపత్ని యనుమతిలేక చేయబడు ధర్మకార్యములు నిష్ఫలములని శాస్త్రములు చెప్పుచున్నవి. విష్ణువు హృదయమునను, శివుడు అర్ధాంగమునను, బ్రహ్మ రసనాగ్రమందును లక్ష్మి పార్వతీ సరస్వతులను దాల్చి స్త్రీత్వమునకు మిక్కిలి గౌరవమును ప్రదర్శించిరి. స్త్రీలు ఆలయములలో నర్చకత్వము వహింపవచ్చునా యన్నచో ప్రాచీనకాలమున ఆధ్యాత్మిక విషయములలో స్త్రీలును ప్రముఖులుగ నుండిరని తెలియుచున్నది. సులభ, మైత్రేయి, గార్గి, మదాలస మున్నగువారు ఉపనిషత్తులలో ప్రశంసింపబడి యున్నారు. వారిలో ఆచార్యపీఠము వహించినవారును గలరు. మీరాబాయి, ఆండాళ్ మున్నగువారు భగవంతు నారాధించి సర్వజనవంద్యులై వెలసిరి. కాన నిర్మలాంతఃకరణ మున్నచో స్త్రీలు భగవంతు నుపాసించుట తప్పుగాదని గ్రహింపవలెను. అబలలని స్త్రీలను తొలగింప బనిలేదు. వారు నబలలే. కైక దశరథునకు, సుభద్ర అర్జునునకు పారథ్యమొనర్చిరి. సత్యభామ నరకాసురునితో యుద్ధముచేసెను. సావిత్రి యమునితో సత్యాగ్రహమొనర్చెను. భూభార హరణార్థమై దుష్టశిక్షా శిష్టరక్షణకొఱకు శ్రీరాముడు జన్మించినటుల పరాశక్తి పార్వతియు దుష్టశిక్షా శిష్టరక్షణకే జన్మించెను.

హిమాలయము పరమేశ్వరుని నివాసము. కాన సమస్త శక్తులకు నధిష్ఠానమగు భవ్యజనని దివ్య సాన్నిధ్యమున ఆర్య వైశ్యులు తపము సల్పుచుండిరి. ఆ పరాశక్తి సర్వాంతర్యామిని. అంతట నిండియున్నది. ఆమెను ఎచటనైనను ఉపాసింపవచ్చును. హిమాలయమందే యుండి యుపాసింపనేల యని సందేహము కలుగవచ్చును.

గోవు శరీరమున క్షీరము రక్తరూపమున వ్యాపించి యున్నను కొమ్ములనుండి చెవులనుండి పాలు పితుకుటకు వలను గాదు. పొదుగునుండియే పాలు పితుకవలెను. అట్లే ఆ పరాశక్తిని ఆమె జన్మభూమియగు హిమాలయముననే సులభముగ దర్శింప వచ్చును. హిమాలయము తపోభూమి. అచటి వాతావరణము సహజముగా పరమార్థచింతను గలుగజేయును. సమస్త పర్వత శిఖరములలో గౌరీ శిఖరమే మహోన్నతమైనది. ఇయ్యది 29029 అడుగుల యెత్తున గలదు. ఈయది పార్వతి పరమేశ్వరుని గుఱించి తపముసల్పి ప్రత్యక్ష మొనర్చుకొనిన ప్రదేశమగుటచే గౌరీశిఖరమని ప్రసిద్ధి కలిగెను. హిమాలయపర్వతశిఖరములందు కైలాసశిఖరము మఱియొకటి. అందు పరమశివుడు ప్రమథగణ ములతో భక్తబృందముతో నివసించుచుండును. ఇయ్యది 21900 అడుగులు ఎత్తు కలది. ఆర్యవైశ్యు లిట్టి హిమగిరి ప్రాంతమున ప్రశాంతముగ తపమొనర్చుకొనుచుండిరి.

## చిత్రకంఠుడు కీర్తికన్యనుజూచి మోహించుట

ఏడువందల పదునాలుగు గోత్రముల యార్యవైశ్యులలో సోమదత్తుడను మహర్షి కలడు. అతనిభార్య సౌభాగ్యవతి. ఆ దంపతులు సంతానప్రాప్తికై పరమేశ్వరుని ప్రార్థింప నా జగన్మాత సాక్షాత్కరించెను. వారు ఆమె దివ్యమంగళ విగ్రహమును గాంచి ముగ్ధులై నీవంటి పుత్త్రిక జన్మించునట్లు వరము నిమ్మని వేడిరి. వారిభక్తికిమెచ్చి దేవి యట్లే యనుగ్రహించెను.

అచిరకాలముననే సౌభాగ్యవతి గర్భమందు పరమేశ్వరి యంశమున దివ్యవర్చస్సముపేతయగు బాలిక జన్మించెను. ఆమె శరీరకాంతి మహాగిరినే ప్రకాశింపజేసెను. అందువలన దైవజ్ఞులా బాలికకు కీర్తి యని నామకరణ మొనర్చిరి. ఆ బాలిక సోమదత్తమహర్షి భవనమున శుక్లపక్ష చంద్రునివలె దినదినప్రవర్ధమానయై పరమేశ్వరుని భజియించుచు బాల్యదశను గడచి నవయౌవనము దరిసినంత నత్యంత మహోజ్జ్వలాకృతితో విలసిల్లుచుండెను. మహాగిరికి తూర్పున మణిపురము గలదు. ఆ పట్టణమును పాలించు చిత్రకంఠుడు పరమేశ్వర సందర్శనార్థము కైలాస శిఖరమునకు బోవుచు మార్గమందు గల మహాగిరియందు తటిల్లతవలె గన్పింపగా గీర్తికన్యను గాంచి యామె సౌందర్యమునకు బరవశుడై సోమదత్తమహర్షిని జూచి నీ కుమారిని నా కొసంగుమని ప్రార్థించెను. ఆ మహర్షియు నపు డచటనున్న నూట రెండు గోత్రముల వైశ్యులును నతని కోరికను తిరస్కరించిరి.

కామాంధుడగు చిత్రకంఠుడు గతప్రజ్ఞుడై మీరందఱు సపత్నికముగ నగ్నిహోత్రము పాలయ్యెదరని శపింప వారును

మూర్ఖుడా! నిష్కారణముగ శపించితివి గావున నాకన్యక శాపము వలన నీ శిరము సహస్ర శకలము లగుగాక యని ప్రతి శాప మిచ్చిరి.

ఈ వృత్తాంతమును దెలిసికొన్న కీర్తికన్యక పరమశివునకు దత్తము చేయబడిన యీ శరీరము నొక యధము డాశించి నా శ్రేయోభిలాషులకు నావేదన కలిగించెను గాన నీ యాపదలకు మూలకందమైన యీ శరీరమును ద్యజించెదనని తలంచి పరమ శివుని హృదయమున బదిలపఱచి యోగాగ్నిని కల్పించుకొని పరమేశ్వర సాయుజ్యము పొందెను. దీనినే స్వచ్ఛందమరణ మందురు. నాటినుంటియు ఈ మహాగిరివారికిని మణిపురమువారి కిని విరోధములు సంభవించినవి. యుద్ధములు ప్రాణములకే హాని కలిగించును. శాపమువలన ప్రాణహానియే గాక యశోహానియు గలుగును. ప్రళయభయంకరమైన యీ సంఘటనమునకు చిత్ర కంఠుడు, నార్యవైశ్యులుగూడ నావేదన నొంది తమ తమ నెల వులు చేరిరి.

మహాగిరియందున్న 714 గోత్రముల యార్యవైశ్యల కీ సంఘటన యావేదన గలిగించెను. ప్రశాంతికై యా జగన్మాతను ధ్యానింప నామె ప్రత్యక్షమై యిట్లనియెను.

కష్టములె మోక్షసిద్ధికి గారణములు
దీని దెలియక నిందింత్రు జ్ఞానరహితు
లవియ పరమాత్మ నామ పారాయణంబు
గొల్పి మోక్షానుభూతి చేకూర్చు గాదె.

బిడ్డలారా! ప్రతిజీవియు ప్రారబ్ధము ననుసరించి సుఖ దుఃఖముల ననుభవించును. ఎట్టి సంఘటనము జరిగినను తన శ్రేయమునకే యని గ్రహించువాడు ప్రాజ్ఞుడు. ప్రతిజీవియు జనన సమయమందును మరణసమయమందును నూఱుతేళ్లు కుట్టినంత బాధ ననుభవించును. ప్రసవవేదన ననుభవింపక సంతానము కలుగనట్లు కష్టానుభవములేక బ్రహ్మానందమగు మోక్షము ప్రాప్తింపదు. చిత్రకంఠునిశాపము పూర్వజన్మకృత కర్మఫలమే యని పలికి యార్యవైశ్యు లందఱకు చిత్తశాంతిని కల్గించెనని యీ చరిత్రమును భాస్కరాచార్యు లార్యవైశ్యులకు తెల్పె.

వైశ్యర్షిః సోమదత్తాఖ్యో ధీమాన్దేవీ కృపాన్వితః
సభూమౌ కుసుమశ్రేష్ఠి నామ్నా శ్రీమా నజాయత.

భాస్కరాచార్యులు కుసుమశ్రేష్ఠినిగాంచి నీవే యా సోమదత్తమహర్షివి. చిత్రకంఠుడే విష్ణువర్ధన చక్రవర్తిగా జన్మించెను. నీవు పుత్రకామేష్టి నొనర్చితివేని యా కీర్తికన్యకయే నీకు పుత్త్రికగా జన్మింపగలదు. ఆమె జననమువలన నార్యవైశ్యులు ధన్యు లయ్యెదరు. కుసుమార్యా! పుణ్యదంపతులగు మీకు జన్మ సార్థకమగును గావున లోకకల్యాణకరమగు పుత్రకామేష్టి సల్పుమని పల్కుచున్న భాస్కరాచార్యులగాంచి మహాత్మా! ఆ మహాగిరి యందలి యార్యవైశ్యులు శాపానంతర మెట్లు ప్రవర్తించిరి? వారి వృత్తాంతమెట్లు పరిణమించెనో యా పావనచరిత్ర విన కుతూహల మగుచున్నదని ప్రార్థింప భాస్కరాచార్యు లిట్లు చెప్ప దొడగిరి.

# ఆర్యవైశ్యుల మహాప్రస్థానము

చిత్రకంఠుని శాపము వలన నూట రెండు గోత్రములవారు మహాగిరినుండి పయన మగుచున్నంత నాత్మబల సమన్వితులైన యమ్మహనీయులను విడువలేక మహాగిరియందు గల యేఱు వందల పదిరెండు గోత్రములవారును, 714 గోత్రముల యార్య వైశ్యులును తమ జన్మభూమిని విడువలేక పరమేశ్వరిని ధ్యానించుచు హిమాలయపాదమగు ఉత్తరగోకర్ణక్షేత్రము చేరిరి. అచట రెండు నెలలు విశ్రమించి దక్షిణదిశగా పయనించి గౌరదేశము చేరిరి. ఇయ్యది గంగా బ్రహ్మపుత్రల సంగమక్షేత్రము. ఇచట పదియురెండేండ్లు నివసించిరి. వీరు గోరక్షణము ప్రధాన వృత్తిగా స్వీకరించుటచే గోమఠులని ప్రఖ్యాతినొందిరి. (గవాం మఠం అస్య అస్తీతి గోమఠీ) వీరు గౌరదేశమందు నివసించుట వలన గౌర గోమఠులనియు ప్రసిద్ధినొందిరి. గోగణాభివృద్ధికి పతకోయ పర్వతప్రాంతము (పాట్కాయహిల్స్) అనుకూలముగ నుండునని తెలిసి ఆగ్నేయదిశగా బయనించి క్రీ. శ. 650 ప్రాంతమున ప్రకృతిసౌందర్యశోభితము, వింధ్య హిమాలయ మధ్యప్రాంతము. ఉత్తరబర్మాయందున్న పాట్కాయహిల్సునకు 714 గోత్రముల వారందఱు చేరి స్థిరనివాస మేర్పఱచుకొనిరి.

పర్వతప్రాంతమువారికి గోరక్షణ చాల సుకరము. వారి యాలమందలు పర్వత ప్రాంతారణ్యములందు సంచరించుచు ననేకౌషధులను భక్షించి సాయంసమయమున నంభారవము సల్పుచు నింటి కరుదెంచి లేగలను తృప్తిపఱచి గృహయజమానికి క్షీరముల నొసంగుచుండును. ఈ వైశ్యులు అనతికాలమందే పరమేశ్వరి యనుగ్రహమువలన సహస్రాధిక గోధనము కలవారై

ప్రఖ్యాతినొందిరి. ఈ పర్వతములు మణిపురమునకు తూర్పు సరిహద్దున గలవు. చాలకాలమునుండియు మణిపురమువారికిని మహాగిరివారికిని విరోధము లుండుటవలనను సరిహద్దులలో కలహములు సంభవించుచుండుట వలనను దీనికితోడుగా వర్షాధారములైన పతకోయప్రాంత మనావృష్టివలన దుర్భిక్షమునకు గురి యగుటవలనను పచ్చిక బీళ్ళెండిపోవుటవలనను గోరక్షణ మసాధ్యమైనందున 714 గోత్రముల వైశ్యులందఱు హిమాలయమందు జన్మించిన గంగ, యమున, సింధు, బ్రహ్మపుత్రాదినదులు భూమికరుదెంచి యనేక శాఖోపశాఖలుగా ప్రవహించునట్లు దైవయోగమున పాట్కాయహిల్సునుండి క్రీ. శ. 850 సం॥ర మున బయలుదేరి యా సేతుహిమాలయపర్యంతము సారవంతములైన నదీప్రాంతములయందు నివాసము లేర్పఱచుకొనిరి. అని యిట్లు భాస్కరాచార్యులు ఆర్యవైశ్యులతో వారి ప్రాచీన వృత్తాంతమును వివరించి చెప్పిరి.

భాస్కరాచార్యులు చెప్పిన తీరున నార్యవైశ్యులు భారతదేశమున నదీప్రాంతములలో స్థిరనివాసము లేర్పఱచుకొని నాటినుండి నేటివఱకు నవిచ్ఛిన్నముగ లోకహితతత్పరులై దైవపూజాధురంధరులై కీర్తిపొందుచున్నారు. ఆ కాలమున వలసపోయినవారిలో కొందఱు పంజాబు ప్రాంతమున స్థిరనివాస మేర్పఱచుకొనిరి.

"పంజాబు" చీనాబ్, బియాస్, రావి, జీలం, సట్లెజ్ మున్నగు జీవనదులు ప్రవహించు పవిత్రక్షేత్రము. అందువలన పంజాబ్ అనియు, పంచనదప్రాంతమనియు ప్రసిద్ధి కలిగెను. సత్యాగ్రహ సమయమున లాఠీచార్జికి గురియై వీరస్వర్గ మలంకరించిన పంజాబ్ కేసరి లాలా లజపతిరాయి పంజాబు వైశ్యుడు మఱికొందఱు బెంగాల్ చేరిరి. దేశభక్తుడు సేనగుప్త బెంగాలీ

వైశ్యుడు. మఱికొందఱు మహారాష్ట్రము చేరిరి. మహారాష్ట్ర సామ్రాజ్య ప్రతిష్ఠాపకుడు ఛత్రపతి శివాజీమహారాజునకు తత్త్వోపదేశము గావించిన భక్తతుకారాం మహారాష్ట్ర వైశ్యుడు. మఱియు భారతస్వాతంత్ర్య రథమును విజయవంతముగ నడపిన ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞానఖని మహాత్మాగాంధీ, ఆచార్య హేమచంద్రసూరి వీరిరువురు గుజరాతీ వైశ్యులు.

కొందఱు మార్వార్ దేశము చేరిరి. సత్యాగ్రహ సమరమందు కారాగృహ మలంకరించిన కోటీశ్వరుడు, నిరాడంబరజీవి, కలిమిగల దాత, మహాత్ముని ప్రియశిష్యుడు సేట్ జమ్నాలాల్ బజాజ్ మార్వాడీ వైశ్యుడు. మఱియు శతాధిక గ్రంథకర్త, సుప్రసిద్ధ హిందీకవి మైథిలీ శరణగుప్తయు, రాజస్థాన్ మంత్రి బద్రీ ప్రసాద్ రాజస్థాన వైశ్యులు.

కొందఱు ఆంధ్రదేశమును జేరి సారవంతమైన గోదావరీ ప్రాంతమందు పదునెనిమిది కోటలు కట్టిరి. వీరు కోటీశ్వరులు.

1. బ్రహ్మశ్రీ ఆత్మూరి లక్ష్మీనృసింహ సోమయాజి యను మహనీయుడు ఆంధ్ర, ఆంగ్ల, గీర్వాణభాషలయందు అసామాన్యుడు. ఋగ్వేద, యజుర్వేద, సామవేదములందు అతిశయ ప్రజ్ఞాశాలి. స్థితప్రజ్ఞుడు.

2. బ్రహ్మశ్రీ మామిడి వేంకటార్యులు అను మహనీయుడు నవవ్యాకరణ పండితుడు. సంస్కృతభాషయందు శబ్దార్థకల్పతరు వను నిఘంటువును వ్రాసి పండిత మహాసభలో విక్టోరియా మహారాణి వలన స్వర్ణ పతకమును బహూకృతి బడసిన జగద్విఖ్యాత పండితుడు. బ్రహ్మజ్ఞాని.

3. ఆంధ్రరాష్ట్రోద్యమాగ్నికి నాత్మార్పణ మొనర్చిన త్యాగధనుడు పొట్టి శ్రీరాములు. వీరు ఆంధ్రవైశ్య త్రిమూర్తులు.

గదగబెటగేరి నివాసులు ఆర్యవైశ్య పురోభివృద్ధికై నిరంతరము శ్రమించిన సంఘసేవకుడు, ప్రజ్ఞాశాలి స్వార్థరహితుడు శ్రీ రాజీవప్పగారు కన్నడవైశ్యులు.

పంజాబ్, బెంగాల్, గుజరాత్, మహారాష్ట్ర, రాజస్థాన్, ఆంధ్ర, కన్నడ వైశ్యులందఱకు భాషలు వేఱువేఱుగా నున్నను సంప్రదాయమొకటే. శాకాహారము, భూతదయ, వ్యాపారదక్షత, గోసంరక్షణ, దైవభక్తి, దాతృత్వము, విజ్ఞానముగల వీరందఱు హిమవత్పర్వతమందుగల మహాగిరినుండి బయలుదేరిన యార్యవైశ్యుల సంతతివారే.

పశ్చిమ గోదావరిజిల్లా పెనుగొండ సమప్రదేశము, సారవంతమగు పల్లపు ప్రాంతము. తమయాద్య జన్మభూమి మహాగిరి యగుటవలన నందులకు స్మృతిచిహ్నముగ నార్యవైశ్యులు తమ నివాసమునకు పెనుగొండ యని పేరిడుకొనిరి. సంస్కృతమున జ్యేష్ఠ శైలము, బృహదద్రి, మహాగిరి యను పేరులున్నవి. ఆంధ్రమున పెనుగొండయనియు, కన్నడమున దొడ్డబెట్టయనియు నందురు.

పెనుగొండ యని పేరు పెట్టుకొనుట కిదియే కారణము.

ఆంధ్రప్రదేశము పశ్చిమగోదావరిజిల్లా పాలకొల్లు శ్రీకృష్ణాశ్రమ
స్థాపకులగు నిశ్చలానందస్వామిచే విరచితమగు
విశ్వజ్యోతి కావ్యము రెండవఅధ్యాయము
సంపూర్ణము.
ఓం తత్సత్



# విశ్వజ్యోతి

మూడవ యధ్యాయము

## శ్రీవాసవీ కన్యకా జీవిత చరిత్రము

రెండవ యధ్యాయమున భాస్కరాచార్యులు తన సన్నిధికి నరుదెంచిన యార్య వైశ్యులకును, కుసుమగుప్తనకును కీర్తి కన్యకావృత్తాంతమును బేర్కొనిన విధము వివరింపబడినది. ఆ కీర్తికన్యయే కుసుమశ్రేష్ఠికి వాసవీ కన్యగా జన్మింపగలదని భాస్కరాచార్యులు ఆర్యవైశ్యులతో బలికిరి. అంత కుసుమశ్రేష్ఠి మహానందభరితుడై కులగురువగు భాస్కరాచార్యులను తనచేత పుత్త్రికామేష్టి నొనరింపజేయవలసినదని ప్రార్థించెను. వారు నందులకంగీకరించిరి. భాస్కరాచార్యులధ్వర్యము వహించి పుత్త్రికామేష్టి జరపింపగా నా యాగకుండమున యజ్ఞపురుషుడు ప్రత్యక్షమై చరువు నిండిన హేమపాత్రమును భాస్కరాచార్యుల చేతికిచ్చి యంతర్హితుడయ్యెను. ఆచార్యులు దానిని కుసుమశ్రేష్ఠి కిచ్చిరి. అతడు దానిని తన ధర్మపత్ని కొసంగెను. ఆమెయు భక్తి వినయములతో పరమేశ్వరిని గుఱించి

విద్యుత్పుంజ నిభాకారాం తటిత్కోటి విడంబితాం
సూర్యచంద్రాగ్ని సంకాశాం ప్రభావ్యాప్త దిగంతరామ్

చతుర్భుజాం మహాదేవీం సుందర భ్రూ శుచిస్మితాం
కిరీట హారకేయూర మణినూపురశోభితాం
శుకవాణీం విశాలాక్షీం భువన త్రయ మాతరం
త్వాం వందే దేవదేవేశాం దేహిమే సంతతిం శివే

యని ప్రార్థించుచు నా చరువును స్వీకరించెను. కొన్నాళ్లకు నెలతప్పి యామె గర్భము దాల్చెను.

సీ. అఖిలలోకారాధ్య మగు పరంజ్యోతిని
    ధరియించు నుపనిష త్తరుణియనగ
సుధలు చిందెడి కళానిధిబింబముందాల్చు
    క్షీరవారాశి వీచికయనంగ
సర్వలోకేశ్వరి శర్వాణి నుదరమ్ము
    నందు ధరించు మేనక యనంగ
నత్యంత చిత్రక్రియా విలాసిని విష్ణు
    మాయదాల్చిన నందు జాయయనగ

సచ్చిదానందమయము ప్రసన్న మధుర
మమృత నిష్యందము సుధావహము మహస్సు
ఉదరగోళాన దినదినాభ్యుదయ మంద
దివ్యదీప్తుల గుసుమాంబ తేజరిల్లె.

పరంజ్యోతిని గర్భమున ధరించిన యుపనిషత్కాంత వలెను, కళలు నిండిన చంద్రబింబమును గర్భమునదాల్చిన క్షీర సాగర తరంగమువలెను, పరమేశ్వరిని గర్భమున ధరించిన హిమ వంతుని పత్ని మేనకవలెను, విష్ణుమాయను గర్భమున దాల్చిన నందసతి యశోదవలెను వాసవీ కన్యను గర్భమున ధరించుటచేత

కుసుమాంబ దివ్యతేజము వెల్లివిరియ నొప్పుచుండెను. దివ్యశోభతో ప్రకాశించుచున్న ధర్మపత్నినిజూచి కుసుమశ్రేష్ఠి మిక్కిలి యానందముతో నుప్పొంగి పోవుచుండెను.

## శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ జననము

వైశాఖే దితి నక్షత్రే శుభే భార్గవ వాసరే
శుక్లపక్ష దశమ్యాంచ శుభలగ్నే శుభగ్రహైః
అధిష్టితే శుభోచ్ఛస్థే శుభదృష్టే గ్రహత్రయే
జాతం శిశుద్వయమిదం వైశ్యవంశ వివర్ధనమ్.

వైశాఖ శుద్ధ దశమి శుక్రవారము పునర్వసు నక్షత్ర ప్రయుక్త బ్రాహ్మ ముహూర్తమున శుభగ్రహము లుచ్ఛస్థితి యందుండ కుసుమాంబకు మొదట కుమారియు, తదుపరి కుమారుడును నుద్భవించిరి. వారి జననకాలమందు ఆకసము నిర్మలమై యుండెను. వాతావరణము ప్రశాంతమై యుండెను. దేవతలు పుష్ప వర్షము కురిపించుచుండ గంధర్వులు గానముచేయుచుండ ప్రజలు ఆనందమొందుచుండ భాస్కరాచార్యుల అధ్వర్యమున కుసుమ శ్రేష్ఠి జాతకర్మమొనర్చి షోడశమహాదానముల నొసంగెను. భాస్కరాచార్యు లా బిడ్డలకు నామకరణము లొనర్చుచు పుత్రికకు వాసవి యనియు పుత్రునకు విరూపాక్షుడనియు పేర్లిడెను.

"వసంతి అస్మిన్ జగంతి ఇతివాసుః" అర్థమందు కొండ వలె జగము లన్నింటిని తనయందు గలవాడు శ్రీ మహావిష్ణువు. "వాసోః ఇయం వాసవీ" విష్ణుసోదరి వాసవి. భగవంతుడు కృష్ణావతార మెత్తినపుడు యోగమాయ మొదట నందుని భార్య యగు యశోదకు బుట్టుటచే కృష్ణసోదరి యైనది. అందువలన

భాస్కరాచార్యులు 'వాసవి' యను పేరుంచిరి. కుమారుడు ఈశ్వర భక్తుడు కాగలడని గుర్తించి విరూపాక్షుడని పేరిడిరి.

బాలేందురేఖ వలె న
బ్బాలామణి దినదిన ప్రవర్ధిత యగుచుఁ
హేలాగతి సాటి వణి
గ్బాలామణులందు మిగుల భాసిలి మెలఁగెఁ.

ఆటల పాటలన్ చదువునందును చక్కదనంబు నందు నా
నాటి కపూర్వమై వెలయు నవ్య మహామహిమంబు జూపు నా
బోటి యుమాంశజాతయని పోల్చి యుమాపరమేశులందొగిఁ
గాటపు భక్తి నైక్యమయి కన్పడుచుండ్రు సతీపతుల్ సదా.

జ్ఞానవికాసమంది శ్రుతిసారమెఱుంగుటఁ గాలమంతయుఁ
దాననిశంబునుంగడపు దామరసానన వాసవాంబ స
ద్ధానమునేర్చె నాగమవితానమునేర్చె ననన్యసాహితీ
జ్ఞానముగాంచె విజ్ఞులు ప్రశంసలొనర్పఁగఁ జిన్ననాటనే.

శుక్లపక్షచంద్రునివలె దినదినప్రవర్ధమానయగుచుండ కుసుమగుప్తునిభవనము పరమహంసలతో, పండితులతో, కవీశ్వరులతో, బ్రహ్మవిదులతో ప్రకాశించుచుండెను ఏకసంథాగ్రాహిణియగు శ్రీ వాసవీకన్యక సర్వజ్ఞుడైన భాస్కరాచార్యుల వలన సకలోపనిషత్సారమును గ్రహించి తన కాలమంతయు ప్రపంచజిజ్ఞాసయందుగాక బ్రహ్మజిజ్ఞాసయందు గడపుచు సద్వినియోగము చేయుచుండెను.

కుసుమదంపతులు ఆమె యాటపాటలు, మహిమలు గాంచి పుత్రికయనుభావమును మఱచి భక్తిభావమును జూపు

చుండిరి. ఆమె జననకాలమునుండియు వసుంధర సస్యశ్యామలమై, సకలసంపదలతో నిత్యకల్యాణము పచ్చతోరణముగ నొప్పు చుండెను. గోవులు మెరుగారి క్షీరధారలు వర్షించుచుండెను. ప్రజలు భక్తిభరితులై ప్రశాంతచిత్తులై యుండిరి.

## విష్ణువర్ధనుడు వాసవీకన్యను జూచి మోహించుట

క్రీ. శ. 1022 సం॥న రాజమహేంద్రవరమును రాజధానిగా జేసికొని చంద్రవంశసముద్భూతుడు విష్ణువర్ధనమహారాజు నెల్లూరు మొదలు విశాఖపట్టణమువఱకుగల యాంధ్రప్రదేశమును బాలించు చుండెను.

కుసుమశ్రేష్ఠి విష్ణువర్ధనమహారాజునకు సామంతరాజు. విష్ణువర్ధనుడు పుణ్యతీర్థములను సేవించుచు పెనుగొండపట్టణమునకు వచ్చుచుండె నన్నవార్త కుసుమశ్రేష్ఠికి దెలిసెను. అత డామహారాజునకు పురివెలుపలనున్న చంద్రకాంతశిలాసౌధమును విడిదిగా నేర్పాటుచేసెను.

మఱునాడు మహారాజసందర్శనార్థమై భాస్కరాచార్యులు, కుసుమశ్రేష్ఠి, ఆర్యవైశ్యులు రత్నాభరణములతో నలంకరింపబడిన పదివేల కపిలగోవులను కానుకగా గొనివచ్చిరి. మహారాజు వారొసగిన కట్నముల స్వీకరించెను. కుసుమశ్రేష్ఠి వైభవమున కాశ్చర్యపడి సౌధోపరిభాగమున రాజు తన మంత్రులతో గూడియుండి యతని నాహ్వానించి వినోదసంభాషణలు సలుపుచు దైవికముగ రాజవీధిపై చూపుల బరపెను. అతని కన్నులకు మెఱపు మెఱసినట్లయ్యెను. ఆసమయమున నగరేశ్వరాలయమునకు చెలికత్తెలతో బోవుచున్న వాసవీకన్యను గాంచెను.

తదా వైశ్యకులస్త్రీణాం మధ్యే సౌందర్యశోభితాం
వైశ్యవంశమహాంభోధౌ స్త్రీరూపప్రభవాం సుధామ్
కుసుంబగర్భగగనే రుచిరాం చంద్రమః కళాం
కుసుంభ రోహణగ్రావ సముత్పన్న మహామణిమ్
ముఖాబ్జసౌందర్య విశేషవిభ్రమ
న్మదోల్లసత్ బంభర డింభసంఘాన్
కరారవిన్దేన నివారయన్తీం
దదర్శ తాం వాసవి పూర్వకన్యామ్.

నక్షత్రములయందు చంద్రబింబమువలె వైశ్యవంశ సముద్రసంభూతమగు నమృతమువలె, కుసుమాంబగర్భగగనమున నుద్భవించిన చంద్రకళవలె, కుసుమశ్రేష్ఠియను రోహిణాద్రియందు బొడమిన రత్నమువలె నొప్పు వాసవీకన్యను, హంసగమనముతో నడచుచున్న జగన్మోహనసౌందర్యఖనిని జూచి ముక్కుపై వ్రేలిడికొని విష్ణువర్ధనుడు ప్రధానమంత్రియగు విజయసింహుని జూచి యిట్లనెను. "మంత్రీ! అటు చూడుము. విలాసార్థము భూమండలమున సంచరింప దిగివచ్చిన రతిదేవి యన నొప్పుచున్న యాకన్య యెవతెయో? మానవకాంత కాదని తోచెడిని" అనగా మంత్రి పరికించి యచటివారివలన నామె కుసుమగుప్తుని కుమార్తెయని తెలిసికొని రాజునకు మనవి చేసెను. విష్ణువర్ధను డాశ్చర్యోత్సాహములుపొంగ కుసుమ శ్రేష్ఠిని జూచి

ముక్కోటి దేవతలలో
జక్కులు మీ కులమువారు చర్చింపంగా

జక్కుల కులదేవత నీ
కిక్కరణి లభించెనంచు నెంచెద ననఘా!

కుసుమార్యా! దేవతలలో యక్షు లతి సౌందర్యవంతులు. యక్షుల కధిపతి కుబేరుడు. మీరు కుబేరాంశసంభూతులరు. నీ ప్రియపుత్రిక యగు వాసవీ కన్యను నాకొసగి ధన్యు నొనర్పుమని ప్రార్థించెను.

ఆ వాక్యములు విని యచటనున్న వైశ్యులందఱు నాశ్చర్య మొందిరి. కుసుమశ్రేష్ఠి నిర్ఘాంతపోయెను. భాస్కరాచార్యులు దీర్ఘాలోచనలో మునిగిరి. తదనంతరము కుసుమగుప్తుడు మహారాజుతో నిట్లనెను.

నరక ప్రాపకం వాక్యం కుత స్త్వం భాషసే నృప!
న దాస్యామి సుతాం కన్యాం దేవీవర బలార్జితామ్

"మహారాజా! నా కుమారి పరమేశ్వరి వరప్రసాదసంభవ. ఆమె దేవీపూజ కంకితురాలైనది. మీరు ధర్మస్వరూపులరు. గృహస్థులరు. వర్ణాశ్రమధర్మము నుద్ధరించుటకై తోచిన తాము ఇట్టి చర్యకు బూనుకొన్న వర్ణాశ్రమ వ్యవస్థలు తాఱుమాఱగును కదా! ఈ కోర్కెను మార్చుకొని పరమధర్మమును నెలకొల్పి రక్షింపవలెన"ని ప్రార్థించెను.

విష్ణువర్ధను డా మాటలు విని యాగ్రహ పరవశుడయ్యెను.

పరేంగిత జ్ఞానముగల భాస్కరాచార్యులు మహారాజా! ఈమె గౌరబాలిక. మీరాశించుట ధర్మముకాదని గౌరబాలబాలికల వృత్తాంతము నిట్లు చెప్పదొడగెను.

## గౌర బాలబాలికల వృత్తాంతము

"మహారాజా! 714 గోత్రముల ఆర్యవైశ్యులలో నొక యాచారము కలదు. కొందఱు ఆజన్మాంతము బ్రహ్మచర్యము నవలంబింతురు. అట్టివారిని బాలికయయినచో గౌరబాలికయనియు, బాలుడైనచో గౌరబాలుడనియు పిలుతురు. గౌరబాలురను బాల నగరులనియు నందురు. ఆ పద్ధతి ప్రకారము వాసవీకన్య తన జీవితము నీశ్వరాంకితమొనర్చి బ్రహ్మచర్యము ననుష్ఠించుచున్న గౌరబాల, ఇట్టివారు స్వార్థరహితులై సంఘసేవ, దేశసేవ నొన ర్చుచు విశ్వమానవకల్యాణమే జీవితోద్దేశ్యముగా గైకొన్నవారు, కాన ఆర్యవైశ్యులు వీరిని దైవసమానులనుగా పూజించుచుందురు. ప్రతి శుభకార్యములయందును, దైవకార్యములయందును వీరికే యగ్రతాంబూల మీయబడును. వీరు భుజించిన తర్వాతనే యందరు భుజింతురు. వీరు వయస్సున పిన్నవారైనను బుద్ధియందు పెద్ద వారే. శ్రీ వాసవీకన్య గౌరబాలిక యగుటచే వీ రీమె నిచ్చుటకు గాని మీ రడుగుటకుగాని ధర్మ మంగీకరింపదు. ఐనను పెను గొండయందు గల యార్యవైశ్యులను సమావేశపఱచి యన్ని విషయములను జర్చించి మార్పులు చేయుట కవకాశమున్నచో నా విషయమును రేపుదయమే విన్నవించుకొందుము" అని యిట్లు భాస్కరాచార్యులు రాజును సమాధానపఱచిరి.

మఱునా డుదయము భాస్కరాచార్యులు, ఆర్యవైశ్యులు, బాలనగరులు కుసుమశ్రేష్ఠి భవనమున సమావేశమైరి. భాస్కరా చార్యు లాచార్యపీఠము నలంకరించిరి. కుసుమగుప్తు డధ్యక్షపీఠ మలంకరించెను. భాస్కరాచార్యు లక్కడ సమావేశమైయున్న యార్యవైశ్యులతో "మహాశయులారా! విష్ణువర్ధన మహారాజు

నగరేశ్వరాలయమునకు బోవుచున్న శ్రీ వాసవీకన్యను చూచి మోహించెను. కుసుమశ్రేష్ఠి యెన్నివిధములుగా జెప్పినను రాజు మనసు మార్చుకొనకున్నాడు. అతని కోరిక తీర్పనిచో దురాగ్రహమున నాబాలగోపాలము మనవా రందఱిని చిత్రవధలకు బాల్పడజేయ సాహసించును. ప్రకృత విషయమున సభవారి యభిప్రాయమేమో తెలియగోరుచున్నా ననెను. కొందఱు రాజునకు కన్య నీయదగుననియు, మఱికొందఱు కూడదనియు రెండువిధములుగ జీలి వాదులాడుకొనజొచ్చిరి. సంఘమున భిన్నాభిప్రాయము లేర్పడి యైకమత్యము లోపించినందులకు కుసుమార్యుడు విచారగ్రస్తు డయ్యెను. భాస్కరాచార్యు లిదమిత్థమని తేల్చి చెప్ప లేకుండిరి. అంత కుశాగ్రబుద్ధియగు బాలనగరుల బాలుడు లేచి సభవారికి నమస్కరించి యిట్లనియె.

అనవసరంపు వాదముల నాడిన నేమిఫలంబు? రాజుతో
ననుడు కుమార్తెనిత్తుమని యంత భుజంబులు పొంగి యాతడుఞ్
జను తన పట్టణంబునకు జల్లగ బిమ్మట నే తదర్థముఞ్
గొని కడు సావకాశముగ గూడి విచారణ నేయు దెల్లరుఞ్.

మహాశయులారా! ప్రస్తుత కర్తవ్యము సమయస్ఫూర్తిగ మాటలాడి విష్ణువర్ధనుని సాగనంపుట. తదుపరి పదునెనిమిది నగరములందు గల 714 గోత్రముల యార్యవైశ్యులను సమావేశపఱచి తేల్చుకోవచ్చును. గంటలో క్షణములో తేలునట్టిది గాదు. ముందు రాజుగారిని ప్రయాణముచేసి పంపివేయుటలో మన కుశలత్వమును జూపవలయును గాని మనలో మనము వాదులాడుకొనుట వలని ఫలమేమి? అనగా నతని మాటల కంద ఱానంద భరితులైరి. కుసుమశ్రేష్ఠిమాత్రము దీర్ఘాలోచనాపరు డయ్యెను.

అంత భాస్కరాచార్యులు 'నీ యభిప్రాయమేమ'ని కుసుమశ్రేష్ఠి నడుగ నత డిట్లనెను. "ఆచార్యవర్యా! అనృతమునకు నా యంత రాత్మ యంగీకరించుట లేదు." అనగా భాస్కరాచార్యు లిట్లనిరి. "ధర్మస్య సూక్ష్మగతిః" అని ఆర్యోక్తి. శ్రేష్ఠిసత్తమా! ధర్మ మతి సూక్ష్మము.

భూతహితంబుగా పలుకు బొంకును సత్యఫలంబునిచ్చు త
ద్భూత భయాస్పదంబగు ప్రభూతపుసత్యము బొంకునట్లు ప్రా
ణాతురుడైనచో బరిణయంబున యందున పల్కు బొంకు స
త్యాతిశయంబ యండ్రు మహితాత్మక యిట్టివి ధర్మసూక్ష్మముల్.

లోకహితమునకై స్వార్థరహితుడగువాడు అసత్యము పలికినను ధర్మసమ్మతమగుటచే నది సత్యఫలమునే యిచ్చును. మోసమును మోసముచేతనే జయింపవలెను. అనగా విని కుసుమ శ్రేష్ఠి మౌనము వహించెను. అంత బాలనగరులు కుసుమశ్రేష్ఠికి నమస్కరించి మీరు నిమిత్తమాత్రముగా నుండుడు. పనులన్నియు మేము చక్కపఱచుకొన గలమని సమాధానపఱచిరి. మఱునా డుదయముననే భాస్కరాచార్యులు కుసుమశ్రేష్ఠి ఆర్యవైశ్యులు బాలనగరులు విష్ణువర్ధనుని సందర్శించి నమస్కరించిరి.

అంత నమ్మహారాజు అందఱకు ప్రత్యుత్థాన మొనర్చి యాదరించెను.

అంత సుబుద్ధి యను బాలనగరుడు లేచి చిఱునగవుతో "మహారాజా!

ఉల్లమునందు సంతసము నొందిరి వైశ్యకులంబు వారు నీ
వల్లుడ వయ్యెదంచు వినినంతనె నిన్నటిరాత్రి మేము భూ
వల్లభ! మీకు నిట్టి శుభవార్తను దెల్పగ నిశ్చయించినా
మెల్లర మంచు బల్కగ నరేంద్రుడు నిర్భరమోదచిత్తుడై.

చంద్రవంశ సముద్భూతులగు మీకు శ్రీ వాసవీకన్య నొసంగుటకు నార్యవైశ్యు లందఱు నేకగ్రీవముగా నామోదించి యున్నారు. ఈ శుభవార్తను దెల్పుటకే వచ్చితి" మన మహారా జానందభరితుడై తన పురోహితులను నాహ్వానించి శుభస్య శీఘ్రమనునట్లు వెంటనే ముహూర్త నిశ్చయము చేయుడన మహారాజునుగాంచి భాస్కరాచార్యు లిట్లనిరి.

మహారాజా! కన్యక నిచ్చువారే ముహూర్తము నిశ్చయిం చుట యిచటి యాచారము. ఈరోజు పుష్య శుద్ధ విదియ. అందు వలన మాఘశుద్ధ విదియనాడు ముహూర్తమును నిశ్చయించితిమి. తాము ఆమోదించి ముహూర్తము నాటికి రాగలరని ప్రార్థించు చుంటిమన మహారా జంగీకరించి రాజమహేంద్రవరమునకు పరి వారసహితుడై ప్రయాణమైనంత భాస్కరాచార్యులు కుసుమ శ్రేష్ఠి మొదలగు వారందఱు విష్ణువర్ధన మహారాజును సాగనంపు టకు గోదావరీ తీరమునకు వచ్చిరి. కొందఱు మంత్రులు రహ స్యముగా మహారాజుతో నిట్లనిరి.

'మహారాజా! పూర్వాపరసందర్భములను పరామర్శిం చుచో వైశ్యులు మిమ్ము సాగనంపుటకే యీ యుక్తి పన్నిరేమో' యని తమ యభిప్రాయమును వెల్లడించిరి. వెంటనే మహారాజు సమరకర్కశులగు నాలుగువందలమంది వీరయోధులను పెను

గొండ చుట్టును కావలియుంచి వాసవీకన్యను మఱొక రహస్య ప్రదేశమునకు వైశ్యులు తరలింపనీయకుండ కట్టుదిట్టములు చేసెను. వైశ్యుల బిలిపించి "మీ మాటలయందు గల సత్యము నిర్ధారణ కావలసియున్నది. అందువలన నీ యఖండ గౌతమీ యుదకమును స్పృశియించి మేము నిశ్చయముగా వాసవీకన్యక నిచ్చెదమని ప్రమాణము చేయుడ"ని పల్కె మహారాజు నభిప్రాయ మెఱిగి వైశ్యులెల్లరు సమయస్ఫూర్తిగా నిట్లనిరి.

మాదెస నేటికి సంశయ
వాదము దేవరకు నిచ్చు వారము పాపణ్;
కాదేని జచ్చువారము
భూదివిజార్కేందుగగనములు సాక్షులుగణ్.

"మహారాజా! నిస్సంశయముగా వాసవి నిచ్చెదము. అందులకు వీలుగానిచో చచ్చెదము. దీనికి సూర్యచంద్రులు సాక్షుల"ని పలికి మహారాజును సంతృప్తి పఱచిరి. విష్ణువర్ధను డంగీకరించి రాజమహేంద్రవరము చేరెను. కుసుమశ్రేష్ఠి పుష్య బహుళ దశమి నాడు పదునెనిమిది నగరములయందు గల యేడువందల పదునాలుగు గోత్రముల వారి నాహ్వానించి ప్రథమార్య వైశ్య మహాసభ పెనుగొండ క్షేత్రమం దేర్పాటుచేసెను. ఆ సభకు శ్రీ కుసుమశ్రేష్ఠి యధ్యక్షపీఠ మలంకరించెను. ఆచార్యపీఠ మలంకరించిన శ్రీ భాస్కరాచార్యులు సదస్యు లందఱను తిలకించి నగరేశ్వర సందర్శనార్థమై పోవుచున్న వాసవీకన్యను విష్ణువర్ధన మహారాజు మోహించుటను, తరువాత జరిగిన వృత్తాంతమును దెలియజెఱచెను.

## సుబుద్ధి రాయబారము

మహాసభయందు గల యార్యవైశ్యులలో కొందఱు విష్ణువర్ధనమహారాజునకు వాసవీకన్యనీయవచ్చుననియు, మఱికొందఱు కూడదనియు వాదించుకొనుచుండిరి. కుసుమశ్రేష్ఠి సంఘమున స్పర్ధ లేర్పడెనని విచారగ్రస్తుడై యుండెను. సుబుద్ధి యను బాలనగరుల చిన్నవాడు లేచి యిట్లనెను. "ఆర్యులారా!

రాజులు చంచలాత్ములు స్థిరంబుగ నుండవు వారికోర్కులా
రాజమహేంద్రరాజు నిజరాజనిభాస్యలగూడి యివ్వణి
గ్రాజనిభాస్య సంగతి తలంపున నుంచునె యుంచెనేని యా
యోజన మంత మోహమున నుండునె యిప్పటిదాక నెంచగన్.

సహజముగా మహారాజుల చిత్తములు అనేక కార్యముల యందు నిమగ్నమై యుండును. విష్ణువర్ధనరాజు రాజమహేంద్రవరముచేరి స్వస్త్రీలతో కేళీవిలాసములలో మునిగి యీ సంగతియే మఱచియుండును. ఒకవేళ జ్ఞప్తియున్నను చూచినపు డున్నంత మోహ మిపు డుండదు. కాన మృదుమధుర సంభాషణములచేతను శాస్త్రప్రమాణములచేతను సామదాన భేదములచేతను విష్ణువర్ధనుని మనస్సు మార్చుట సాధ్యమే. అని పలికి సదస్యుల నానందపఱచెను. సదస్యులెల్లరు నేకగ్రీవముగ 'మహాశయా! సుబుద్ధి యను నీపేరు సార్థకము. ఈ ఘనకార్యమును సాధించి మమ్ము కృతార్థులనుగా జేయుము" అని ప్రార్థింప సుబుద్ధి "యీ ఘనకార్యమును సాధించితినా నా కఖండ ఖ్యాతి గలుగును. ఇందపజయము కలిగెనా వీరస్వర్గము లభించును. ఈ రెండును నాక్షేమమునకే" యని పల్కి కృతనిశ్చయుడై పంద్రెండుగురు బాలనగరులతో గుఱ్ఱముల

మీద నెక్కి ద్వాదశాదిత్యులో యనునట్లు రాజమహేంద్రవరము నకు బోయెను.

బాలనగరులు పెనుగొండ పట్టణమునుండి తన సందర్శన మునకై వచ్చిన వార్త విని విష్ణువర్ధనుడు మిక్కిలి యానంద ముతో వారిని రాజసత్కారములతో తోడ్తెండని యాజ్ఞాపించెను. రాజభటులు బాలనగరులకు పూర్ణకుంభములతో నెదురేగి శ్వేత చ్ఛత్రమును బట్టి మంగళహారతు లిచ్చి సభాస్థలమునకు తోడ్కొని వచ్చిరి. మహారాజు బాలనగరులను ఉచితాసనములందు గూర్చుండ నియమించి సత్కరించెను. అంత సుబుద్ధి మహారాజునకు నమస్క రించి కుశలప్రశ్నము లైనతర్వాత నిట్లనెను.

దేవా! దేవర సర్వశాస్త్రహిత నీతిస్ఫార పారీణు లా
ర్యావిశ్వేశ్వర భక్తశేఖరులు విద్యా ప్రౌఢులామీద పా
రావారావృత మేదినీ వలయ సామ్రాజ్యాధినాథుల్ మహా
ధీ విజ్ఞానులు ధర్మ మర్మములు గుర్తింపఁ సమర్థుల్ కదా.

సీ. తత్ప్రసంగ మొనర్చుతరి చంటిపాపలు
తల్లుల చనుబాలు ద్రావరన్న
లేశంబు పాలీవు లేగలఁ గుడుపవు
మాయిండ్ల నావులు మేయవన్న
కులధర్మమను పల్కు వెలిజేసి మాయింటి
చిలుక లేపలుకులు పలుకవన్న
వాడవాడలయందు వాసవాంబా ప్రసం
గమె కాని వేఱొండు గానమన్న

వేయునేటికి పెనుగొండ రేయుబవలు
నట్టుడికినట్టుడుకుచున్నదన్న నీవ
కారణంబన్న యింతటి దారుణంబు
మానుమోయన్న దయజూపి మనుపుమన్న !

మమ్ము బరీక్ష సేయుటయొ మాదురదృష్టమొ మాకుమారి పా
పమ్మొ మతేమికారణమొ వాసవి కన్యకపైని నిట్లు మో
హమ్ముదయించె మీకు నదియాదిగ మా పెనుగొండ వారు చి
త్తమ్మున దల్లడిల్లెదరు తామరపాకున నీటిబొట్టులై

విష్ణువర్ధన సార్వభౌమా! జితేంద్రియుడగు భీష్మాచార్యులు, ద్వాపరయుగాలంకారుడగు ధర్మరాజు, ఆత్మపూజా ధురంధరుడగు భీముడు, పరమేశ్వరుని మెప్పించి పాశుపతాస్త్రము బడసిన జగదేకధనుర్ధరుడగు నర్జునుడు ప్రాదుర్భవించిన పవిత్రమగు చంద్రవంశమున జన్మించిన వారలు మీరు. జితేంద్రియులరని పరమ శివభక్తులని, విష్ణ్వంశసంభూతులని ప్రసిద్ధిగాంచితిరి. సర్వజ్ఞులరు. తమకు మేము తెలియజెప్పునంతటివారము గాము. ఐనను మా మనవి నాలకింపుడు. వాసవీ కన్యయందు గల మీ యనురాగము ధర్మయుక్తముగాదు. ఆమె దేవీపూజ కంకితమైనది. కాన పదునెనిమిది నగరములయందును గల యార్యవైశ్యులు చింతాక్రాంతులై యున్నారు. గోవులు, గోవత్సములు కన్నీరు గార్చుచున్నవి. పసిపాపలు పాలు త్రాగుటలేదు. చిలుకలు పలుకుటలేదు. సముద్రమునడుమ తుపానుగాలికి జిక్కిన యోడవలెనందఱు మిక్కిలి యాందోళన పడుచున్నారు. తాము తమ హృదయమును మార్చుకొందురేని అన్నియు కుదుటబడగలవు.'' అని

విన్నవింప నతని మాటలను రాజు వినియు విననట్లూరకుండెను. అంత సుబుద్ధి మఱల నిట్లనియెను. "మహారాజా! మా కుసుమాంబ యిట్లు విన్నవించినది.

దేవకిచిన్నిపాపమెడ దీవ్రతరాసిని గోయనెంచినా
డావిధి కంసధూర్తు డిపుడట్టులె పచ్చని త్రాటితోడ ధా
త్రీవర! నాదు కూతుమెడ ద్రుంపగ నెంచితివీవుగూడ నే
దైవము నీకు దోడ్పడదు తథ్యము మాను మధర్మవాంఛలన్.

జననంబందిన దాది యవ్వికచకంజాతాస్య సాక్షాత్కరిం
చిన కాత్యాయనియంచు మాకులమునన్ జింతించి పూజింత్రుమా
తనయం గోరుట లోకమాత నగజాతన్ గోరుటౌ వంశవ
ర్ధనమున్ గోరిన నిట్టి లోక విపరీత ప్రక్రియల్మానుమా.

నా కుమారి పరమేశ్వరి యంశమున జన్మించినది. ఆ కారణమున నామె నభిలషించినవాడు దమయంతిని ప్రేమించిన కిరాతుడు, వేదవతి నాశించినరావణుడు, నగ్ని నాశించినశలభము పడినపాట్లు పడి యధోగతిపా లగుదురు. మీరు ఇంకను కొంత కాలము క్షేమముగ రాజ్యమును బాలించి కీర్తిని బడయగోరుదురేని మీ వంశము వర్ధిల్లవలెనేని నిట్టి కోరికను విరమింపుడు, లేనిచో వంశనాశము, యశోనాశము తప్పదు." అని కుసుమాంబ గారు విన్నవించిరని పలికిన యా బాలనగరులమాటలు విని మహారాజు వారిని జూచి,

అనినం భీకరమూర్తియై నరవిభుం డవైశ్యరత్నంబులన్
గని యోమూఢమనస్కులార! తొలుతన్ గన్యన్ సమర్పింతుమం

చని నమ్మించి వృథాప్రయాసలిడి కట్టా యిట్టు మోసంబుచే
సిన మీ నాల్కల వాలునం దఱిగినన్ జేకూరునే పాపముల్.

పురముల్ వాడలు మేడలున్నగరులున్ భూముల్ పురారామముల్
వరుసన్ మంటనుగల్పి వృదులును పాపల్ స్త్రీలనం బోక గో
చరమౌ కోమటి పుర్వులన్ దునిమినే చండాసి చెండాడెదన్
గరుణన్ జూపక వైశ్యవంశకదళీ కాంతార ముద్యద్గతిన్.

చంద్రుడు సర్వలోకానందకరుడైనను చోరులకు విరోధి. మూర్ఖునకు సత్ప్రబోధకులు విరోధులు. అట్లే ధర్మసమ్మతమైన బాలనగరుల ప్రవచనములకు మహారాజు భగ్గున మండిపడి కనుల నుండి విస్ఫులింగములు రాల మీరు అధర్మపరులనియు, విశ్వాస ఘాతకులనియు పలికి మఱియు నిట్లనెను. "మీకోటలు, పేటలు, ఇళ్లు, వాకిళ్లు నాశము చేసెదను. మీ ప్రజ లాబాలగోపాలము నా యాగ్రహానలమునకు జిక్కి భస్మముగాక తప్పద"ని పలికి యొర నుండి కత్తినిదూసి బాలనగరుల ఖండింప నుద్యమించెను. అంత మహారాజునుం గాంచి ప్రధానమంత్రి విజయసింహు డడ్డువచ్చి యిట్లనెను. "వీరు రాయబారులు. వీరిపై నాగ్రహించుట ధర్మము కాదు. వీరు తెచ్చిన సందేశమునకు నేను సమాధానము చెప్పెద"నని రాజాజ్ఞ పొంది సుబుద్ధింజూచి యిట్లనెను.

ఆర్యా ! మీరు వాసవీ కన్యకను విష్ణువర్ధన సార్వభౌమున కిచ్చుట కేల నిరాకరించుచున్నారు?" అన వారు "ఆమె దేవీ పూజకు నంకితురాలైన గౌరబాలిక, విశుద్ధబ్రహ్మచారిణి కాన నిరాకరించుచుంటిమ"నిరి. అంత ప్రధానమంత్రి వారితో "చంద్ర వంశసముద్భూతుడును, విష్ణ్వంశసంభూతుడును నగు మహా రాజుతో వియ్యమందుట మీ యదృష్టము. వాసవీ కన్యకయొక్క

మహాభాగ్యము. శ్రీ వాసవీ కన్యక కుద్భవించు వానికే యౌవ రాజ్యపట్టాభిషేకము గావింప మహారాజుగారిచే నొప్పించెదను. మీరు మునుపు వాసవీకన్య నిచ్చెదమని మాట యిచ్చితిరి కదా. ఆడినమాటను దప్పిన దాని పరిణామ మెంతటి భయంకరమైన దగునో యూహింపుడు.'' అనగా విని యతనితో సుబుద్ధి యిట్లనెను.

''ఇచ్చెదము కన్యకామణి నీయకున్న
చచ్చెదమని ప్రమాణముల్ సలిపినాము
ఇచ్చుట యధర్మమగుట పృథ్వీశ్వరుని క్ష
మింప గోరితి మటు క్షమియింపదేని
చచ్చెదము వాని చేతిలో సంశయమ్ము
లేదు మఱియొండు జరగదు లేశమైన.

కన్యక నిచ్చెదమనియు నట్లీయనిచో జచ్చెదమనియు బలికితిమి. ధర్మబద్ధులమై మీచేత చచ్చుటకే నిశ్చయించుకొంటి మని నిర్భయముతో బలుకుచున్న యాత్మబలసమన్వితులైన బాల నగరుల వచనములకు మంత్రి నిరుత్తరు డయ్యెను. రాజును పెదవి విప్పడయ్యెను. అంత బాలనగరులు రాజునొద్ద సెలవు గైకొని యశ్వారూఢులై పెనుగొండకు వెడలిపోయిరి.

ఆంధ్రప్రదేశము పశ్చిమ గోదావరిజిల్లా పాలకొల్లులోని
శ్రీ కృష్ణాశ్రమ స్థాపకులగు విశ్చలానందస్వామిచే
విరచింపబడిన విశ్వజ్యోతి కావ్యమున
మూడవయధ్యాయము
సంపూర్ణము.



# విశ్వజ్యోతి

---

## నాలుగవ యధ్యాయము

## శ్రీవాసవీ కన్యకా జీవిత చరిత్రము

### సుబుద్ధి ప్రబోధము

పెనుగొండ పట్టణమందుగల 714 గోత్రముల యార్య వైశ్యులు చంద్రదర్శనమునకై వేచియున్న చకోరపక్షులవలె సుబుద్ధి రాకకై నిరీక్షించుచుండ సుబుద్ధిప్రముఖ బాలనగరు లశ్వారూఢులై రాజమహేంద్రవరమునుండి వచ్చిరి. అంత సుబుద్ధి యార్యవైశ్యులజూచి రా జాస్థానమున జరిగిన వృత్తాంతము నెల్ల విన్పించి యిట్లనెను.

జరిగినదానికై గడువిచారపడఁ ఫలమేమిలేదు, భూ
వరుని మనంబు మార్చుటకు బ్రహ్మకునైన దరంబుగాద; యే
కరణిని నేదికాగలదొ కాక తలంగదు భావి చింతనఁ
జరపుడు మీరికఁ వ్యవధిచాలదు పోలదు సామమీపయిఁ.

భూనాథుండు మహోగ్రసేనుడయి రేపో నేడొ యిచ్చోటికిన్
రానున్నాడు సమస్త వైశ్యకులవారంబున్ సమూలంబుగా
దా నిర్మూలమొనర్ప నెంతయును బంతంబూని నా దీప్తతిన్
మాన ప్రాణములందు మీకు నభిమానంబెందొ చర్చింపుడీ!

తూచెదరెల్ల వస్తువితతుల్ తులయం దిట గొప్పదేదియో
నీచశరీరరక్షయొ యనిందితకీర్తి శరీరరక్షయో
తూచుడు త్రాసునం దునిచి తూచగ నేర్చిన జాణలార! మీ
ధీచతురత్వమెల్ల జగతిం బ్రకటింపు డుదారశీలురై.

ఇచ్చెదమేము కన్య నటులీయక తక్కిన నెల్లవారమున్
జచ్చెదమన్ ప్రమాణమును జ్ఞప్తికి దెచ్చుకొనుండు రెండిటన్
జెచ్చెర మీకు బోలినది నేయగ నీయెడ నిర్ణయింపు డీ
మచ్చ ఘటింపజేయకుడు మానితవైశ్యకుల ప్రసిద్ధికిన్.

మహాశయులారా! త్రికరణశుద్ధిగా సఖ్యమునకు ప్రయత్నించితిమి. విధిబలీయము. విష్ణువర్ధనుని మనస్సు మార్చుటకు సృష్టికర్తయగు బ్రహ్మకైన సాధ్యముగాదు. ప్రతిసంఘటనమును బురాకృత కర్మననుసరించి జరుగుచుండును. మహారాజు వాసవీ కన్యయందు బద్ధానురాగుడై యున్నాడు. కన్యక నీయనిచో మన సర్వస్వమును ధ్వంసమొనర్చెదనని ప్రతినబూని యున్నాడు. అతనిచే జిక్కి చిత్రవధకు బాల్పడెదరో, స్వచ్ఛందమరణమును గోరెదరో తేల్చుకొనుడు. మనము పరతంత్రులమై కన్యక నీయవలెనా? స్వతంత్రులమై తిరస్కరింపవలెనా? తేల్చుకొనుడు. కన్యక నిచ్చిన యధోగతి, యీయకున్న నూర్ధ్వగతి నిశ్చయము. ఇక మనకు వ్యవధిలేదు. పెనుగొండ పవిత్రము, త్రిమూర్త్యాత్మకము. ధర్మపత్నియగు గీర్వాణితోగూడిన భాస్కరాచార్యులు సత్యలోకనివాసులగు వాణీచతుర్ముఖులు. పెనుగొండయందుగల కోన కమల జనార్దనస్వామియే వైకుంఠనిలయులగు లక్ష్మీనారాయణులు.

వింధ్యవాసిని నగరేశ్వరస్వామియే కైలాసనిలయులగు పార్వతీ పరమేశ్వరులు. ఇట్టి పరమపవిత్ర క్షేత్రమందు జన్మించి పర మేశ్వరియొక్క యంశసంభూతయగు శ్రీవాసవీకన్యను పశుబల యుక్తుడగు విష్ణువర్ధనునకు అప్పగించి శరణుచొచ్చుటయా, తిరస్కరించుటయా ? యిందేది శ్రేయస్కరమో నిర్ణయించు కొనుడు.

రాజేగాదు ప్రపంచమంతయును సంగ్రామంబున న్నిల్చినన్
రాజాస్యన్ విడనాడకుండుటయె ధర్మం బింక ముమ్మాటికిన్
యోజింపన్ బనిలేదు దీనికయి యత్యుత్సాహ సంపన్నులై
మీజన్మంబు దరింపజేసికొనుడీ మీ మీప్రయత్నంబులన్.

మనము శ్రీవాసవి నొసగనిచో విచక్షణారహితముగ కుటుంబహత్యలను గావించి నిర్వంశము గావించెదనని విష్ణువర్ధ నుడు శపథము గావించినాడు. అందువలన నీ చరిత్రకు మూల కారణమైన శ్రీవాసవీకన్యయు 714 గోత్రముల వారిలో సంతానము గల దంపతులుమాత్రమే యగ్నిప్రవేశముచేయుచో పసిపిల్లలను వృద్ధులైనవారు రక్షించెదరు. వంశము సురక్షితమగును. లేనిచో నిర్వంశమగును. ఈ కైలాసయాత్ర యదృష్టవంతులకే లభించును. స్వచ్ఛందమరణమునకు సంసిద్ధపడుడు. లేనిచో పదునెనిమిది నగరములను వీడి తత్క్షణమే యెల్లరును సురక్షితస్థానములను జేరుడు. ఇదియే భాస్కరాచార్యులయొక్కయు, కుసుమశ్రేష్ఠి యొక్కయు నాదేశము.'' ఈవిధముగ సుబుద్ధి యార్యవైశ్యులకు ప్రబోధము గావించెను.

## 612 గోత్రములవారు వెడలిపోవుట

సుబుద్ధి ప్రబోధము విన్నవారిలో నారువందలపండ్రెండు గోత్రములవారు వ్యతిరేకించిరి. నూటరెండుగోత్రముల వా రంగీకరించిరి. ప్రతిపక్షమునకు నాయకుడైన రాజసశ్రేష్ఠి సుబుద్ధింగాంచి యిట్లనెను.

కటకట ! లోకమందెచట గానని యీ విపరీతబుద్ధి మీ
కెటుల జనించెనయ్య ! ధరణీశ్వరుడు న్మదమంద గన్యని
చ్చుట తగదంచు నేనిగమసూక్తి వచింపునొ జెప్పుడయ్య ! సం
కటములుకోరి తెచ్చికొని కట్ట ! త్యజించెదరయ్య ప్రాణముల్ !

విష్ణువర్ధన పతితోడి వియ్యమంప
వైశ్యసంఘమ్మునకు ప్రాభవంబు గలుగు
నట్లు చేయనిచో కన్యనపహరించి
యతడు గొనిపోడె మన గర్వమణగద్రొక్కి

గోటితో బోవుదానికి గొడ్డళ్ళ నుపయోగించుటయేల ? సకల పురుషార్థసిద్ధికి నీ శరీరమే సాధనము. పురాకృత పుణ్యఫలముచే మన కీ మానవజన్మ లభించినది. మనమందఱ మేకీభవించి వాసవి నిచ్చుచో సమస్తసౌఖ్యముల ననుభవింపవచ్చును. లేనియెడల నుభయభ్రష్టుల మయ్యెదము." అని యధర్మముతో బల్కుచున్న రాజసశ్రేష్ఠినిజూచి సుబుద్ధి యిట్లనియెను.

"ఉర్విగలన్నినాళ్ల కుల మూరును బేరును నిల్ప జాలియున్
సర్వజనాళి మెచ్చగ బ్రశస్త దిగంతనితాంత విస్తృతా
ఖర్వయశంబునొంది మనగావలె నంతియెకాని మూర్ఖులై
దుర్విధి పాపపంకమున దూలెడి వారలకేల జన్మముల్ ?

అజ్ఞానులై దేహమే శాశ్వతమని భ్రాంతిపడి లౌకికభోగముల కెగబడు వారి జీవితము వ్యర్థము. వేయిమంది గ్రుడ్డివాండ్ర సాక్ష్యమునకన్న నేత్రములున్న యొక్కని సాక్ష్యమే ప్రమాణము. పదివేలమంది యజ్ఞానుల మాటలకన్న నొక్క జ్ఞానిమాట పరమ ప్రమాణము. అధికసంఖ్యాకులని యహంకరించుట యవివేకము. కాకి నూఱేండ్లు, కొండచిలువ వెయ్యేండ్లు జీవించియున్నను నిష్ప్రయోజనము. మనకు కావలసినది దీర్ఘజీవితముగాదు. దివ్య జీవనము. ఎవడు సత్యమును ధర్మమును నభిమానించునో యతడు మాతో నుండవచ్చును. లేనిచో పదునెనిమిది పట్టణములను వదలి వెడలిపోవచ్చును. నిర్బంధములేద''ని పలుకుచున్న సుబుద్ధిం గాంచి మృగరాజును గాంచిన క్షుద్రమృగములవలె భయభ్రాంతులై 612 గోత్రములవారు నిట్లనిరి.

రేణుకాసీ త్కృతయుగే త్రేతాయాం జనకాత్మజా
ద్వాపరే ద్రౌపదీదానీం మృత్యు ర్వాసవి కన్యకా
ఏషా వైశ్య కులాంభోధేః బడబాగ్ని శిఖాభవత్.

కృతయుగమునకు జమదగ్నిభార్య రేణుకాదేవియు, త్రేతాయుగమునకు సీతాదేవియు, ద్వాపరయుగమునకు ద్రౌపదీదేవియు, కలియుగమునకు వాసవీకన్యయు జనక్షయము కొఱ కుద్భవించి రనుచు దమతమ దురదృష్టమును నిందించుకొనుచు బదునెనిమిది నగరములను వదలిపెట్టి యారువందల పండ్రెండు గోత్రములవారు వెడలిపోయిరి. వీరు క్రమముగా మాంసభక్షకు

లై రి. వీరు కళింగకోమట్లు, భేరికోమట్లు, దూదికోమట్లని పేరు పొందిరి. అగ్ని ప్రవేశమొనర్చినవారు గౌరకోమట్లని ప్రసిద్ధి నందిరి. ఈవిధముగ నూటరెండు గోత్రములవారు మాత్రమే యగ్ని ప్రవేశమొనర్ప నిశ్చయించుకొనిరి.

భాస్కరాచార్యులు వీరిలో నుండి విడిపోయిన వారికిని వీరికిని సంబంధములు లేకుండునట్లు సంకేతనామముల నేర్పాటు చేసిరి. నూటరెండు గోత్రములవారికి మాత్రమే సంకేతనామములు తెలియును. నాటినుండియు నూటరెండు గోత్రముల వైశ్యులు ఋషినామమును సంకేతనామమును, చెప్పుకొనుచున్నారు. కొంతమంది క్రమక్రమముగ ప్రధానమగు ఋషినామమును వదలి పెట్టి సంకేతనామమునే చెప్పుచున్నారు. అందువలన సగోత్ర వివాహములు జరగు ప్రమాదము గలదు. కాన ఋషినామమును సంకేతనామమును జెప్పుట ధర్మము.

'గాం త్రాయతే రక్షతి ఇతి గోత్రం' వంశమును రక్షించునది గావున గోత్రమని యర్థము. మన వంశోద్ధారకులు మహర్షులు. కాన నందఱు ఋషి నామమును ముఖ్యముగ జెప్పవలయును. సంకేతనామమన గుర్తుకొఱకు పెట్టుకొన్న పేరని యర్థము. అగస్త్యస (ఋషినామము) అనపకుల (సంకేతనామము) బోధాయనస (ఋషినామము) బుధనకుల (సంకేతనామము) ఇట్లు ఋషినామము చివర 'స' యనియు సంకేతనామము చివర 'కుల' యనియు వచ్చుచుండును. విజ్ఞులు దీనిని ముఖ్యముగ గ్రహించి ఋషినామమును సంకేతనామమును జెప్పుట మంచిది.

## నూటరెండు గోత్రములవారు అగ్నిప్రవేశమునకు నిశ్చయించుట

714 గోత్రములవారిలో 612 గోత్రములవారు అగ్ని ప్రవేశమునకు విముఖులై వెడలిపోయిరి. నూటరెండు గోత్రములవారు మాత్రము అగ్నిప్రవేశమునకు నిశ్చయించిరి. భాస్కరాచార్యులవారు వారిని వీరకంకణము గట్టుకొనుట కాహ్వానించెను. మొదట లాభగుప్త నారీమణి యను దంపతులు వచ్చిరి. వారితో భాస్కరాచార్యులు "సంతతిగల దంపతులు మాత్రమే యగ్నిప్రవేశార్హులు. సంతతిలేనివా రగ్నిప్రవేశ మొనర్చుచో వారి గోత్ర మంతరించును మీకు సంతతి లేదు. కాన కంకణధారణము చేయరా" దనగా భాస్కరాచార్యులకు నమస్కరించి లాభగుప్త యిట్లనెను. "మాకు విజ్ఞాన మను కుమారుడు గలడు కాన మేము సంతానవంతులమే. స్వచ్ఛంద మరణము మునుపు భీష్మాచార్యులకే గలిగెను. ఇపుడు నూటరెండు గోత్ర ములవారికిని లభించినది. స్వర్గద్వారము తెఱవబడినది. మా కందు ప్రవేశభాగ్యమును గలిగింపుడ"ని ప్రార్థింపగా వారి ధీకుశలతకు సంతసించి యాచార్యులు వీరకంకణమును గట్టిరి. వారు అగ్ని ప్రవేశమొనర్చుటచే వారి గోత్రమంతరించి నూటయొక్క గోత్ర ములు మాత్రము నేటికిని వెలసియున్నవి. (వివరములకు ధర్మ నందన చరిత్రమును జూడుడు.)

భాస్కరాచార్యులు తక్కిన గోత్రముల వారికిని క్రమముగ వీరకంకణములు గట్టిరి. ఆర్యవైశ్యుల యగ్నిప్రవేశ వృత్తాంతము నగరమున చాటింపవలసిన దనియు, విష్ణువర్ధనుని ప్రవర్తనలను గనిపెట్టుచుండుడనియు బాలనగరుల కాచార్య

లాజ్ఞ చేసిరి. అగ్నిప్రవేశ నిశ్చయమును వాసవీకన్య కెఱింగింప వలసినదని కుసుమగుప్తునకు నాదేశించిరి. పిదప నందఱు తమ తమ నెలవులు చేరిరి.

## కుసుమశ్రేష్ఠి వాసవితో నగ్నిప్రవేశ నిశ్చయము తెలుపుట

చని యమ్మందిరమందు బూజ్యుడు వణిక్చంద్రాస్యలం గాంచి య
వ్వనితా మధ్యమునన్ సహస్ర శశిబింబ స్ఫూర్తిభాసిల్లు కాం
చన గాత్రిన్ నిజపుత్త్రిగాంచి తనకున్ సైరింపరానంత మీ
ఱిన సంతాపము లో నణంచుకొని చేరెన్ తత్సమీపంబునన్.

సభా భవనమునుండి కుసుమశ్రేష్ఠి స్వగృహముచేరి సఖీ పరివృతయై నక్షత్రముల మధ్య చంద్రబింబమువలె భాసించు చున్న వాసవీకన్యం జూచి పొంగి పొరలి వచ్చు దుఃఖమును గ్రమింగుకొనుచు సమీపించి యామె ముంగురులు సవరించుచు నగ్ని ప్రవేశ వృత్తాంతమును దీక్షాకంకణధారణమును వాసవితో దెల్ప నా కన్యయు దండ్రిం జూచి "మీ నిర్ణయ మత్యుత్తమ మైనది. విష్ణు వర్ధనుని వలన మీ రనుభవించుచున్న పరితాపము నాకు తెలి యును. మీ రెవరో నాకు తెలియును. నన్ను మీ రెఱుంగరు.

అహం విశ్వస్యజగతో ధాత్రీ విశ్వస్వరూపిణీ
మయైవ మోహితా స్సర్వే నిమజ్జం తీహ మాయయా।
త్వం పితాహం నిజసుతా తవే త్యజ్ఞానకారణాత్
నజానాస్యఖిలేశాం మాం సర్వకారణ కారణామ్॥

తండ్రీ! నేను సమస్త బ్రహ్మాండములకు నాధారయగు పరాశక్తిని. సమస్తభువనములయందుగల ప్రాణికోట్లు అత్తి పండులో పురుగులవలె నామాయలో పరిభ్రమించుచున్నవి. నన్ను పుత్త్రికననియు, నీవు తండ్రివనియు భావించుట నామాయా ప్రభావమే. మృణ్మయశరీరములు వేఱువేఱుగా గన్పించు చున్నను చిన్మయస్వరూప మొక్కటియే కదా!

ఈశ్వరభక్తశేఖరుడ వీవు మహాత్ముడవోయి తండ్రి! స
ర్వేశ్వరు నాజ్ఞ నీకు నుదయించి తరించితి నేనుగూడ వై
శ్యేశ్వర! యింక నైహిక సుఖేచ్ఛలనెల్ల ద్యజించి హాయిగా
విశ్వమయున్ హరుంగనగ వేగమపోయెద మెల్లవారమున్.

అనలద్వారముజొచ్చి శ్రీరజతశైలాంతర్గుహా మందిరం
బున మౌనీంద్ర సురౌఘ మధ్యమణిదీప్తుల్ గ్రాలు హేమాసనం
బునధిష్ఠించి జగంబులేలు కరుణాంభోరాశి నీశుంగనన్
మనమీనాడు ప్రయాణమౌదమమరుల్ మర్త్యుల్ ప్రశంసింపగన్

వాసవీకన్య తండ్రిం గాంచి మహాత్మా! నీవు విజ్ఞాన మూర్తివి. విశేషించి పరమేశ్వరభక్తుడవు. అయినను నాయందు గల ప్రేమచే సూర్యుని మేఘమావరించినటుల నీ హృదయమును దుఃఖమావరించినది. అందువలన మీకు తెలిసిన విషయములనే జ్ఞాపకము చేయుచుంటిని. తండ్రీ! ఇహసుఖములు దుఃఖ సమ్మి శ్రితములు. ప్రతిబింబసుఖములు. ప్రతిబింబసుఖము క్షయము. బింబసుఖ మక్షయము. భూలోకమున మన కార్యక్రమము పూర్తి యయినది. అందువలన పవిత్రుడగు నగ్నిహోత్రునిద్వారమున మనస్వస్థానమైన పరమేశ్వరసాయుజ్యము పొందుచుంటిమి. తాత్కాలికసుఖమును విడిచి శాశ్వతసుఖమును పొందుటకు

దుఃఖింపవలయునో సంతోషింపవలయునో మీరెఱుంగనిదికాదు. ఈ సంఘటన మనక్షేమమునకే జరిగినది. మనకు కావలసినది దీర్ఘజీవితముకాదు. దివ్యజీవనము. సర్వము శ్రేయమునకే జరుగు చున్నదని గ్రహించువాడే స్థితప్రజ్ఞుడు. ఈలోకము శోకమయము. భగవంతుడొక్కడే యానందమయుడు. తండ్రీ! అటు తిల కింపుము. కైలాసద్వారము తెఱవబడియున్నది. స్వచ్ఛంద మరణ మదృష్టవంతులకు మాత్రమే లభించును.'' అనగా విని యచ్చట వార లెల్లరు నద్భుతాశ్చర్యములనొంది మన జన్మములు ధన్యము లయ్యెనని పరమానందభరితులైరి.

## ఆర్యవైశ్యుల యగ్నిప్రవేశము

అనలము సిద్ధమయ్యె గుసుమాంబ కుమారిని జేనికీయకా
జనపతిచేత జచ్చుటకు సమ్మతిలేక మహాగ్నిజొత్తుమం
చనుపమమౌ ప్రతిజ్ఞ గొనినట్టి వణిక్కులముఖ్యులార! యో
యనఘచరిత్రులార! తటియయ్యెప్రయాణముగంటు, లెండికన్

అని యొక ఘాంఘికుండు పురమంతయు జాటుచునుండ గ్రక్కునన్
వినుటయు మోముదమ్మి నొకవింతవికాసము దోప దండ్రితో
ననియె గుమారి తండ్రి! నిజమారయ నీవును భాస్కరార్యుడున్
అనుపమ దివ్యదృష్టిగల యట్టి మహాత్ములుగా దలంచెదన్,

చెప్పక యుండరాదనుచు జెప్పితి, వంతియెకాని తండ్రి! నే
డిప్పనియందు నా హృదయ మెట్టిదొ యింతకుమున్న పోల్చి నీ
వప్పుడె తత్ప్రయత్నములనన్నియు జేసితి వెల్ల భంగులన్:
దప్పదు దేవతాంశ జనిత ద్విజరత్నమ వౌదువే సుమా.

అగ్నిహోత్రములు సిద్ధమైనవి. కైలాసయాత్రకు నార్య వైశ్యులు సంసిద్ధులుకండని శ్రీ వాసవీకన్యకకు జాటింపు వినిపింప నామె పులకించి తండ్రినిజూచి చిఱునవ్వుతో నిట్లనెను. "మీకును భాస్కరాచార్యులకును దివ్యదృష్టిగలదు. నా హృదయాభి ప్రాయమును మీరు ముందే గ్రహించి సమస్తము సంసిద్ధ మొనర్చుకొని నిమిత్తమాత్రముగా నాకు దెల్పితిరి. ఇది మహాత్ములకే సాధ్య"మని పలుకుచున్న శ్రీవాసవీ వాక్యములకు దండ్రి పరమానందభరితుడయ్యెను.

అటు పెనుగొండలోని వణిగ్గణులందఱు వాసవాంబతో
జటుల మహాగ్ని మార్గమున శంకరశైలమునందునన్ వసిం
చుట కరుదెంచుచుండి రనుచున్ జగమంతయు జాటువాంఛ నం
తట నళినీధవుం డపర ధాత్రిధరాగ్రము నెక్కె గ్రక్కునన్.

భక్తలోకేశ ! ఈశ ! మాంపాహి యనుచు
కన్యకాపరమేశ్వరీ ! కావుమనుచు
నగరమధ్యస్థితాగ్ని కుండముల దరికి
బరుగులిడజొచ్చి రానంద భరితులగుచు.

సూర్యభగవాను డపూర్వమైన యార్యవైశ్యుల మహాప్రస్థానమును బ్రపంచమునకు దెల్పగోరెనా యనునట్లు అస్త్రాద్రిపై కెక్కెను. సాయంకాలమైనంత నూటరెండు గోత్రముల యార్య వైశ్యులు సాయంసంధ్య లొనర్చి పరమేశ్వరుని హృదయముల పదిలపఱచి వాంఛ లుడిగి భూతి పూత లలంది రుద్రాక్షమాలలు ధరించి యగ్నికుండముల సమీపించిరి.

హైమవతీ యుమాంశభవ యాద్విజకన్యక వాసవాంబ యా
పై మహనీయులైన ద్విజవంశజులుఁ గనను దాయవచ్చు వా
రీమెయి; తచ్ఛరీరముల నేను స్పృశించి పవిత్రుడౌదు నీ
భూమి నటంచు నంబరము ముట్టుచు బేర్చె హుతాశనుండటఁ;

మనకడ కేగుదెంచిన యుమా పరమేశుల రాయబారి; తా
మన కల రాజతాచలము మార్గము జూపెడు మార్గదర్శి యీ
ఘను, నిట గౌరవింప దగుగా కని చారుసుగంధ పుష్ప చం
దనముల బూజసల్పిరి ముదంబున వైశ్యులు వీతిహోత్రునిన్.

ఆ విధి బూజచేసి వణిగగ్రగణులెల్ల నిమీలితాక్షులై
కేవల తన్మయత్వమున గేశవమిత్రు నుమాకళత్రునిన్
భావమునందు నిల్పి దృఢభక్తి భజింపుచునుండ నంత నా
నావిధ చారు మంగళ నినాదము లొక్కుమ్మొగిన్ వినంబడెన్.

విశ్వజ్యోతి శ్రీ వాసవీ కన్యకయు స్థితప్రజ్ఞులైన నూట రెండు గోత్రముల యార్యవైశ్యులు నన్ను దరియవత్తురు. వారి సంస్పర్శ మహాభాగ్యము కల్గెనని యానందముతో నగ్నిహోత్రుడు మిన్నుముట్టుచుండెను. ఆర్యవైశ్య "లితడు దిక్పాలుడు. సర్వాంతర్యామి. పరమపవిత్రుడు. మనకు కైవల్యమును జేకూర్చు మహనీయుడు. మార్గదర్శి" యని యగ్నిహోత్రుని పుష్పములచేత బూజించుచుండిరి. మహాత్ములైన యార్యవైశ్యుల సంస్పర్శ భాగ్యము కల్గెనని యగ్నిహోత్రుడును, నగ్నిహోత్రుని ద్వారా స్వస్థాన మలంకరించుచుంటిమని యార్యవైశ్యులు పరస్పరము

నానందభరితులై యుండిరి. అంత భూనభోంతరములు నిండ శ్రవణపర్వముగా మంగళవాద్యములు వినిపించెను.

భాస్కరాచార్యుల యధ్వర్యమున శ్రీ వాసవీ కన్యక, పత్నీ సహితులై నూటరెండు గోత్రముల యార్యవైశ్యులు నగ్నిప్రవేశమునకు సిద్ధసంకల్పులై శ్రీ భాస్కరాచార్యులకు, కవులకు, పండితులకు షోడశ మహాదానముల గావించి మాంధాత, శిబిచక్రవర్తి, బలిచక్రవర్తులను జ్ఞప్తికిదెచ్చుచుండిరి. ఇట్లు ఆర్యవైశ్యులు కృతకృత్యులై గోవులం గాంచి యుత్సాహముతో బయల్వెడలు వత్సములభంగి శ్రీ వాసవిని ముందుంచుకొని దేవతలు పుష్పముల వర్షించుచుండ నగరేశ్వరాలయ ప్రాంతమందుగల నగ్నిహోత్రుని సమీపించుచుండిరి.

సీ. చెక్కుటద్దాలపై జొక్కంపు రతనాల
తాటంకముల తళత్తళ లెసంగ
దలయంటు కతన నెంతయురేగి ముంగురుల్
నిండు చందురు మోము నిండ గ్రమ్మ
పసుపు పచ్చని జరీ పట్టుపుట్టము చాయ
తనువు బంగరుకాంతి నినుమడింప
మందార సుమహార మకరంద ధారాగ
తేందిందిరము లటు నిటు చెలంగ
చిన్ని నవ్వులు నవ్వుచు జెలులతోడ
ముచ్చటించుచు నానందమూర్తిని యయి
దివ్యతేజంబుతో బయల్దేరివచ్చె
భాసుర గుణావలంబ శ్రీ వాసవాంబ.

నేల జీరాడు నన్నెలత పెన్నెఱివేణి
కొన లెత్తి కొందఱంగనలు నడవ
లలిత మంగళ గీతములతోడ గపురంపు
హారతులను గొంద అతివ లొసగ
ముఖచంద్ర మండలంబున గ్రమ్ము ముంగురుల్
సఖులు కొందఱు దిద్ది చక్కఁజేయ
నేల నంటగనీక నిద్దంపు మడుగుల
నడుగులకును గొంద అబల లొత్త
చామరంబులు కొందఱు సఖులు వీవ
సతులు కొందఱు పన్నీరు జల్లుచుండ
నాక కాంతలతో నందనమున కేగు
శచివిధంబున వచ్చె నచ్చటికి నెలత.

ఆర్యవైశ్య సమన్వితయై, బ్రహ్మవర్చస్సముపేతయై యగ్నిహోత్రుని సమీపించుచున్న శ్రీవాసవీకన్యను జూచి యామె ముక్తికాంత యని కొందఱు, త్రిలోకసుందరి యని కొందఱు, చంద్రబింబమని మఱికొందఱు పలుకుచుండిరి. కొందఱు హారతు లిచ్చుచుండ కొందఱు వింజామరలు వీచుచుండ మఱికొందఱు పాదములు కందకుండ రత్నకంబళములు పఱచుచుండ హంస గమనముతో వచ్చి చిటపట ధ్వనుల నెల్లెడ నింపుచు ప్రళయ కాలాగ్నులవలె మిన్నుముట్టుచున్న నూటమూ డగ్నిగుండములం గాంచి శ్రీ వాసవి నూటరెండు గోత్రముల యార్యవైశ్యులతో ప్రశాంతముగ నిట్లనియెను.

## శ్రీ వాసవీ కన్యకా ప్రబోధము

అంతశ్శత్రుల నార్యవరగ్గెలిచి యత్యంత ప్రభన్నన్న ధీ
మంతుల్మీరలు; మీకు నల్పుడును సామాన్యుండు నౌ శత్రుభూ
కాంతుం డొక్కరుడేమి కీడు సలుపంగా జాలు వాడీ వృథా
భ్రాంతిం జెందెడుగాక యిందుగల మర్మంబెల్ల రాలింపుడీ !

మహాశయులారా ! ధర్మము నెవడు రక్షించునో వానినే ధర్మము రక్షించును. దయాధర్మము లెవరికి లేవో వారిని వారి యధర్మమే భక్షించును. మీరు ఆత్మబల సమన్వితులరు. విష్ణు వర్ధనుడో పశుబలసమన్వితుడు. ధర్మసమ్మతమైన మన సంకల్పము నెఱవేఱును. అధర్మము హానినే కలిగించును.

ప్రతి సంఘటనమును వారివారి పురాకృత కర్మము ననుస రించి జరగుచుండును. మణిపురాధిపతి యగు చిత్రకంఠుడు మహా గిరియందున్న సోమదత్తమహర్షి యొక్క పుత్త్రిక కీర్తికన్యను జూచి మోహించెను. తన యభిప్రాయమును సోమదత్తమహర్షికిని నపు దచటనుండు నూటరెండు గోత్రములవారికిని తెలియజేసెను. ఇది యధర్మమని వారు నిరాకరించిరి. చిత్రకంఠు డాగ్రహ పరవశుడై యొక కన్యక నెపమున మీరు సపత్నీకముగ నగ్ని హోత్రము పాలగుదురని శపియించెను. అంత నార్యవైశ్యులు చిత్రకంఠా ! నీవు అకారణముగ శపించితివి గనుక నా కన్యక శాపముననే నీ శిరము సహస్ర శకలము లగునని ప్రతిశాప మిచ్చిరి. కాన నా చిత్రకంఠుడే విష్ణువర్ధనమహారాజుగా, సోమ

దత్త మహర్షియే కుసుమశ్రేష్ఠిగా నాకీర్తికన్యకయే నేనుగా జన్మించితిమి.'' అని జరిగిన వృత్తాంతమును దెల్పి జరగనున్న దానిని గూర్చి యిట్లనెను.

'విష్ణువర్ధనుడు కామాంధుడైనను పరమేశ్వరి నగు నన్ను నిరంతరము స్మరించుటచే జన్మరాహిత్యము నొందగలడు. మీరు అగ్నిహోత్రునిద్వారా కైవల్యమొందెదరు. నేనో యగ్నీశ్వరుని ద్వారా పరమేశ్వరుని భజించెదను. ఈ శాపప్రతిశాపములు మన కందఱకు మోక్షకారణములైనవి.' అనుచుండ భూమ్యాకాశమధ్యమందంతట ధూళిక్రమ్మెను. ఆ ధూళియందే చతురంగ బలసమన్వితుడగు విష్ణువర్ధనుడు అగ్నిప్రవేశమొనర్ప నుద్యుక్తమైన శ్రీ వాసవీకన్యను బలాత్కరించుటకు సంసిద్ధుడై వచ్చెను. ఆత్మబల సమన్వితయగు శ్రీ వాసవీకన్య వాని కెదురుగ నడచి యిట్లనెను.

విష్ణువర్ధనరాజా! చంద్రవంశసముద్భూతుడవై ధర్మమును రక్షింపవలసిన నీవే యధర్మకృత్యమునకు బూనితివి. దొంగలు, జారులు కూడ పట్టపగలు అధర్మమాచరింప వెఱతురు. నీవు మానావమానములను మంటగలిపి బహిరంగముగ నొక బాలికను బలాత్కరింప సంభ్రమించుచుంటివి. ధర్మాత్ములకు జయము, అధర్మాత్ములకు నపజయము తథ్యము. భగవంతుని స్మరింపుచు త్యాగ విశుద్ధ ప్రవర్తనగలవారు దేవతలు. భగవంతుని విస్మరించి స్వార్థపరులై పరపీడన మాచరించువారు రాక్షసులు. నీవు మానవుడవయ్యు చర్యలవలన దానవుడవైతివి. అని పలుకుచు నగ్ని

ప్రవేశమొనర్చి తన విశుద్ధ స్వరూపమును వ్యక్తము చేసెను. ఇట్లు సాక్షాత్కరించిన శ్రీ వాసవీస్వరూపము విష్ణువర్ధనునకు మధ్యాహ్న దిన మార్తాండ బింబమువలె దుర్నిరీక్ష్యమై యుండెను. భక్తులైన యార్యవైశ్యులకు చంద్రబింబమువలె మనోహరమై యుండెను. ఆర్యవైశ్యులు పరమేశ్వరి నిట్లు స్తుతించిరి.

చతుర్భుజాం విశాలాక్షీం పీనతుంగ పయోధరాం
తటిత్కోటి ప్రతీకాశాం జ్యోతయన్తీం దిశోదశ
సూర్యకోటి ప్రతీకాశాం చంద్రకోటి సమప్రభాం
వందామహే వయం సర్వే మాతః నః పాహి సర్వదా.

సీ. నలుదెసల్ భాసిల్లు నవరత్న ఘటితకాం
చనకిరీట ప్రభాచయముతోడ
ధనురాకృతిని ఫాలమున గ్రాలు మేలి సిం
ధూర రేఖాత్రయ ద్యుతులతోడ
కంఠసీమను వ్రేలు ఘనమణి స్థగిత హా
రాద్యనేక విభూషణాళి తోడ
నవయవంబుల దివ్య ధవళకాంతుల మనో
హరమైన సింహవాహనముతోడ
పాపముల బాపు చల్లని చూపుతోడ
చంద్రికల జల్లు మందహాసమ్ముతోడ
బరమ కల్యాణి వగు పురహరుని రాణి!
యంబికాదేవి! మా మ్రొక్కు లందుకొనుము.

## దండకము

జయజయ శివే! మహాలక్ష్మి! గీర్దేవతే! శక్తి! కంకాళి! హుంకారిణీ! ప్రాణరక్షా! కరాళీ! త్రినేత్రీ! త్రిశూలీ! త్రివేదస్వరూపీ! భవానీ! శ్రియం దేహి మే పాహి మాం దేవదేవీ! త్రయీసర్వదే! నిర్వికల్పే! సమస్తాపదుద్ధారిణీ! ధ్యానదీనావనే! భక్తరక్షాపటిష్ఠే! వసిష్ఠాది సంసేవ్య మానాంఘ్రి పద్మే! శరణ్యే! నమస్తే నమస్తే నమః.

అని ప్రార్థించుచు నూట రెండు గోత్రముల యార్య వైశ్యులు పరమేశ్వరిని హృదయమందు పదిలపఱచి యగ్ని ప్రవేశమొనర్చి పార్థివశరీరముల వదలి చిన్మయస్వరూపులై యమృతత్వమందిరి. విష్ణువర్ధనమహారాజు శ్రీ వాసవీ విశ్వరూపమును గాంచి భయభ్రాంతుడై గడగడ లాడుచుండ,

హేయంబౌ విషయాభిలాష బుధు లెన్నో చెప్పినన్ మోహాచింతాయుక్తిన్ విన కస్థిరుండవయి పంతంబిట్లు తీర్పంగ నన్యాయాసక్తిని సర్వధర్మములు మంటం గల్పితే మూఢబుద్ధీ! యిప్డే నీ తల వేయివ్రయ్యలుగ పృథ్విన్ ద్రెళ్లు పాపోద్ధతిన్.

శ్రీ వాసవీకన్య విష్ణువర్ధన మహారాజును జూచి యిట్లనెను.

"నీ శ్రేయముగోరి మహాత్ము లెన్ని బోధించినను సమ్మతింపక పరమార్థ విముఖుడవై విషయలోలుడవై యున్న నీ శిరము సహస్ర శకలము లగుగాక!" అని శపింప విష్ణువర్ధనుని శిరము వేయివ్రయ్యలైన నతడు భూమిపై ద్రెళ్లెను. అతని

జ్యోతిర్మయమగు నాత్మ యఖిలాండకోటిబ్రహ్మాండ నాయకుడైన పరమేశ్వరునందు లీన మయ్యెను.

## గోప్రాశస్త్యము

అంత బాలనగరులు గౌరబాలికలు తమ తమ తలిదండ్రులతో నుత్సాహముతో నగ్నిప్రవేశమున కుద్యుక్తులైనంత వారితో బాటు వైశ్యబాలురును సంసిద్ధులైరి. వారితో శ్రీవాసవి యిట్లనెను.

"బిడ్డలారా! వసువులు, రుద్రులు, ఆదిత్యులు, విశ్వేదేవతలు, మరుత్తులు, కుబేరుడు మొదలగు మహాత్ములు జన్మించిన మీ వంశము నిర్వంశము గారాదు. చిరస్థాయిగ నుండవలెను, మీరు గృహస్థాశ్రమమును స్వీకరించి మీ స్వధర్మమైన గోరక్షణ మాచరించుచు నన్ను స్మరించుచుండుడు. కంటికి రెప్పవలె మిమ్ము సంరక్షించెదను" అని విరూపాక్షుడు మొదలగు వైశ్యబాలరతో గోప్రాశస్త్యమును వివరింప దొడగెను.

ఈ కలియుగమున ధర్మార్థకామ మోక్షములను చతుర్విధ పురుషార్థప్రాప్తికి హేతువగు గోరక్షణము పరమధర్మము. దిలీప మహారాజు సంతానార్థియై వసిష్ఠమహర్షి యాదేశము ననుసరించి నందినీధేనువును సేవింప వంశోద్ధారకుడు రఘుమహారాజు జన్మించెను.

శరుదేలాటి ఖలుండునేన్ బ్రతికియుండంగా సుధా పూర తు
ల్య రస క్షీరమొసంగి సంతతము బ్రహ్మానందము న్గూర్చి యా
నరుడున్ గిట్టినయంత నూతగను గొన్న న్నిన్ను నవ్వాని వై
తరణిం దాటగజేసి పాపెదవు సంతాపంబు గోమాతరో!

జననీ! నీ మహిమంబుగూర్చి పరసాక్ష్యంబింక మాకేల? మో
హన వైకుంఠ నిధానుడౌ హరియె యాత్మావాసమేన్వీడి మే
దిని నీ సేవకు యాదవాన్వయమునన్ దీపించి గోపాలపా
వన వృత్తిం జరియించి గైకొనడె గోపాలాభిధానంబు దాన్.

జనులారా! ఘనులార! యార్షమత విశ్వాసాత్ములారా! సువ
ర్తనులారా! నిజధర్మకర్మ చణులారా! గాంచుడీ భారతా
వని జన్మించిన వారికెల్లరకు సౌభాగ్యంబు గోమాతయే
కనుడీ దానిని వీడి భాగ్యమది భోగ్యంబౌనె దౌర్భాగ్యమా.

రైతులేక యున్న రాజ్యంబులే లేవు
గోవులేక రైతు భావిలేదు
సకల సాధుజీవి సర్వార్థ సంజీవి
గోవు గాన దాని గావు డయ్య!

మీ స్వధర్మమైన గోరక్షణమొక్కటియే యమృతత్వమును
గల్గించునని వైశ్యబాలురతో చెప్పెను.

# శ్రీ వాసవీ కన్యక సకలోపనిషత్సారమును సంగ్రహముగా చెప్పుట

శ్రీ వాసవీ కన్యక బాలనగరులను, గౌరబాలికలను నిమిత్త మాత్రముగ నుంచుకొని లోకకల్యాణమునుగోరి ఇట్లుపదేశించెను, బిడ్డలారా! అధర్మమును అరికట్టి ధర్మమును నెలకొల్పుటకై స్వార్థమునువీడి మీరు త్యాగమునకు సర్వసన్నద్ధులగుట ప్రశంస నీయము కాని దృశ్యమగు సమస్తము నొక మహత్తర శక్తి కధీనమై తన్నియమము ననుసరించి నడచుచున్నది. నూటరెండు గోత్రముల వారు విధిననుసరించి యగ్నిప్రవేశమొనర్చిరి. మీ జీవితము లట్టివి కావు. ఆజన్మబ్రహ్మచర్యవ్రతము నవలం బించి లోకకల్యాణమునకై దీక్షవహించితిరి. దానిని కొనసాగించు టయే మీ జన్మసాఫల్యమని సుబుద్ధి మొదలగు బాలనగరులతో నిట్లనెను.

## భగవంతుడు

1. ఈశ్వరుడొక్కడు. అందువలన మానవజాతియొక్కటే. మానవశరీరము లనేకములుగ నున్నను నన్నింటియందుగల చైతన్య మొక్కటే. సూర్యకిరణము లనేకములుగనున్నను సూర్యు డొక్కడే.

2. భగవంతుడు నిరాకారుడైనను అతడన్ని యాకారముల యందునున్నాడు.

3. సూక్ష్మమైన మఱ్ఱి విత్తనములో మహోన్నతవృక్ష మిమిడియున్నట్లు సూక్ష్మాతిసూక్ష్మమైన పరమాత్మయందు బ్రహ్మాండము లిమిడియున్నవి.

4. సముద్రమందలి జలజంతువు లెంత కల్లోలము గలిగించి నను సముద్రము నిర్వికారముగ నుండును. బ్రహ్మాండములయందలి జీవకోట్లెన్ని గడబిడలుచేసినను పరమాత్మనిర్వికారుడై యుండును.

5. ఔదుంబరవృక్షము (అత్తిచెట్టు)ను వనస్పతియందురు. దీనికి పుష్పములులేకయే చెట్టునిండుగ, కొమ్మలనిండుగ అసంఖ్యాకములుగా ఫలములుండును. అత్తిచెట్టు భగవంతుని వంటిది. దాని ఫలములవలె బ్రహ్మాండములు అసంఖ్యాకములుగా నుండును. అత్తిపండ్లలోని పురుగులవలె బ్రహ్మాండములయందు జీవకోట్లనంతముగా నుండును.

6. గలీబులువేరైనను అన్నిటియందుగల దూదియొకటే. దేహములు వేరైనను అన్నిటియందుగల ఆత్మ యొకటే.

7. కట్టెలలో అనేక జాతులున్నను భస్మము తెలుపే, ఆవులలో పలురంగులున్నను పాలు తెలుపే, శరీరము లనేకము లుగానున్నను చైతన్య మొక్కటే.

8. భగవంతుడు జగత్తునకు ఉపాదానకారణము, నిమిత్త కారణము నగుచున్నాడు. సాలెపురుగు తనయొక్కవలకు తానే యుపాదానకారణము నిమిత్తకారణము నగుచున్నది.

9. చీమ మొదలు బ్రహ్మపర్యంతముగల ప్రాణివర్గము నే చైతన్యమువలన వినుచున్నదో కనుచున్నదో మాటలాడుచున్నదో

దానిని ప్రజానమందురు. విజ్ఞానమును కోల్పోయిన అర్జునునకు శ్రీకృష్ణుడు ప్రజ్ఞానమును బోధించెను.

10. సూర్యచంద్రాదులకు గాంతినిచ్చుచు తనలో భేదము లేనిదై సకలలోకములను దన నాలుగవభాగముచేత వ్యాపించి శక్తిని మనకిచ్చునదే బ్రహ్మము.

11. సృష్టికిపూర్వము, సృష్టిలో, ప్రళయములోగూడ బ్రహ్మసద్రూపముతో నున్నాడు.

12. మాయ భగవంతునియొక్క వృత్తిజ్ఞానమును ఆవరించునేగాని స్వరూపజ్ఞానమును ఆవరింపజాలదు. మేఘము సూర్యునిజూచు మనకంటిని ఆవరించునేగాని సూర్యుని ఆవరించ లేదు. మేఘమండలము పైకివెళ్లిచూచుచో సూర్యుడు నిరావరణముగ ప్రకాశించుచుండును.

13. మనన మనగా పరతత్త్వధ్యానము.

14. మాయకు స్వాధీనులు దీనులు, పరమాత్మ నాశ్రయించినవారు ధీరులు. జ్ఞానధనమున్నచో అన్నిధనములు నున్నటులనే. ధనము ఐహికమునకే పనికివచ్చును. జ్ఞానధనము ఐహికాముష్మిక శ్రేయములనెల్ల కలిగించి జన్మమును ధన్యముచేయును.

15. పరమార్థదృష్టిలో త్రిలోకములను జయించినను గొప్పగాదు. తన ఇంద్రియములను జయించుటే గొప్ప.

16. లౌకికుడు ప్రపంచదృష్టిలో ఎంతగొప్పవాడైనను పరమార్థదృష్టిలో అల్పుడే.

17. సూర్యుడు పవిత్రగంగాజలమందును అపవిత్రమైన మద్యమందును ప్రతిబింబితుడైనను వానిలోని గుణదోషములు

సూర్యునంటనటుల ఆత్మ అనేక ఉపాధులయందున్నను ఉపాధుల సంబంధమైన గుణదోషములు పరమాత్మకంటవు.

18. సముద్రమందు అలలు తుంపరలు, బుద్బుదములు ఏర్పడి సముద్రమందే ఎటుల లయమగుచున్నవో స్వయంప్రకాశమైన పరమాత్మయందు అటులనే సృష్టి స్థితిలయములు జరుగుచున్నవి.

19. పరమాత్మను తెలియుచో మనస్సు దాసియగును, లేనిచో యజమానియగును.

20. అందరు నిరంతరము ధ్యానము చేయుచునేయున్నారు. ఆ ధ్యానమునకు విషయములైన వస్తువులలోనే భేదములు కలవు. అజ్ఞానులు నిరంతరము అర్థమునే చింతనచేయుదురు. జ్ఞానులు పరమార్థమునే చింతనచేయుదురు. అందువలన అజ్ఞానికి బంధము, జ్ఞానికి మోక్షము కలుగుచున్నవి.

## ఆత్మసాక్షాత్కారమునకు మార్గము

21. విశ్వకల్యాణము ఆత్మజ్ఞానముచేతనే నెలకొనును. మీరు ఆత్మసాక్షాత్కారమును పొంది పరిపూర్ణశాంతిని బడసి లోకమునకు ప్రబోధము గావింపుడు. లేనిచో పరిహాసములకు పాలయ్యెదరు.

22. కల్పిత ప్రకాశము లెన్నియున్నను సూర్యప్రకాశము లేనిదే ప్రాణికోటులు జీవింపజాలవు. అట్లే ఆత్మబలము లేనిదే మనుష్యుడు తరింపజాలడు.

23 లోకమున గృహస్థునకు జ్ఞానార్జనము మొదటివిధి. ద్రవ్యార్జనము రెండవది. దానిని సద్వినియోగ మొనర్చుట

మూడవది. ఎవడు సంఘమునకై, దేశమునకై, విశ్వకల్యాణ మునకై జీవితమును ధారపోయుచున్నాడో యతడమృతత్వమును పొందును.

24. మీ కర్తవ్య నిర్వహణమున క్షణమైనను నీశ్వరుని విస్మరింపకుడు. ఇరుసునుండి చక్రము వేర్పడిన బండి నడచునా? ఈశ్వరలక్ష్యము, ఈశ్వరసంబంధము తెగకుండ చూచుకొనుడు. ఈశ్వరజ్ఞానసూత్రము నాశ్రయించి నిర్భయముగ ప్రయాణము చేయుడు. మీరు లక్ష్యసిద్ధి పొందగలరు.

25. మీరు ఆత్మజ్ఞాన పరిపూర్ణులు కండు. విత్తనము లెంత శ్రేష్ఠమైనను వర్షములు లేక ఫలింపవు. మనుష్యుడెంత గొప్పవా డైనను జ్ఞానము లేక తరింపడు.

26. ప్రవక్తలగువారు ఆత్మసాక్షాత్కారము పొంది యుండవలెను. అట్టివారు సామాన్యులకు తమ స్వానుభవములను దెల్పి సుగమముగా గమ్యస్థానమును జేరుకొన నుత్తమ మార్గ ముల నిర్దేశింపగలరు. వారు చూపు మార్గములే మతము లన్న ప్రశస్తి గాంచినవి.

27. మిమ్ము మీరుద్ధరించుకొన్న ప్రపంచము నుద్ధరించినట్లే. దీపముండునపుడే యిల్లు చక్కబెట్టుకొనవలెను గదా! మీ శరీరము దృఢముగ నున్నపుడే - ప్రాణము లున్నపుడే దివ్యజ్ఞానమును పొందుడు. గొప్ప విషయము లెందున్నను - ఎవరు చెప్పినను గ్రహింపుడు. సమదృష్టి కలిగియుండుడు.

28. ఉత్తమ వేదాంత తత్త్వములను అనుభవమునకు దెచ్చుకొనుడు. గ్రుడ్డివాని చేతిలోని దీపమువలె ననుభవహీనుని వేదాంతము ఆత్మశ్రేయమును గూర్పదు.

29. ఎన్నికష్టము లెదురైనను వెనుకంజవేయక నిరుత్సాహ పడక కర్తవ్యమును నిర్వహింపుడు. శిల్పిదెబ్బల కన్నింటికి నోర్చుకొన్న శిలయే విగ్రహమగును గదా!

30. సమస్త ప్రాణులను - సమస్తమును తన యాత్మగా భావించుకొనువాడే మహాత్ముడు. మనకు వలసినది సదాచార జీవనమే కాదు. సర్వాత్మభావన. సర్వాత్మభావన యను పునాదిపై సదాచారజీవన మను సౌధ మాధారపడియున్నది.

31. మీరు ఆదర్శప్రాయులు గండు. సత్య మెందున్నను ఆదరించుటకు సంకోచపడవలదు. అయోగ్యమగు సిద్ధాంతము తన మతములో నున్నను వదలిపెట్టువాడును, యోగ్యమగు సిద్ధాంతములు పరమతములో నున్నను స్వీకరించువాడును నాదర్శ ప్రాయు డగును.

32. 'ఉత్కృష్టమగు జన్మమునెత్తి పరమార్థమును దెలిసి కొనుటకు ప్రయత్నింపని మానవునకన్న బుద్ధిలేని గాడిదె, బురద లోని కప్ప, పుట్టలోని సర్పముల జన్మములే మేలైనవని లోకము నకు జాటుడు.

33. పశుజన్మమెత్తి తప్పుచేయుచో భగవంతుడు క్షమించును. మనుష్యజన్మమునెత్తి తప్పుచేయుచో పరమాత్మ క్షమింపడు. కన్నులున్నవాడు త్రొక్కిన నెవడైన క్షమించునా? మనుష్యజన్మమునెత్తియు వివేకము లేకపోవుటయే మహాపాపమని బోధింపుడు.

34. మీ జీవితమున కొక నిశ్చితలక్ష్యము కలదు. ఆ లక్ష్య సాధనకొఱకు నిరంతరము ప్రయత్నింపవలెను. మానవజీవితము స్వార్థమునకు గాక పరహితమున కని గుర్తించుకొనుడు. మీ లక్ష్య సాధన సంకుచితముగాక మహోన్నతముగా నుండవలయును.

35. యావజ్జీవము అఖండకృషిసల్పి ఒక్కనిని తరింప జేయగలిగినను మీ కృషి ఫలించినదని విశ్వసింపుడు.

36. మీ జీవితము రాముని వృత్తాంతమువలె సత్యవంతమై యమృతప్రాయము కావలెను. రావణుని జీవితమువలె నసత్య వంతమై మృతప్రాయము కారాదు.

37. సహనము, పరాక్రమము మీకు భూషణములు కావలెను. సత్యాన్వేషికి కష్టము లధికములగుకొలది యతని సత్య ప్రభావము దీప్తమగుచుండును. అందువలన సహనము, ధైర్యము, పరాక్రమము నభివృద్ధియగుచుండును.

38. లోకకల్యాణమును గోరువాడు సింహసదృశపరా క్రమముతో కార్యరంగమున దుమికి మృత్యువుతో యుద్ధ మొనర్చును. అట్టివాడు ద్వంద్వములకు చలింపడు.

39. మీ కర్తవ్యము స్వార్థరాహిత్యముతో గూడినదై యుండవలెను. విశ్వమును విశ్వేశ్వరుడుగ, మానవసేవయే మాధవ సేవగా భావించి యెవడు ఫలాపేక్షలేక కర్మము లాచరించునో యట్టివాడు భగవంతుని పూజించినవాడే యగును. దీనినే పూర్ణ పూజ యందురు.

40. మీ సంకల్పము దృఢముగా నుండవలెను. దృఢ సంకల్పములేనిచో నెంతటివాడైన ఘనకార్యమును సాధింపలేడు. ఎన్నికష్టము లెదుర్కొన్నను జలింపక బ్రహ్మర్షిత్వమును సాధించిన విశ్వామిత్రునిదీక్షయే మీ కాదర్శము.

41. ఈ లోకమున మీ కన్నులకు గానవచ్చు ప్రతిదాని యందును, అణువునందును అద్భుతమైన యాత్మశక్తి నిగూఢమై యున్నది. ఆ శక్తిని బహిర్గతముచేయు సామర్థ్యము మీ యం దుండెనా సమస్త భౌతికశక్తులు మీకు వశము కాగలవు.

42. క్రోధముచేగాని, లోభముచేగాని, హాస్యమునకుగాని యసత్యములు చెప్పకుడు. మాటలాడుటకు పూర్వమే యాలోచన చేసి మాటలాడుడు.

43. కోట్లకొలది మానవులు అజ్ఞానులై యుండ మీరు జ్ఞానులై యుండియు దుఃఖనివృత్తికై ప్రయత్నింపనిచో ప్రయోజనములేదు. మీరు దీనులయెడ దయగలిగియుండుడు. దయగలవాడే సజ్జనుడు. దయలేనివాడే దుర్జనుడు.

44. త్యాగమయులు గండు. ఎంతటివాడైనను త్యాగము లేక ఘనకార్యమేదియు చేయజాలడు.

45. జితేంద్రియులు కండు. జితేంద్రియుడు గావించు వ్రతములు, పూజలు సదుపయోగములు. ఇంద్రియలోలుడు గావించు వ్రతములు, పూజలు నిరుపయోగములు.

46. మాతృహృదయము, స్థితప్రజ్ఞుని గాంభీర్యము, భక్తుని ప్రశాంతము, సర్వసమత్వము కలిగి ప్రబోధము చేయుడు. అపుడు గురువు - శిష్యుడు ధన్యులయ్యెదరు.

47. ఆత్మతత్త్వమును ననుభవమునకు దెచ్చుకొనుడు. మనకు కావలసినది శాస్త్రజ్ఞానముకన్న ననుభవజ్ఞానమే.

48. ఇంద్రియనిగ్రహము, త్రికరణశుద్ధి, భూతదయ, స్వార్థరాహిత్యము గలిగియుండుడు. అట్టివాడే మహాత్ముడగును.

49. తీర్థములు అల్పుల స్పర్శచే మలినమగును. మహాత్ముల స్పర్శచే పవిత్రమగును. అందువలననే మహాత్ములను తీర్థపాదులందురు.

50. విషయసుఖములకు విముఖులుగ నుండుడు. సౌందర్యవంతుడు కుష్ఠరోగినిజూచి యసహ్యపడును. ఆత్మసాక్షాత్కారము గలవాడు విషయసుఖమనిన నేహ్యపడును.

51. సత్కార్మలవలన అంతఃకరణపవిత్రత, ప్రశాంతి, ఆత్మసాక్షాత్కారము క్రమముగ గలుగును.

52. నిరహంకారులై, వినమ్రులై యుండుడు. ఫలముల బరువువలన వృక్షములు వంగియుండునట్లు సంపూర్ణజ్ఞానవంతులు వినయగుణభూషితులై యుందురు.

53. రాగద్వేషములను స్వభావముగ గలవారు రాక్షసులు. విషయసుఖములయం దనురక్తి కలవా రసురులు.

54. ధర్మము మీయందుండెనా ప్రకృతియెల్ల మీకు దోడ్పడును. ధర్మాత్ముడగు శ్రీరామునకు కోతులు, కొండ ముచ్చులు సహాయపడినవి. అధర్మాత్ముడగు రావణునకు కూడ బుట్టిన విభీషణుడే వ్యతిరిక్తుడయ్యెను. ధర్మమును మీరు రక్షించుచో మిమ్ము ధర్మము రక్షింపగలదు.

55 ఓర్పుకలిగియుండుడు. ప్రతివిషయము మీ పురాకృత కర్మము ననుసరించి జరుగును. ఇష్టము జరిగినను, అనిష్టము జరిగినను మహాత్ము డోర్పు కలిగియుండును.

56. ఆహారనియమమును బాటింపుడు. ఆత్మసాక్షాత్కార మున కది యత్యంతావశ్యకము.

57. బ్రహ్మచర్యమున నప్రమత్తులరై యుండుడు. ఆంజనేయుడు కొండ నెత్తగలుగుటకును, సముద్రమును దాటుట కును కారణ మతని బ్రహ్మచర్యప్రభావమే.

58. మానవజీవితమునకు లక్ష్యము ఆత్మజ్ఞానమును సాధించుటయే, జ్ఞానము కలుగనంతవరకు బంధవిముక్తిలేదు.

## త త్త్వ ము

59. చేతనుడు తన స్వరూపవిశిష్టతలను గురుముఖమున దెలిసికొని సంశయవిపర్యయరహితమగు యథార్థజ్ఞానమును బడసి యంతర్ముఖుడై తన్ను తాను గుర్తింపవలెను.

60. ఆత్మజ్ఞానమువలన మిథ్యయగు జగద్భ్రాంతి తొలగి "తాను" స్వయంప్రకాశుడై సచ్చిదానందస్వరూపుడై విలసిల్లును.

61. శ్రుతు లీ యాత్మజ్ఞానము నుపదేశించుచున్నవి. ఋగ్వేదము "ప్రజ్ఞానం బ్రహ్మ" యనియు, యజుర్వేదము "సోఽహం బ్రహ్మాస్మి" యనియు, సామవేదము "తత్త్వమసి" యనియు, నథర్వణవేదము "అయమాత్మా బ్రహ్మ" యనియు బోధించుచున్నవి.

62. అజ్ఞాని మాయావృతుడై క్షేత్రము వేరనియు, క్షేత్రజ్ఞుడు వేరనియు ఇంద్రజాలమువంటి యీ జగత్తును గని భ్రమించి జననమరణము లను బాధలకు జిక్కి తాపము నందు చున్నాడు.

63. వివేకవంతుడు సద్గురూపదేశమువలన యథార్థమును గుర్తించి మిథ్యాకల్పితజగమునందలి భ్రాంతి తొలగి తనస్వరూపమును తెలిసికొని సచ్చిదానందమయు డగును.

64. మాయయందుండు చేతనాభాసమును మాయాధిష్ఠాన చేతనమును నీశ్వరుడగును.

65. బ్రహ్మాండమునకు నంతర్బహిస్థ్సలములందు నిండి యుండు చేతనము బ్రహ్మము.

66. జీవేశ్వరుల చేతనాంశము ఘటాకాశ మహాకాశముల వలె భేదము లేనిది కాన నేను బ్రహ్మము, అని తెలిసికొనవలెను.

67. శుద్ధసత్త్వగుణసహితమైన మాయయు, మాయ యొక్క అధిష్ఠానమైన చేతనము, మాయయొక్క ఆభాసము అను నీ మూడునుగూడి యీశ్వరుడని చెప్పబడును.

68. జగత్తు నాయందు త్రికాలములయందును నుండలేదు, అది మిథ్య. ఏది మిథ్యయో యది యధిష్ఠానమునకు నేవిధమైన హానిని గలిగింపదు. ఎండమావుల జలము భూమిని తడపదు. అటులనే జగత్తు ప్రతీతి యగుచున్నది. అయినను అసత్యమై యున్నది. నాకు హాని కలిగించు సామర్థ్యము దానికి లేదు. నేను సచ్చిదానందస్వరూపుడనై యున్నాను - ఇట్టి నిశ్చయమే జ్ఞానము.

69. మోక్షమునకు దారిచూపునది జ్ఞానము. దానికి సహాయ పడునది సాధనచతుష్టయము. (నిత్యానిత్యవివేకము, ఇహాముత్ర ఫలభోగవిరాగము, శమదమాదులు, ముముక్షుత్వము అనునవి సాధనచతుష్టయము.)

70. చెట్టునుండి పక్వమైనపండు క్రిందపడి పైకి పోవ జాలదు. మట్టితో మిశ్రమమైన బంగారురేణువులు పుటము పెట్ట బడి మేల్మిబంగారమై మరల మట్టితో కలియదు. కొండనుండి దిగువకు ప్రవహించు నెలయేరు ఎగువకు ప్రవహింపలేదు. తఱచి తఱచి మజ్జిగనుండి తీయబడిన వెన్న మరల మజ్జిగలో కలియదు. ఆత్మసాక్షాత్కారముగలవాడు సంసారమందున్నను సంసారమల మంటదు.

71. మహాత్ములు ప్రతిమతమందుగల మంచినే గ్రహించె దరు. వారు మహమ్మదీయుల మసీదులయందు, క్రైస్తవుల చర్చిలయందు, హిందువుల ఆలయములయందు, బౌద్ధుల విహార ములయందు సమదృష్టి గల్గియుందురు. మతములను పుష్పము

లను ఓర్మి యను దారముతో గ్రుచ్చి సర్వమతసమ్మతుడైన పరమేశ్వరుని కంఠమున నా పూలమాల వైచెదరు.

72. లోపల వెలుపల నిత్యశుద్ధమై యొక్కటై సత్-చిత్-ఆనందమయమై స్థూలసూక్ష్మలోకముల దోపజేసి తనలో లయము చేసికొనునది పరబ్రహ్మము.

73. కామ్యకర్మంబులతోగూడిన బుద్ధియందు గలిగెడి చేతనప్రతిబింబమును జీవు డనిరి. కేవల ప్రతిబింబమునుమాత్రము నుపనిషత్తులు జీవుడనలేదు. కూటస్థసహితచిదాభాసుడు జీవుడు. కాన బుద్ధియందుండు చిదాభాసుడును, బుద్ధ్యధిష్ఠానచేతనము నను నీ రెండును జీవుడనబడును.

74. మనసున కలుగు భావములు, చింతలు వీనినెల్ల ప్రకాశపఱచుచు సాక్షిరూపమైయుండున దాత్మ.

75. ఏ వస్తువుయొక్క నీడ చిత్తమునగలిగి లోకవ్యవహారము తోచుచున్నదో అదే - ఆత్మ.

76. దహరాకాశముననుండి అధ్యాత్మిక - అధిభౌతిక - అధిదైవికములను దుఃఖములు లేనిదే ఆత్మ.

77. మనోబుద్ధ్యహంకార చిత్తములను వాని వర్తనలందు బురికొల్పునది - ఆత్మ.

78. చెఱకురస మొక్కటయ్యు బెల్లము, కలకండ, చక్కెర మున్నగు రూపములుగ దోచినట్లు బంగార మొకటయ్యు పలువిధములగు నాభరణములుగ దోచినట్లు వేఱువేఱు స్వభావములతో జీవుడు పలువిధములుగ నున్నట్లు తోపజేయుచు లోననుండి సర్వమును నడపునదే యాత్మ.

79. అనుభవించువాడు సత్వగుణము, అనుభవము రజోగుణము, అనుభవింపబడు వస్తువు తమోగుణము. ఈ మూడింటిని ప్రకాశపఱచువా డాత్మ.

80. పరమాత్మ స్వయంప్రకాశుడని ఋగ్వేదము, సర్వోత్తముడని యజుర్వేదము, సర్వభూతములయందుండి నడపువాడని సామవేదము పేర్కొనుచున్నవి.

81. భగవంతుడు జలములో రసరూపముగ నున్నాడని ద్వైతులందురు. రసము వేఱు, జలము వేఱుగాదని యద్వైతులందురు. భగవంతుడు సూర్యచంద్రులలో ప్రకాశస్వరూపుడై యున్నాడని ద్వైతులందురు. ప్రకాశమువినా సూర్యచంద్రులు లేరని అద్వైతులందురు.

82. భగవంతుడు వేదములయందు ప్రణవరూపముగ నున్నాడని ద్వైతులందురు. ప్రణవమునుండియే వేదములు జన్మించినవని యద్వైతులందురు.

83. పరమాత్మ సచ్చిదానందమయుడు. 'సత్' అనగా ఏకాలమందును దేనిచేతను నాశము పొందక యేకరూపముగా నుండుట. 'చిత్' అనగా వేఱొకదాని నపేక్షింపక తానే ప్రకాశముగ నుండుటతో తనయందు కల్పింపబడిన యితరవస్తువుల ప్రకాశపఱచుట. 'ఆనంద'మన దేనినిమించి యానందము లేదో-ఏది యాత్మయందే జనించునో యదే.

84. సమష్టిస్వరూపుడు ఈశ్వరుడు. వ్యష్టిస్వరూపుడు జీవుడు. స్ఫూర్తి జీవునకు స్వరూపముగా నున్నది. బ్రహ్మమును జ్ఞానమేస్వరూపలక్షణముగలదిగా నున్నది. ఈ జ్ఞానమున భేదమున్నదనుటకు ప్రమాణమేదియు లేదు.

## మా య

85. శుద్ధబ్రహ్మమును ఆశ్రయించుకొనియుండు మాయకు అవిద్యయనియు, అజ్ఞానమనియు పేరు.

86. ఏది చింతించుటకు సాధ్యముకానిదిగను, యుక్తికి లోబడునదిగను నుండునో యదియే మాయ.

87. విద్యవలన నాశమగుటంబట్టి మాయ యగును. చిన్మాత్రమైన పరమాత్మ తన్ను తానుగా జూచెను. అందు 'అహం' అనునదేర్పడెను. ఇదే జీవాత్మ భేదమునకు గారణము. ఈ 'అహం' అనేకములు కావలెనని చూచినది. అందుండి సకలజగత్తులు తోచినవి.

88. పరమాత్మ నిద్రను బోలిన యవస్థలో చాలకాల ముండెను. అందు మాయ తోచినది.

89. త్రిగుణములుకలది మాయ, పరమాత్మ నాశ్రయించి నది. అది అనాది. జ్ఞాని దానిని నాశము చేయుచున్నందున ఉన్న దనుటకు వీలులేదు. మన కన్నులకు అనేకవస్తువులుగ దోచుట వలన లేదనుటకు వీలుగానిది.

90. దారమునకు వస్త్రరూపము లేకున్నను రూపముగల వస్త్రమును దోపజేయునట్లు రూపములేని మాయ రూపముగల వస్తువులను దోపజేయుచున్నది.

91. స్వప్నమున గానవచ్చినవానివలన మన శరీరమున వికారము లేర్పడునట్లు అసత్యమైన జగత్తు సత్యమైనదానివలె తోచుచున్నది.

92. బ్రహ్మను ఆవరించినది మాయ. జీవు నావరించినది యవిద్య. చిత్-అచిత్ రెండింటి కలయిక మనస్సు.

93. స్వప్రకాశమగు సూర్యుని మేఘము మఱుగుపఱచి నట్లు శుద్ధబ్రహ్మమును మాయ మఱుగుపఱచును.

94. సూర్యకిరణములవలన దోచు మేఘము సూర్యునే మఱుగు పఱచుచున్నది. అట్లే శుద్ధుడైయుండియు ఆత్మ అజ్ఞానముచేత గ్రమ్ముకొనబడుచున్నాడు.

## ముముక్షుత్వము

95. వివేకవంతుడు నశ్వరములగు ప్రకృతివిషయముల నుండి మనస్సు మరలించుకొని యాత్మజ్ఞాననిరతుడు కావలెను.

96. అజ్ఞాని యనిత్యమై, యశుచియై, దుఃఖకరమైన సంసారమును మాయామహిమచే నిత్యమనియు, సుఖకరమనియు, తలపోయును.

97. సౌందర్యము చర్మగతము. అది అశాశ్వతముగాన తృణప్రాయమని తెలియుము.

98. జిహ్వేంద్రియమును జయించినచో సమస్తేంద్రియములను జయించినట్లే. ఇంద్రియనిగ్రహమను పునాదిమీద మోక్షసౌధమాధారపడియున్నది. పరమార్థదృష్టిలో మూడులోకముల జయించినను గొప్పగాదు. తన యింద్రియములను జయించుటయే గొప్ప.

99. దుఃఖనివృత్తి పరమానందప్రాప్తియే మోక్షము. ఎవరు అవ్యాకృతమగు ప్రకృతి నుపాసించుచున్నారో వారు అంధమయిన తమస్సును బొందుచున్నారు. ఎవ్వరు కార్యబ్రహ్మమగు హిరణ్యగర్భునిమాత్రమే యుపాసించుచున్నారో వారు వెనుకటిదానికన్న మిన్నయగు నంధతమస్సున మునుగుచున్నారు.

100. జీవుని బ్రహ్మముగాను, పరుని జీవునిగాను తెలిసి కొనవలెను. వీరు ఏకముగానే యుండునట్టిస్థితిని అనుభవమునకు గొనివచ్చుటయే ముక్తి.

101. తత్త్వము నెఱుంగుట సులభము. ప్రతిబంధక విషయములను విషయవాంఛలను వదలిపెట్టుట మిక్కిలి కష్టము. మనస్సు-బుద్ధి వీనిని సంస్కరించుకొని యింద్రియములను నిగ్రహించుటయే మిక్కిలి కష్టము.

102. హృదయములు పవిత్రములై యుండినచో స్వచ్ఛమైన యద్దమున ముఖము కానవచ్చినట్లు తత్త్వవిదుని యనుగ్రహముచేత నొక్కక్షణములోనే ఆత్మదర్శనము కాగలదు.

103. సూర్యుడు ప్రకాశించుచుండ వేఱుదీపము లక్కఱ లేదు. ఆత్మజ్ఞానము కలిగినవానికి తక్కినదెల్ల స్వల్పములు,

104. చిత్తశుద్ధికి సత్కర్మలు, మనస్సుయొక్క ఏకాగ్రతకు ఉపాసనలు ఆవశ్యకములు.

105. "నేను దేహమునుగాను, దేహసాక్షినగు దేహినే నేను" అనెడి ఇట్టి నిశ్చయమువలన జీవుడు జననమరణములు లేనివాడగుచున్నాడు.

"ప్రాణమును నేనుగాను. ప్రాణమునకు సాక్షినగు దేవుడను నేను"-అను నిశ్చయ జ్ఞానమువలన ఆకలిదప్పులు ఉపశమించును.

"మనస్సును నేనుగాను. మనస్సునకు సాక్షియగు దేవుడను" అనెడు నిశ్చయమువలన శోకమోహములు ఉపశమించును.

"బుద్ధి నేనుగాను. నేను బుద్ధికి సాక్షిగానుండు ఆత్మను"-అనెడు నిశ్చయమువలన కర్తృత్వము తొలగును.

"అజ్ఞానము నేనుగాను. నేను అజ్ఞానమునకు సాక్షిగానుండు ఈశ్వరుడను" అను నిశ్చయజ్ఞానమువలన సర్వానర్థములు తొలగి పోవును.

106. అభేదదృష్టియే మోక్షము. భేదదృష్టియే సంసారము. తాపత్రయాది దుఃఖములనుజూచి వానినుండి విడువడుటకు గురుని వెదకుట తీవ్రమైన ముముక్షుత్వము. తాపత్రయముల దలచి భార్యాపుత్త్రాదుల విడువలేక బాధపడుట మధ్యమ ముముక్షుత్వము. సకలసుఖములననుభవించి కడపట మోక్షమునకు యత్నింతుననుట మందముముక్షుత్వము.

107. సంసారమును జయింప ప్రత్యేకశరీరము కావలెను. దానికి వివేకము తల, వైరాగ్యము శరీరము, శమదమాదులంగములు, మోక్షేచ్ఛ ప్రాణము. వీనితో గూడినవానికి జ్ఞానమాయుధము.

108. చిత్తమందలి వాసనలను దొలగించుకొనుట శమము. మనస్సును వెలుపల సంచరింపనీయక యడ్డగించుట దమము. విషయములనుండి మరలుట యుపరతి. దుఃఖము నోర్చుకొనుట తితిక్ష. వేదవచనములందు, గురూపదేశములందు భక్తినుంచుట శ్రద్ధ. పరమాత్మయందే ఏకాగ్రతతో మనస్సునుంచుట సమాధానము.

109. సంసారబంధమునుండి విడువడుటకై పడు త్వర ముముక్షుత్వము.

110. పట్టుకారు వస్తువులను పట్టుకొనును. తన్ను పట్టుకొనియున్న వ్రేళ్ళను పట్టుకొనలేదు. అటులనే పాంచభౌతికమైన మనస్సు మేధస్సు తమకు కారణమైన పరమాత్మను గ్రహింపజాలవు.

111. మనస్సు నాశము పొందినగాని ముక్తిలేదు. మన స్సను వృక్షమునకు అహంకారమే బీజము. అహంకారమును గాల్చివేసిన మనస్సు నశించును.

112. విషయాసక్తి యున్నంతవఱకు తదనుభవసాధనమగు దేహమందు అహంకారమును, సుఖపరికరములందు మమకారమును దప్పవు.

113. 'తాను' అనుదానిని మఱచి కేవల బ్రహ్మాకారముగ నుండుట యుత్తమశాంతి. శుద్ధసత్వముతో "నేను ప్రత్యగాత్మను" అని తలంచుట మధ్యమము. సత్వమిశ్రముగ విషయవాసనల వదలి శ్రవణమున నేకాగ్రతకలిగియుండుట మందశాంతి.

114. ఆత్మనుగుఱించియే నిధిధ్యాస చేయవలెను. ఆత్మను ధ్యానించుట యనగా మనస్సును దృశ్యవిషయములనుండి మరలించి యాత్మాభిముఖము చేయుట.

115. ముముక్షువగువాడు మొదట నహంకారమును జయింపవలెను. మన స్సను యాకాశమును అహంకార మను మేఘ మావరించి జ్ఞానమను సూర్యుని మరుగుపఱచుచున్నది.

116. ఆగ్రహమును ఓర్పువలన, నహంకారమును వినయమువలన, దుర్మార్గమును సన్మార్గమువలన జయింపవచ్చును.

117. ఆగ్రహము గలవారి యనుష్ఠానము లెటువంటివైనను కళాయిలేని రాగిపాత్రలో వండిన పులుసువలె నిష్ప్రయోజనము. పల్లపునేలను నీరుచేరునట్లు శాంతముగలవారినే యిహమందు లక్ష్మియు, పరమందు మోక్షలక్ష్మియు వరించును.

118. జడమందుచేతనమును,నశ్వరమందు శాశ్వతత్వమును వికారమందు నిర్వికారమును జూడగల్గునదే జ్ఞాననేత్రము.

119. సంసారసముద్రమును దాటుటకు ఈ శరీరమే నావ. సద్గురువే నావికుడు. మనస్సే తెఱచాప. భగవద్భక్తియే అనుకూలమైన వాయువై నిన్నొడ్డునకు జేర్చును.

120. నాతిగర్భములోని శిశువును, రాతిగర్భములోని కప్పను రక్షించువాడే యందఱిని రక్షించును. ఇది నా సామర్థ్యము అను నహంకారమును విడువుము.

121. ప్రపంచవిషయములయందు ఆశ లున్నంతవఱకు బంధములుండును. ఆశ తొలగి నపుడే బంధవిముక్తి.

122. క్షణము కోపమును స్వాధీనము చేసికొన గల్గుచో జీవితమంతయు నానందమయ మగును.

123. ఆచరణము లేని వాచావేదాంతము చవిటినేలను నాటిన విత్తనమువలె నిష్ప్రయోజనము.

124. సాధకుడు ఇంద్రియార్థజీవి కాకుండ పరమార్థజీవి కావలెను. విషయసుఖపరిత్యాగము చేయుచో శాశ్వతానందమైన నిత్యసుఖము లభించును. ప్రతిబింబసుఖమునుండి మనస్సు మారుచో బింబసుఖము లభించును.

125. వస్తువులను కోరువాడు జీవుడు. భావమును గోరువాడు ఈశ్వరుడు. తన్ను తాను తెలిసికొనిన తగవు లుండవు. తన్ను తాను తెలియక ఎన్ని తెలిసికొన్నను తగవు లుండును. తన్ను తాను తెలిసికొనువాడే మహాత్ముడు.

126. భూతదయకలవారు అపారజ్ఞానము, అచంచలభక్తి, గాఢవిరక్తి, పరమప్రశాంతి గలిగి యాత్మబలసమన్వితులై యుందురు.

127. గింజయున్నచో పత్తి, లేనిచో దూది. అహంకారమున్నచో జీవుడు, లేనిచో పరమేశ్వరుడు.

128. దారము పువ్వులతో స్నేహముచేయుచో శిరముపై నుండును. పొరక (చీపురు) తో సహవాసముచేయుచో పాదములకడ నుండును.

129. కడుపునకు అన్నము, కాయమునకు వస్త్రము - అంతకుమించి సంగ్రహబుద్ధి యెవనికి లేదో వాడే జీవన్ముక్తుడు.

130. అజ్ఞానిముఖము గ్రీష్మఋతువునందు అరణ్యమువలె మలమలలాడుచుండును. జ్ఞానిముఖము వసంతఋతువువలె కళ కళ లాడుచుండును.

131. మట్టిచే కప్పబడిన వజ్రపుకాంతి మరుగు పడును. మాయచే ఆవరింపబడు బుద్ధి పరమాత్మను మరుగుపఱచును.

132. త్రుప్పుపట్టిన యినుము సూదంటురాయి సమీపమున నెంతకాలమున్నను ఆకర్షింపబడదు. మలినవాసనలు గలవారు పరమేశ్వరునిచే నాదరింపబడరు.

133. గనిని త్రవ్వుచో రత్నములు లభించునట్లు తత్త్వ చింత చేయుచో ముక్తి లభించును.

134. పీచుగల కొబ్బరికాయ నెన్నిపర్యాయములు పగుల గొట్టినను పగులదు. మలినవాసనలు గలవారు ఎన్నిపర్యాయములు ధ్యానము చేసినను ఏకాగ్రత కలుగదు.

135. రసన పవిత్రముగావలెనన్న రసస్వరూపమగు ప్రణవము నుచ్చరింపుము.

136. ప్రపంచజిజ్ఞాస బుద్ధిని ముకుళింప జేయును. బ్రహ్మ జిజ్ఞాస చిత్తమును వికసింప జేయును.

137. మనము ఆర్జించు ధనము వెంటరాదు. వెంట వచ్చునవి పుణ్యపాపములే.

138. నీవు దారమువలె నుండుము. సూదివలె నుండవలదు. సూది రంధ్రములను జేయుచుపోవును. దారము నింపుచు పోవును

139. అవివేకి మనస్సే భూతము. వివేకి మనస్సే దైవము

140. పిందె చెట్టును కలిసికొని యున్న పం డగును. సద్గురువును విడువనివాడే ముక్తు డగును.

141. నడచి నడచి సముద్రము చేరిన వానికి నడక యాగి పోవును. అనుభవము కల్గినవానికి సంసారచక్రము ఆగిపోవును.

142. సామాన్యపు గాలి ఆకులను కదుపును. సుడిగాలి పైకి లేపును. ప్రచండవాయువు వృక్షములను పెకలించును. పర్వతమును కదపజాలదు. అటులనే మహాత్ము లెట్టి స్థితియందును స్థిరులై యుందురు.

143. శ్రద్ధ యెంత యధికమైన సిద్ధి యంత దగ్గఱగును. శరీరబలము కలవాడు తన కుటుంబము నుద్ధరించును, బుద్ధి బలము గలవాడు తన సంఘము నుద్ధరించును. బ్రహ్మచర్యము గలవాడు దేశము నుద్ధరించును. ఆత్మబల సమన్వితుడు విశ్వము నుద్ధరించును.

144. నిర్మలజలమందు చంద్రబింబము ప్రకాశించునటుల మురికినీటియందు భాసింపదు. పవిత్రహృదయములయందు బ్రహ్మ విద్య భాసించునటుల మలినహృదయములయందు ప్రకాశింపదు.

145. సర్పము అంధకారమైన పుట్టలో, కీటకములు మల ములో, పురుగులు నాభిలో, కప్పలు బురదలో, కాకి ఎంగిలిమెతుకు లతో హాయిగా జీవించును. కాని మనుష్యుడు జన్మమెత్తి యజ్ఞానముతో జీవించుట దుఃఖకరమే యగుచున్నది.

146. వర్షకాలమున ఈతచెట్టునుండి గుత్తులు గుత్తులుగ ఫలములు ఎట్లు పుట్టుచుండునో హృదయమున అహంకార మావరిం చుచో పాపములు గుంపులు గుంపులుగ బయల్వెడలుచుండును.

147. అజ్ఞాని గానుగనుండి నూనె వచ్చు ననును. జ్ఞాని నువ్వులనుండి నూనె వచ్చుచున్న దనును. జ్ఞానిది సమదృష్టి. అజ్ఞానిది విషమదృష్టి.

148. గంగ పాపమును, చంద్రుడు తాపమును, కల్ప వృక్షము దారిద్ర్యమును పోగొట్టును. మహాత్ముల సాన్నిధ్యము పాపమును, తాపమును, దైన్యమును పోగొట్టి ప్రశాంతి నిచ్చును.

149. అన్ని భూతములయందు సమదృష్టిగల్గి సేవ చేయు టయే కర్మలక్ష్యము. అన్ని భూతములయందు ప్రేమగలిగి యుండుటయే భక్తి లక్ష్యము. అన్ని భూతములయందు ఆత్మను దర్శించుటే జ్ఞానలక్ష్యము.

150. లేతమొక్కను సులభముగా పెకలింప వచ్చును. వృక్షమును పెకలించుట సాధ్యము కాదు. సాధనస్థితిలో మనస్సు చలించినను సిద్ధస్థితిలో నిశ్చలమై యుండును.

151. మాధుర్యము ఆకులనుండియు, బెరడునుండియు రాదు. ఫలమునుండియే కలుగును. ఇతర విద్య లెన్ని నేర్చినను పరమానందము బ్రహ్మవిద్య వలననే గలుగును.

152. ఇంటిలోని వస్తువులు ఎంతతగ్గిన అంత భారము తగ్గును. మనస్సునందు కోరికలు ఎంత తగ్గిన నంత సుఖము కల్గును.

153. దూడ పెరుగుచున్న కొలది కొమ్ములు పెరుగును. భోగము లనుభవించు కొలది భోగాశ పెరుగును.

154 తరంగములు భిన్నములై తోచినను నీటికి భిన్నత్వ మును గల్పింప లేవు. ద్వైత ప్రపంచభేదము అద్వైత బ్రహ్మ మును వేఱు చేయలేదు.

155. మనస్సులేని గాఢనిద్రలో ఏ దుఃఖమును లేదు. మనస్సుగల జాగ్రత్తలో నన్నియు దుఃఖములే. అమనస్క స్థితిలోనే శాశ్వతానందము.

156. అనిత్య వస్తువులం దుపేక్ష, నిత్య వస్తువునం దపేక్ష కలిగియుండుము. సూర్యున కభిముఖముగా పోయిన నీడ వెనుకకు పోవును. ఆత్మను గుర్తించిన మాయ తొలగి పోవును.

157. పర్వతశిఖరమున నున్నవానికి క్రింద హెచ్చుతగ్గులు కన్పింపవు. బ్రహ్మదృష్టి గలవానికి రూపనామములు గోచరింపవు.

158. నిర్మలోదకమున నడుగుభాగము కన్పించును. ప్రశాంతచిత్తమున పరమాత్మ భాసించును.

159. దీపముపై నిల్పిన పసివానిదృష్టి కదలదు. పరమాత్మపై నిల్పిన జ్ఞానిదృష్టి మరలదు.

160. పరిపూర్ణానుభవము గలుగువఱకు హేతువాదము లంతరింపవు. జ్ఞానిని పరీక్షించుట కిది యొరపిడి రాయి వంటిది.

161. అజ్ఞానికి హృదయదౌర్బల్యము జ్ఞానికి హృదయ నైర్మల్యము సహజము.

162. మూకుడు, ముంత, కుండ యని వేర్వేఱుగ పిలిచినను నవి యన్నియు మృణ్మయమే. రామయ్య, వెంకయ్య యని పిలిచినను ఆ శరీరములయందుగల యాత్మ చిన్మయమే.

163. కష్టములను సహించుటయే తపస్సు, మనస్సు యొక్క ఏకాగ్రత అంతరంగికతపస్సు. ఇంద్రియ నిగ్రహము బహిరంగతపస్సు.

164. రూపనామములతో చూచినపు డన్నియు భేదములే. ఆత్మదృష్టితో జూచినపు డే భేదములు నుండవు.

165. సూర్యు డుదయించువఱకే చుక్కల ప్రతాపము. జ్ఞానము కలుగునంతవఱకే అహంకారప్రభావము.

166. వస్త్రములకు మురికి తొలగిననే రంగుపట్టును. మానవులకు వాసనలు తొలగిననే పరమార్థము లభించును. బాహ్యమునకు చక్రవర్తివలె నంతఃకరణమున సన్న్యాసివలె నుండుము.

167. వస్త్రములకు మల్లెపువ్వులు గట్టిన సుగంధము, మలిన పదార్థములను గట్టిన దుర్గంధము పుట్టును. అటులనే జడపదార్థచింతన దుఃఖమును, ఆత్మచింతన సుఖమును గలిగించును.

168. బాల్య యౌవనములందు ఆర్జించినధనము వార్ధక్యమందనుభవించు నటుల బాల్య యౌవనములయందు ఆర్జించిన బ్రహ్మవిద్య వార్ధక్యమున పరిపక్వమై ప్రశాంతిని కలిగించును.

169. ప్రవాహవేగమున కొట్టుకొని పోవువాడు దారాపుత్త్రులు జ్ఞప్తికిరాక ఎవడు నన్ను రక్షించునాయని చూచుపగిది సంసార ప్రవాహమున కొట్టుకొని పోవువాడు త న్నుద్ధరించుటకు భగవంతు డెపుడు వచ్చునా యని తహతహ పడును.

170. ధనవంతుడై యుండి దాతృత్వము లేకపోయినను, దరిద్రుడై యుండి పరమార్థచింతన లేకపోయినను వారిజన్మలు నిరర్థకములు.

171. సామాన్యులు సంపదలు హెచ్చుకొలది ఆనందించెదరు. మహాత్ములు తగ్గుకొలది సంతోషించెదరు.

172. తత్త్వచింతన చేయకుండుటయే సోమరితనము. లతకు ఆధార మున్నపుడే శోభ. చిత్రమునకు ఆధార మున్నపుడే రాణించును. పూలమాలకు ఆధారమున్నపుడే అందము కన్పించును. సున్నలకు అంకెయున్ననే విలువ కలుగును. అన్నింటికి నాధారమైన పరమాత్మను దెలియువాడే ప్రకాశించును.

173. నీమనస్సు జింకవంటిది. నిత్యసుఖమునకు చను దెంచుచున్న ఆ జింకను కోరిక లను వేటకుక్కలు తరుము చున్నవి. గమ్యము చేరకమునుపే వేటకుక్కలకు పట్టువడుచో దుఃఖపడుదువు. నీశరీరమున ప్రాణముండగనే నీ మనస్సును నశ్వర విషయములనుండి శాశ్వతమునకు మరల్చుము. అప్పుడే ప్రశాంతి.

174. మేము పాపాత్ముల మని పలుకుటయే మహా పాపము. మీరు పాపాత్ములుగారు, పుణ్యాత్ములు. మీరు సింహ ములే గాని గొఱ్ఱెలు కారు. మీరు నారాయణస్వరూపులే గాని నరులు గారు. ప్రకృతియే మీకు దాసి.

175. సముద్రమును దాటుటకు పడవ ఎటువంటిదో సంసార సముద్రమును దాటుటకు ప్రణవనౌక యటువంటిది. తుపాను గాలికి పడవ తలక్రిందులగును. ప్రణవనౌకకు ఆ భయము లేదు.

176. అవ్యక్తమైన యాత్మ నెఱుగువాడే వ్యక్తి. అజ్ఞా నుల మధ్య నిర్భయుడవై యురికి వారి యజ్ఞానమును బటా పంచలు గావింపుము.

177. బీజములను బట్టియే ఫలము గలుగును. కుంకుడు విత్తు నాటిన చేదు ఫలము, మామిడివిత్తు నాటిన మధుర ఫలము కల్గుచుండును, పాపము చేయువారు దుఃఖమును, పుణ్యము చేయు వారు సుఖమును అనుభవించుచుందురు.

178. ప్రపంచము సంశయము. బ్రహ్మము నిశ్చయము. సూర్యుని ప్రకాశముతో అద్దము ప్రతిఫలించును. పరమాత్ముని ప్రకాశముతో బుద్ధి వికసించును.

179. కర్తవ్యపాలన చేయుచో కోరకయే ఫలము లభించును. ఆత్మ ప్రధానము శరీర మప్రధానము. శరీరమున చైతన్యమున్నచో శివమందురు. లేనిచో శవ మందురు.

180. పేడపురుగు పేడలో పుట్టును. పేడలో పెరుగును. పేడలో హాయిగా జీవించును. దానిని మలమునుండి తొలగించి నిర్మలమగు పద్మమం దుంచినచో ఆ సుగంధమును భరింపలేక తన్నుకొనుచుండును. అటులనే విషయాసక్తుడు నిర్విషయ మగు. పరమార్థమును శ్రవణము చేయుచున్నంతవఱకు విలవిల తన్నుకొనుచుండును.

181. సూదిబెజ్జమంత రంధ్రమున్నచో బిందెలోని జలము క్రమముగా కారిపోవును. పదిరంధ్రములుగల బిందెలో జలము నిలువదు. ఒక్క యింద్రియము స్వాధీనము కానిచో శాంతి యుండదు. దశేంద్రియములు స్వాధీనముగానిచో ప్రశాంతి యెక్కడిది?

182. ప్రపంచములో స్వార్థరహితుడే గొప్పవాడు. అతని ప్రతివాక్యము వజ్రాయుధము వంటిది.

183. కొలిమియందున్న యినుము వేడి చల్లారకమును పే వంచుటకు సాధ్యము; పరమార్థసాధన బాల్య యౌవనములందే సాధ్యము. వార్ధక్యమున కష్టసాధ్యము.

184. ప్రణయమును ప్రణవముగా మార్చుము, లేనిచో ప్రళయము తప్పదు. భగవంతుడు ప్రేమమూర్తి. నిన్ను ద్వేషించినవారిని భూషింపుము. తిట్టినవారిని దీవించుము. అందువలన నీపై శత్రుభావము కలవారు మిత్రులై నీయాజ్ఞలను శిరసావహించెదరు.

185. కాలప్రభావ మత్యద్భుతము. భోగములు, భాగ్యములు కాలగర్భమున కలిసి పోవలసినవే. కాలము మృత్యువును గూడ మ్రింగును. అట్టికాలమును మ్రింగువా డొకడు కలడు. అతడే కాలాంతకుడు (పరమాత్మ)

186. సూర్యునిముందు దీప మెంతస్వల్పమో భగవంతుని ముందు సూర్యు డంతస్వల్పము, సముద్రము ముందు తటాక మెంత స్వల్పమో భగవంతునిముందు సముద్ర మంత స్వల్పము. అటులనే బ్రహ్మానందము ముందర విషయానందము బహు స్వల్పము.

187. గానుగఎద్దు నువ్వులనుండి నూనె వచ్చునంతవఱకు తిరుగవలసినదే. వచ్చిన తర్వాతనే దానికి విశ్రాంతి. మానవుని మనస్సునకు రాత్రింబవలు విశ్రాంతియే లేదు. స్వప్నములో కలలు, మెలకువలో సంకల్ప వికల్పములు కలుగుచునే యుండును.

188. రాబందులు చాల ఎత్తున విహరించుచుండును. వాని ప్రయత్నము శవములను భక్షించుటకే. కొంద ఱెన్ని శాస్త్రములను చదివియున్నను వారి ప్రయత్నములు విషయముల కొఱకే.

189. ముంటిని ముల్లుచేత తొలగించి రెండింటిని పారవైవుము. పాపమును పుణ్యముచేత తొలగించి కడపట పాపపుణ్యములనుండి విడువడి గమ్యము చేరుము.

190. ఉన్నదానితో తృప్తినొందక లేనిదానికి పరుగులెత్తుచో వలక్రిందనుండు ఆహారమును జూచి వలలో దగులుకొను పక్షివలె నయ్యెదవు.

191. పటిక, సైంధవలవణము, కలకండ ఈ మూడింటికి రంగు తెలుపే. రుచి భేదములు కలిగియుండును. వానివాని వాక్కును బట్టి యల్పుడైనది యధికుడైనది తెలియ నగును.

192. శ్రుతులనుండి స్మృతులనుండి పురాణములనుండి చరిత్రములనుండి సారమును గ్రహించి యాసేతుహిమాచలము పరివ్యాప్తము చేయుడు. క్రమక్రమముగా ఆర్షసంస్కృతి విశ్వపరివ్యాప్తమై ప్రశాంతి కలిగించును.

193. మనుష్యజన్మము దుర్లభము. నీ బొందిలో ప్రాణ ముండగనే ఒక ఘనకార్యమును సాధింపుము. లేనిచో పశువునకు నీకు భేదము లేదు. అదియు నీవలె పుట్టుచు పెరుగుచు గిట్టు చున్నది. పరోపకారము కొఱకు నిరంతరము శ్రమించుచో నీజన్మ సార్థకము; లేనిచో నిరర్థకము.

194. పొట్టు బీజముకంటె వేఱుకాదు. రెంటికి అవినా భావసంబంధము. అటులనే మాయ ఆత్మ కన్యముగాదు.

195. సాధనస్థితిలో జీవుడు పరమేశ్వరుడు వేర్వేఱుగా కన్పించినను సిద్ధస్థితిలో నొక్కటే.

196. ఎట్టి బలవంతుడైనను, మేధావంతుడైనను ఆత్మాను భూతి లేనిచో నిష్ప్రయోజనము.

197. ఈశ్వర ప్రణిధానమన తన సర్వస్వము భగవదర్ప ణము చేయుట.

198. జ్ఞానులకు భూమియే మంచము. పచ్చికబయలే పరుపు. ఆకాశమే సౌధము. ప్రపంచమే కుటుంబము.

199. ప్రపంచ విషయములయందు ఆసక్తి యున్నంత వఱకు అనురక్తి, లేనిచో విరక్తి కలుగుచుండును.

200. భగవంతు డొక్కడే యాశ్రయస్థానము. అట్టి భగ వంతుని విస్మరించి సామాన్యుల నాశ్రయించుట యవివేకము.

201. భగవంతునియం దెట్టి భావము కలిగియుందువో గురువునం దట్టిభావము కలిగియుండుము. సద్గురువువలన తత్త్వమును దెలిసికొంటినని కృతజ్ఞతకల్గి యుండుము.

202. భగవంతుని వైపు నీవొక్కయడుగు వేయుచో అతడు నీవైపునకు పదియడుగులు వేయును. నీవు చేయవలసినది ప్రయత్నము.

203. ధనము వృద్ధియగుకొలది జ్ఞానికి **వినయము**, అజ్ఞానికి నహంకారము వృద్ధి యగుచుండును.

204. ఒకడు ప్రయాణమై పోవుచుండ వెండి కనబడినది. దానిని తీసికొని పోవుచుండ మేల్మి బంగారము కన్పించినది. వెండి పారవైచి మోయునంత బంగారు తీసికొని పోవుచుండ చింతామణి కన్పింప బంగారు పారవైచి ఒక చింతామణితోనే తృప్తిపొందెను. మహాత్ముడు ఆత్మ సాక్షాత్కారమైనంతనే నశ్వర పదార్థములను వదలి శాశ్వతమైనదానితోనే సంతృప్తి నొందును.

205. గాలిపట మెంతదూరమం దున్నను దానికి ఆధార మగు దారము మనచేతిలో నున్నంతవఱకు భయము లేదు. ఆధార మగు భగవంతునియందు మనస్సున్నచో శ్రమలేదు.

206. ప్రపంచము మనకు గుణపాఠము నేర్పు సద్గురువు; కష్టములు భగవంతుని చూపించు జ్ఞానదీపములు; కష్టములు కలుగుచో దుఃఖనివృత్తికి సుఖప్రాప్తికి ప్రయత్నించెదము; లేనిచో పరమార్థమునకు ప్రయత్నము చేయము.

207. విషముకంటె విషయాభిలాషయే ప్రమాదము. విషము కొన్ని వ్యాధులను పోగొట్టును. విషయాభిలాష జీవితమును ధ్వంసము చేయును.

208. నిర్వికల్ప సమాధిస్థితిలో స్వయంప్రకాశమే కలదు. అచట ద్వితీయముండదు.

209. దైవానుగ్రహము గలవారికి సంకల్పమాత్రముచేత సమస్తము సిద్ధించును. అజ్ఞానిని తేళ్ళు కుట్టునట్లు కోర్కెలు కలిగించును, జ్ఞానిని గాంచినచో పర్వెత్తుచుండును.

210. సూర్యుడు వెలుపల చీకటిని మాత్రమే పోగొట్టును, సద్గురువు లోపల వెలుపల గల యంధకారమును బోగొట్టును.

211. వేశ్యకు ఇహమున సుఖము; పరమున దుఃఖము. కర్మయోగికి ఇహమున కష్టము; పరమున సుఖము. అజ్ఞానికి ఇహమున పరమునగూడ దుఃఖము. జ్ఞానికి ఇహమున బరమున గూడ సుఖము.

212. సింహగర్జనకు క్షుద్రమృగములు పర్విడును. (ఓం) ప్రణవోచ్చారణకు పాపములు పర్వెత్తును.

213. గురువు, గోవిందుడు ఇరువురు సాక్షాత్కరింప శిష్యుడు ఆలోచించి భగవత్సాక్షాత్కారమునకు మార్గదర్శివి నీవని ముందు గురువునకు తదుపరి గోవిందునకు నమస్కరించెను.

214. నీవు జ్ఞాన మను బీజమును నాటి దృఢసంకల్ప మను నీరు పోయుచో మొక్క మొలచును. ఆమొక్కను పశువులు మేయకుండ వైరాగ్య మను కంచెను చుట్టు వేయుచో వృక్షమై ఆత్మ సాక్షాత్కార మను అమృతఫలమును ప్రసాదించును.

215. ప్రవాహమున గొట్టుకొని పోవువాడు గడ్డిపరకను ఆశ్రయించుచో అధోగతి. అందుగల ప్రమాకు నాశ్రయించుచో ఊర్ధ్వగతి. అటులనే అజ్ఞాని నాశ్రయించుచో బంధము, జ్ఞాని నాశ్రయించుచో మోక్షము కల్గును.

216. ఈశరీరమే రథము. ఇంద్రియములే గుఱ్ఱములు. మనస్సే కళ్ళెము. బుద్ధియే రథసారథి. ఆత్మయే రథికుడు. ఈ రథమును శ్రేయోమార్గమున నడపవలెను. ప్రేయోమార్గమున నడపరాదు. శ్రేయము - నిత్యసుఖము, ప్రేయము - అనిత్య సుఖము.

217. రాళ్ళు, రత్నములు ఒక్క గనినుండియే పుట్టినవి. రత్నములలో ప్రతిబింబము కన్పించును. రాళ్ళలో కన్పించదు. కొంతమంది శ్రవణము చేయగానే గ్రహించెదరు. కొంద ఱెన్ని పర్యాయములు విన్నను గ్రహింపలేరు.

218. బీజములలో రంగులు కన్పింపవు. వృక్షములలోనే కన్పించును. అట్లే మానవుల శరీరములలో మార్పులు లేవు. మన స్సులలోనే యగపడును.

219. కర్మఠులు యజ్ఞములయందు సోమవల్లి రసమును పానముజేసి సోమరస మనియెదరు. యోగులు కొండనాలుక ద్వారా లభించు నమృతరసమును సోమరస మనియెదరు. జ్ఞానులు అంతర్ముఖబుద్ధికి లభించు ఆత్మరసమే సోమరస మనియెదరు.

220. సామాన్యులు విగ్రహమునందు, యజ్ఞములుచేయు వారు అగ్నిహోత్రునందు, యోగులు హృదయమందు, సమదృష్టి గలవా రన్నిటియందును భగవంతుని జూచెదరు.

221. సైన్యబలము, ధనబలము, బుద్ధిబలముకన్న ధర్మ బలమే మనుష్యుని రక్షించును.

222. తమోగుణము మూఢావస్థ, రజోగుణము ఘోరావస్థ, సత్త్వగుణము శాంతావస్థ, తమస్సు జీవితమును నిరుపయోగము చేయును. రజస్సు దురుపయోగముచేయును, సత్త్వగుణము

సదుపయోగము చేయును. తామసుడు నరసూకరము. రాజసుడు నరవానరుడు. సాత్త్వికుడు నరదైవము.

223. ఇంద్రియములలో నే యవయవము లోపించినను సర్దుకొనవచ్చును. బుద్ధిచెడిన సర్దుకొనజాలవు. దానముచేయ వీలు గానిచో ధ్యానము చేయుము.

224. తెల్లగుడ్డు అండముగాను, కనుపాప పిండముగాను, అం దుండు కళ బ్రహ్మాండముగాను తెలియుటే రాజయోగము.

225. బంగారము, ఇనుము భూమియందు పుట్టినవే. బంగారము ఎన్నియుగములు భూమి యందున్నను మార్పు చెందదు. ఇనుము భూమియందున్నచో త్రుప్పు పట్టి మన్నుగా మారును, మార్పులేనివాడు పరమాత్మ. మార్పుగలది ప్రపంచము. ప్రపంచ పదార్థముల నాశ్రయించిన దుఃఖము కలుగుచుండును. బ్రహ్మము నాశ్రయించిన సుఖము కల్గుచుండును.

226. పెద్దఏనుగు చిన్న అంకుశమునకు స్వాధీనమగునటుల ప్రబలమైన మనస్సు జ్ఞాన మను అంకుశమునకు స్వాధీనమగును.

227. కుక్కకు రెండు గతులు తెలియును. దొంగతిండి, ఎంగిలాకులు - సోమరిపోతుగతికూడ నింతే.

228. మన స్సను వేటకుక్క కోర్కెలను కుందేటిని తినుట కుద్యమింప మృత్యువను వేటగా డడ్డు పడుచుండును.

229. శృంగిశాపము పరీక్షిత్తునకు మోక్షకారణమైనది. మహాత్ముల తిట్టుకూడ దీవనగా పరిణమించును.

230. మఱ్ఱివిత్తనము సూక్ష్మమైనను అందుండి పెద్ద వృక్షము బయల్వెడలును. చిన్నవిషయము చేతను పెద్ద పరిణామము గలుగుచుండును.

231. దాసానిపువ్వుదగ్గఱ స్ఫటికము మంచిన ఎఱ్ఱగా నుండును. లేనిచో తెల్లగా నుండును. దుఃఖము మనోధర్మమేకాని ఆత్మధర్మముకాదు.

232. ఒక్క నూలిపోగును పసిపిల్లవాడు త్రెంపగలడు. నూరుపోగులను పెనవేసిన త్రెంపజాలడు. వేయిపోగులు పెనవేసిన దానితో నేనుగునైనను బంధింపవచ్చును. ఐకమత్యముతో గొప్ప కార్యములను సాధింపవచ్చును.

233. బాల్యమందు కోరికలు బహుస్వల్పము, కౌమారమున, యౌవనమున, వార్ధక్యమున బలముగా ప్రబలముగా క్రమక్రమముగా పెరుగుచుండును. పరమార్థదృష్టిగలవానికి క్రమక్రమముగా తగ్గుచుండును. నీమనస్సును బ్రహ్మ జిజ్ఞాసకు మరల్చుము.

234. కాశీయాత్రకు పోయివచ్చిన స్నేహితుని సన్మానించుటకు కొందఱు మిత్రులు వచ్చిరి. ఆ వచ్చిన స్నేహితులతో కాశీక్షేత్రమునందుగల విశేషములను దెల్పుచుండెను. అంతలో నొక మిత్రుడు విశ్వనాథుని చూచితివా యనెను. విశ్వనాథుని తప్ప నన్నిటిని చూచితి నని యత డనెను. సన్మానింపవచ్చిన మిత్రులతని నవమానించిరి. క్షేత్రమును జూచి క్షేత్రజ్ఞుని తెలియని వానిని పరమార్థదృష్టిగలవారు లెక్కచేయరు.

235. పరాక్రమవంతున కొక్కమాటే మరణము. పిరికిపంద నిరంతరము మరణించుచుండును.

236. మహాత్ములను అల్పాత్ములు విమర్శించుచుందురు,

237. అహంకారముతో సత్యభామ తనకుగల బంగారంతయు త్రాసున నుంచియు శ్రీకృష్ణుని తూచలేకపోయినది. నిరహంకారముతో రుక్మిణి ఒక్క తులసీదళముతో తూచగలిగినది.

భగవంతుడు చూచునది బాహ్యావేషములుగావు. హృదయ పవిత్రత.

238. తెరయో, కాగితమో యేదో యొక యాధారము లేనిదే చిత్రకారుడు చిత్రమును జిత్రింపలేడు. స్వప్నములో మనస్సు ఆధారము లేకయే అనేక చిత్రములను చిత్రించు చుండును. అదే బహువిచిత్రము.

239. స్థూలాకాశమునకంటె చిత్తాకాశము, చిత్తాకాశము కంటె చిదాకాశము, ఒకదానికంటె మఱియొకటి సూక్ష్మము. ఆకాశములో సూర్యుడు, చంద్రుడు, నక్షత్రమండలము లన్నియు నిమిడి యున్నవి. అవన్నియు నీచిత్తమం దిమిడి యున్నవి. నీచిత్తము అద్దమందుగల కొండవలె ఆత్మయం దిమిడి యున్నది.

240. మనోహరమగు బిలద్వారమును గాంచి ఎలుకలు ఒకటివెంట మఱియొకటి ప్రవేశించుచుండ నం దున్న పెనుబాము మింగుచుండెను. ఆశ గలవాడు భగవంతుని విస్మరించి ఒకటి తర్వాత మఱియొకటి చొప్పున కోర్కెలు తీర్చుకొనుటకు ప్రయత్నించి ప్రయత్నించి విఫలుడై తుదకు కాలసర్పముచే మింగబడు చున్నాడు.

241. నీబుద్ధి నశ్వరపదార్థములను జింతించుచో వ్యర్థమగును. శాశ్వతమగు దానిని జింతించుచో సార్ధక మగును.

242. సాధనస్థితిలో మనుజునకు ప్రపంచము ప్రధానముగా భగవంతుడు అప్రధానముగా నుండును. సిద్ధస్థితిలో భగవంతుడు ప్రధానముగా ప్రపంచము అప్రధానముగా కన్పించును.

243. ప్రమిద, చమురు, వత్తి యున్నచో దీపమును వెలిగించి ఆ దీపముచే నింకను ఎన్నిదీపములనైన వెలిగింపవచ్చును.

జ్ఞాని ఆత్మబలసమన్వితుడై తన ప్రబోధాగ్నిచే ఎంతమంది అజ్ఞానుల నైనను వారి తమమును పోగొట్టి ప్రకాశవంతులనుగా జేయును.

244. ఒకడు చేదబావిని, దిగుడుబావిని, తటాకమును, సరోవరమును, సముద్రమును జూచి ఒకదానికంటె మఱియొకటి గొప్పదని తెలిసికొనెను. సాధనస్థితిలో శరీరము ప్రధానమని భావించువాడు సిద్ధస్థితిలో శరీరమునకంటె నింద్రియములు, ఇంద్రియములకంటె మనస్సు, మనస్సుకంటె బుద్ధి, బుద్ధికంటె భగవంతుడు, ఒకదానికంటె మఱియొకటి గొప్పదిగా తెలిసికొనును.

245. శ్రీ మహావిష్ణువు వారివారి కోర్కెల ననుసరించి దేవేంద్రునకు నశ్వరసామ్రాజ్యము, బలిచక్రవర్తికి శాశ్వత సామ్రాజ్యము నిచ్చెను.

246. ఆనందము విషయానందమని, బ్రహ్మానందమని రెండు విధములు. విషయానందము తాత్కాలికము. అది అనుభవించు నపు డుండును. దుఃఖముతో అంతమగును. బ్రహ్మానందము నిత్యమై సత్యమై శాశ్వతమై యుండును.

247. మలయమారుతము - అనాఘ్రాతపుష్పము - మంచు బిందువువలె నిర్మలమైయుండు బాల్యదశ ఆజన్మాంత మెవని యందు శోభిల్లునో వాడు ధన్యుడు.

248. పూలమాలలో దారము గలదు. దారములో పూలమాల లేదు. అద్దమందు కొండ గలదు. కొండలో అద్దము లేదు. ద్వైతప్రపంచభేదము అద్వైతబ్రహ్మమును విభజింప జాలదు.

249. సంసార మొక బండిచక్రము వంటిది. ఆచక్రమునకు మధ్య చిన్నచక్రము కలదు. దానిని బంధించుచో పెద్ద చక్రము తిరుగనట్లు మనస్సు స్వాధీనమైనచో నరుడు సంసార చక్రమున పరిభ్రమింపడు.

250. సమాధిస్థితిలో ఉప్పు బొమ్మ నీటిలో కలియునటుల మనస్సు బ్రహ్మాకారమై యుండును. అచట త్రిపుటి యుండదు. (త్రిపుటి-ద్రష్ట-దృక్-దృశ్యము. అనగా చూచువాడు - చూపు-చూడబడునది.)

251. ఇహపరములు రెండింటిని ఒక్కపర్యాయము అనుభవించుటకు వీలుండదు. ఇహమందాశయున్న పరము లేదు. పరమందాశయున్న ఇహము లేదు.

252. వాసనాక్షయము, మనోనాశము, ఆత్మసాక్షాత్కారము ఒకే పర్యాయము సంభవించును.

253. వృక్షము విరిగినపుడు పక్షి లెగిరి పోవును. మనస్సు బ్రహ్మ మందున్నచో సంకల్పము లెగిరి పోవును.

254. భయంకరకష్టములయందు నిస్పృహలయందు ప్రశాంతి నిచ్చునది ప్రార్థన.

255. అన్ని కారణములకును పరమకారణము పరమాత్మ. పరమాత్మయందు మనస్సు లగ్న మగుట అమనస్కము.

256. పెండ్లియింటికి పోయినను ఎద్దుపాలిట ఎండుగడ్డియే. ఐశ్వర్యములమధ్య నున్నను అజ్ఞానికి అపరిమిత దుఃఖమే.

257. కర్మకు కారణము వాసనలు. రావణుని మరణమునకు అతని వాసనలే కారణము.

258. నేను దుర్బలుడ నని భావించువాడు గూడ మహాబలవంతుడే. కావలసినది ఆవరణభంగము.

259. చక్కెరబొమ్మ సముద్రములోతు తెలిసికొనుటకు ప్రయత్నించి సముద్రములో కలియునట్లు పరమాత్మను ధ్యానము చేయువాడు స్వయంప్రకాశమే యగును.

260. మాయ ద్వారపాలకుని వంటిది. ఎంతమంది అజ్ఞానులు వచ్చినను వెలుపల నుండవలసినదే. ఒక్క జ్ఞానికి మాత్రమే యంతఃపురప్రవేశము.

261. ఆత్మసాక్షాత్కారముగల మహనీయులను వదలి సింహమును గాంచిన క్షుద్రమృగమువలె మాయ పలాయనమగును. సాక్షాత్కారము లేనివారిపై యల్పమృగములను జూచిన పెద్దపులివలె మాయ పరాక్రమించును.

262. ప్రవాహవేగమున కొట్టుకొనిపోవువాడు దారాపుత్రులు జ్ఞప్తికిరాక యెవడు నన్ను రక్షించునా యని చూచుపగిది సంసార ప్రవాహమున గొట్టుకొనిపోవువాడు త న్నుద్ధరించుటకు భగవంతు డెప్పుడు వచ్చునా యని తహతహపడును. సుఖములకు దుఃఖములకు పరులు కారణము గారు. నీ మనస్సే కారణము.

263. ఒకడు కలలో ననేక విచిత్రములను గాంచెను. మెలకువ వచ్చినంతనే యా చిత్రము లదృశ్యమయ్యెను. అంత నత డొక యతీశ్వరుని జేరి స్వప్నము నిజమా? జాగ్రత్తు నిజమా? యన రెండును మిథ్యలే యని వా రనిరి.

264. అగ్నియందు వేసినకట్టెలు భస్మ మగును. పరమార్థదృష్టిగలవాడు సమయమునకు ప్రాప్తించిన పదార్థములను భుజించిన భస్మమగును.

265. శరీరముతో చేయు పూజకంటె వాక్కుతోచేయు జపము, వాక్కుతో చేయు జపముకంటె బుద్ధితో చేయు ధ్యానము ఒకదానికంటె మఱియొకటి యధికము.

266. పెట్టెలోని చిమ్మటపురుగులను పెట్టెలోనే యుంచి ఎన్ని దేశములు త్రిప్పినను వస్త్రములను కొఱుకుచునేయుండును.

అట్లే నీయందు దుర్గుణము లుంచుకొని యెన్ని యాత్రలు చేసినను దుఃఖమే కల్గుచుండును.

267. శ్రీకృష్ణ నంతటివాడు సద్గురువు నాశ్రయించనిదే సంసారసముద్రమును దాటలే డన్నపుడు సామాన్యులను గుఱించి చెప్ప నక్కఱ లేదు,

268. దృశ్యప్రపంచమును పరమేశ్వరరూపమని స్వానుభవముతో నెవడు గ్రహించునో వాడు మాత్రమే సంసారచక్ర పరిభ్రమణమునుండి విడువడును.

269. వీరయోధుడు శరీరమునిండ తూట్లుపడినను ప్రాణము లున్నంతవఱకు శత్రువుల నెదుర్కొను నట్లు అంతర్గతమైన కామ క్రోధాది శత్రువుల నెదుర్కొనుటకు సాధకు డంత నిర్భయుడై యుండవలెను.

270. మొదలు చెడినప్పుడు ఎంత గొప్ప వృక్షమైనను దాని ఫలములు, ఆకులు, పుష్పములు ఎటుల ఎండి రాలిపోవునో యెంతటి యోగియైనను శీలమును గోల్పోవుచో పతనము పొందును.

## సర్వసామాన్య ధర్మములు

271. సన్న్యాస మన స్వార్థరాహిత్యము.

272. గాలము వేసినంతనే చేప లభింపదు. ఓర్పుతో నుండు వానికే పరమార్థము లభించును.

273. సన్న్యాసి చలువచేసిన వస్త్రమువంటివాడు. ఆవస్త్రము మీద ఒక్కమరక పడినను స్పష్టముగా కన్పించును. గృహస్థు నల్లని గుడ్డవంటివాడు. దానిమీద నెన్ని మరకలు పడినను కనబడవు. ఉభయులు తప్పుచేయకుండుటయే శ్రేష్ఠము.

274. ఆత్మసాక్షాత్కారముగల మహనీయులకు సంకల్ప మాత్రమున సమస్తము వారి సన్నిధికి వచ్చును. ఇది గ్రహింపని వారు వారికి మంత్రసిద్ధులు గలవనియు, తంత్రములు తెలియు ననియు తలంతురు. వారి కా మహిమ యాత్మసాక్షాత్కారము వలననే కలిగినది గాని మంత్రతంత్రములు కారణములు కావు.

275. ద్వేషమున్నంతవఱకు ముముక్షువునకు విజయము సిద్ధింపదు.

276. ప్రపంచ క్షేమము స్త్రీలవిజ్ఞానము మీదనే యాధార పడియున్నది. అందరికి మొదటి గురువు తల్లి. ఎంత బలముగల పక్షియైనను ఒక్కఱెక్కతో నెగురజాలనటుల స్త్రీలను వదలి పురు షులు మాత్ర మెంత పాటుపడినను లోకకల్యాణము కలుగదు.

277. సాధకునకు ఆహారమునకంటె ప్రార్థన ముఖ్యము. ఆహారమునకు మితముగలదు. ప్రార్థనకు మితములేదు. ప్రవక్త లందఱు ప్రార్థనవలననే విజయ మొందిరి.

278. ద్వేషించినవారిని భూషించువాడు తిట్టినవారిని దీవించు వాడు మహాత్ముడు.

279. శరీరము నీవు గా దనియు పరమాత్మవే నీ వనియు నిర్భయముగా బోధించుటయే సన్న్యాసి ఆదర్శము.

280. టెంకాయలనాశించు వాడు ఉన్నతమగు నావృక్షమును నెమ్మదిగా నెక్కుచో కార్యము సిద్ధించును. త్వరపడుచో క్రింద బడును. కార్యసాధకునకు ఓర్పు ఆవశ్యకము.

281. స్వభావములో శాంతియు, బుద్ధిలో కాంతియు, హృదయ ములో దయ-ధర్మము-ధైర్యముగలిగియుండుటయే సాధులక్షణము.

282. వ్యామోహమును విడువనివానికి సంసారమును విడిచి అరణ్యమందున్నను అశాంతియే. వ్యామోహమును విడిచినవానికే ప్రశాంతి.

283. తన కాల మంతయు పరమార్థమందే గడపువాడు తత్త్వవేత్త. సూర్యరశ్మిలో స్థూలదృష్టికి సూక్ష్మమైన రేణువులును కన్పించును. గాని పరమాత్మను దర్శింపజాలము. అంతర్ముఖదృష్టి తోనే ఆత్మను దర్శించుట సంభవము.

284. నిమ్నజాతివారిని ఉచ్చస్థాయికి తెచ్చు సామర్థ్య మున్నచో నీ వాయుద్యమములో ప్రవేశింపుము. ఆశక్తిలేనిచో నీవు నీచస్థాయిలోపడి పరిహాసము పాలయ్యెదవు.

285. మెదడునకు సంబంధించిన పాండిత్యము సామాన్యము. హృదయజ్ఞానము అసామాన్యము.

286. సార్వభౌముడు తన సామ్రాజ్యమందు కలతలు తీర్చుటకు తన ప్రతినిధుల నంపును. భగవంతుడు ధర్మసంస్థాపన కొఱకు అవతారపురుషుల నంపును.

287. మహాత్ములు ధర్మసంస్థాపన కొఱకు అతీంద్రియ స్థితినుండి ఇంద్రియస్థితికి దిగి వచ్చెదరు. ఇయ్యది పరమహంస లకు మాత్రమే సాధ్యము.

288. రోగము కుదురుటకు మందు పథ్యము ఆవశ్యకము. భవరోగము కుదురుటకు జ్ఞాన మను మందు, విరక్తి యను పథ్యము అత్యావశ్యకములు.

289. విశ్వము విశ్వేశ్వరస్వరూపమను అనుభవము అర్జు నునకు దివ్యదృష్టివలన గలిగినది.

290. ప్రపంచమున శ్రేష్ఠమైన రసాయనము పరమార్థమే.

291. సంసార మను సముద్రమున తరంగము లను దుఃఖ ములు, సుడిగుండము లను మొసళ్ళు, జననమరణము లను తుపా నులు శరీర మను నావను తలక్రిందు చేయుచుండును.

292. ఘనీభూత ప్రకాశము సూర్యుడు. ఘనీభూత పరి మళము కర్పూరము. ఆశ్రమములు శిలలను విగ్రహములుగా మార్చును. దృష్టి జ్ఞానమయ మయిన సృష్టి బ్రహ్మమయ మగును. జ్ఞాని తనకొఱకు తపముచేయ నక్కఱ లేదు. జగత్క ల్యాణము కొఱకు తపస్సు చేయును.

293. కోయిల వసంతఋతువునందు పంచమస్థాయిలో మధురముగా గానముచేయును. కాకి కర్ణకఠోరముగా అఱచును. కోయిల యాహారము మామిడిచిగుళ్లు. కాకి యాహారము ఎంగిలి మెతుకులు. కోయిలరంగు కాకిరంగు ఒకటే. వాని ప్రవర్తనలు వేఱు. దుర్మార్గులను సన్మార్గులను వారి ప్రవర్తనలను బట్టి నిర్ణ యింపవలెను.

294. చాతకపక్షి మేఘోదకమును దప్ప నితరనీరమును గోరనట్లు మహాత్ములు పరమార్థమును దప్ప నర్థమును కోరరు.

295. నేలగూలినవాలి శ్రీరాముని దివ్యమంగళ విగ్రహ మును గాంచినంతనే హృదయపరివర్తన గలిగి సుగ్రీవునితో ని ట్లనియెను. 'తమ్ముడా ! మనము ఒక్క తల్లి గర్భమందు జన్మించి నను శత్రుభావముతో నున్నాము. రామ లక్ష్మణులకు తల్లులు వే రైనను మిత్రభావముతో నున్నారు. వారి భ్రాతృత్వము అద్వితీయ మని శత్రుభావమును వీడి మిత్రభావముతో తనకంఠమందున్న ఇంద్రమాలను సుగ్రీవునికంఠమున వైచెను. మహాత్ముల సంద ర్శన మాత్రమున దుర్మార్గులు సన్మార్గు లయ్యెదరు.

296. క్రుళ్ళిపోయినపండు బుట్టలో నున్నచో క్రమముగా ఫలము లన్నియు చెడును. సంఘములో దుర్మార్గు డున్నచో క్రమముగా సంఘ మంతయు చెడును.

297. పతివ్రతకు భర్తపై, తల్లికి బిడ్డపై మన స్సుండు నట్లు ఏపని చేయుచున్నను భక్తునకు భగవంతునిపై మన స్సుండును.

298. ప్రపంచము అద్దమువంటిది. నీవు నవ్విన నవ్వును. కోపముతో చూచిన కోపముతో చూచును.

299. పసిపాపను, వృద్ధురాలిని జూచినపుడు వికారము కలుగదు. అట్లే నవయౌవనముతో విలసిల్లు సౌందర్యవతిని జూచినను స్థితప్రజ్ఞుడు అవికారముతో నుండును.

300. స్పుటముచేసిన బంగారునందు దోషములు నశించును. ప్రాణాయామమువలన శరీరమలములు నశించును.

301. వస్త్రములకు మురికి తొలగిన రంగు పట్టును. మానవులకు వాసనలు తొలగిన పరమార్థము పట్టుబడును.

302. ధర్మమార్గమున ధనము నారించుట, ధర్మవిరుద్ధము గాని కామము ననుభవించుట వలన జీవితము పవిత్రమై మోక్షము సిద్ధించును.

303. శరీర మను గాజుకుప్పెలో భక్తి యను చమురుపోసి ఏకాగ్రత యను వత్తిబెట్టి తత్త్వచింతన మను అగ్నిని రగుల్కొల్పుచో జ్ఞానదీపము ప్రదీప్తమగును.

304. సముద్ర మందలి తరంగములలో అనేక చంద్రబింబములు కన్పించును. మనస్సను సముద్రములో సంకల్పము లనేకములు గలుగుచుండును. బింబములకు కారణమైన చంద్రు

డొక్కడే. సంకల్పములకు కారణమైన మనస్సు ఒక్కటే. ఆ మనస్సును సర్వకారణకారణుడైన పరమాత్మయందుంచుచో ప్రశాంతి కలుగును.

305. చింతామణి నశ్వరపదార్థముల నిచ్చును. అమృతత్వ మును బ్రసాదించలేదు. పరమాత్మ ప్రశాంతి నిచ్చి అమృతత్వ మును బ్రసాదించును.

306. సానబెట్టిన రత్నమువలె ప్రజ్వలించెడి అగ్నివలె జ్ఞాని ప్రకాశించుచుండును.

307. శరీరమను భూమియందు మనస్సను పుట్టలో కోర్కె లను పాములు బుసలుకొట్టుచు అశాంతిని కలిగించుచుండును. ఒక్కపరమాత్మయే ప్రశాంతిని కలిగించును.

308. పాపముచేయుటకు క్షణము పట్టదు. అనుభవించుటకు కొన్ని జన్మలు పట్టును.

309. పర్వతమును బాణములు భేదింపలేవు. సముద్రతరం గములు పర్వతమును కదలింప లేవు. తామరతూడునందుగల దార ములు ఏనుగును బంధింపలేవు. దుఃఖములు జ్ఞానిని కదలింప లేవు.

310. ఇంద్రియములకు ప్రధానము నిష్కామకర్మ. మన స్సునకు ప్రధానము ధ్యానము. బుద్ధికి ప్రధానము తత్త్వచింత నము. అనుభవమునకు ప్రధానము పరమాత్మ.

311. ఆకాశములో వాయు విమిడి యున్నట్లు పరమాత్మ యందు బ్రహ్మాండము లన్నియు నిమిడి యున్నవి.

312. మహాత్ములకు బాహ్యదారిద్ర్యమే కాని భావదారి ద్ర్యము లేదు.

313. బాహ్యసాధనము లెన్ని యొనర్చినను అంతరంగ సాధన లేనిదే ప్రయోజనము లేదు. మార్చుకోవలసినవి బాహ్య వేషములు గావు. భావము మాత్రమే.

314. మతమునకు సింహద్వారము సత్ప్రవర్తనమే. దివ్య మగు మీ మానససరోవరము కామక్రోధాదు లనెడి గాడ్పులచే కల్లోలితమై యున్నంతవఱకు అందు స్వయంజ్యోతి భాసింపదు. నిర్మలమై ప్రశాంతమైయుండు బుద్ధియందు మాత్రమే దైవదర్శ నము లభించును.

315. నీ హృదయమే చిదంబరము. అందు తాండవము సల్పు నటరాజే ఆత్మ.

316. భీష్ముడు పండుకొనినది శరతల్పము; బోధించినది శాంతిపర్వము. అదే స్థితప్రజ్ఞుని లక్షణము.

317. స్పర్శవేది కసాయివానికత్తిని ఆలయములోని విగ్రహమును బంగారుగామార్చును. మహాత్ములదర్శనము స్పర్శము ప్రబోధము పాపాత్ములను పుణ్యాత్ములుగా మార్చును.

318. ప్రతిమనుష్యుడు అనంతసత్త, అపారజ్ఞానము, అఖండానందము, సర్వతంత్ర స్వతంత్రత, ఏకచ్ఛత్రాధిపత్యము, ఆశించియేయున్నాడు. ఇది మనోవైజ్ఞానిక సత్యసిద్ధాంతము.

319. అశాంతి సంసారము. శాంతి సజ్జనసహవాసము. ప్రశాంతి బ్రహ్మచింతన.

320. అన్నియెడల రాగద్వేషములు, కామక్రోధములు, ఇష్టానిష్టములు నుండియే తీరును. ఓర్పుకలిగి యున్నచో నీ వన్ని ప్రదేశములయందును సుఖముతో నుందువు.

321. భగవంతుడు తా ననుగ్రహింపదలచిన వానిని పలు కష్టముల పాలు గావించి పరీక్షించును. వాని కన్నింటికోర్చుకొన్న వానిని బరిపూర్ణ కృపకు బాత్రుని గావించును.

322. నీ విధ్యుక్తధర్మమును నిష్కపటముగా చేయుము. నీ హక్కులు కోరకయే లభించును.

323. ప్రపంచశాంతిని పెంపొందించుటలో పలువురు కలిసి చేయు సమిష్టి ప్రార్థనలు చాల ఉపయోగించును.

324. నిజమైన భక్తుడు అందరిని ప్రేమించును. ఎవ్వరిని ద్వేషింపడు. ద్వేష మేరూపములో నున్నను భక్తుడుగాడు.

325. అవ్యక్తమైన పరమాత్మను దెలియువాడే వ్యక్తి. మానవులకు అన్నముతో తృప్తికలుగదు. అక్షరాభ్యాసముతో వివేకము కలుగదు. భోగములతో సంతృప్తి కలుగదు. ఆత్మజ్ఞానముతోనే సంతృప్తికల్గును.

326. అంతయు వదలుట వైరాగ్యమహిమ. అన్నియు తానగుట జ్ఞానమహిమ. సర్వము త్యజించుట పరివ్రాజకభావము. అన్నియు తానగుట పరిపూర్ణభావము.

327. విశుద్ధసంకల్పము హింసారూపమున బరిణమించినను ధర్మచ్యుతి కలుగజాలదు. దుస్సంకల్పము అహింసారూపమున నంతమొందినను ధర్మహాని కలుగుచున్నది.

328. మానవుడు - ఆశ యను త్రాటిచే కంఠమున బంధింపబడి గృహమను కొమ్మయందు వ్రేలాడుగట్టబడియుండును. భార్య, పుత్త్రిలు, బంధువులు అను వారలు వానిని చీమలు, నల్లులు, దోమలు మున్నగువానివలె భక్షించుచున్నారు.

329. లౌకికునకు జ్ఞాని కున్నంత జ్ఞానము తెలివియు నుండవచ్చును. యోగి పడునంతశ్రమయు, సాధనయు చేయవచ్చును.

ఐనను వానిశ్రమ యంతయు వృథా. ఎందువలన నన తన సామ ర్థ్యమునంతయు భగవంతునికొఱకుగాక భౌతికవిషయములకొఱకే యుపయోగించును.

330. మఱచిపోవలసినవి రెండు. జ్ఞప్తి పెట్టుకోవలసినవి రెండు. తాను ఇతరులకుచేసిన యుపకారము ఇతరులు తనకుచేసిన యుపకారము మఱచిపోవలెను. జ్ఞప్తియందుంచుకోవలసినవి మృత్యువు-భగవంతుడు.

331. మనలోని గంభీరమగు దివ్యశక్తిని, సత్యమును, గుర్తించుకొని బాహ్యపరిస్థితుల ప్రాబల్యమును తిరస్కరింపగల ఆంతరంగికబలమును, సుప్రతిష్ఠితముచేసికొనుట యోగసాధనకు ముఖ్యాశయము. పరమదుర్బలునివలె కానవచ్చు వానిలో నైతము ఈబలము అంతర్హితమైయున్నది. దానిని తెలిసికొని జీవిత సంగ్రా మములో నిస్పృహచెందక నిరంతర సాధనచేసి ఆత్మసాక్షాత్కార మొందువాడే స్థితప్రజ్ఞుడు.

332. హంసయనగా హృదయకమలమందు సంచరించు ప్రాణవాయువు. హంస లేచిపోయిన ఈశరీరము శవము. హంస యున్నచో శివము.

333. జగత్తు మనస్సుచే కల్పింపబడినది. మనస్సు ఆత్మలో పుట్టినది. నీవు ఎక్కడ సంచరించినను మనస్సును స్వాధీనమున నుంచుకొనుము. శరీరము కదలునుగాని ఆత్మ కదలదు. జగము లన్నియు నాత్మయందే కలవు. ఆత్మ పాలలో వెన్నవలె నంతట నిండియున్నది. అది లేనిచోటు లేదు.

334. స్వధర్మ నిర్వహణలో కలుగు కష్టములను ఓర్మితో సహించుటయే తపస్సు.

335. విత్తనములో నే వికారము నుండదు. ఆ విత్తనము మొలకయగుచో రెండు ఆకులు మాత్రమే యుండును. వృక్షమగుచో శాఖలు, ఉపశాఖలు, ఆకులు, పువ్వులు, పిందెలు, ఫలములుగా విస్తరించును. అటులనే మానవునిలో బాల్యదశలోనే వికారములుండవు. కౌమారస్థితిలో రెండాకులు మాత్రమే యుండును. యౌవనములో శాఖలు, ఉపశాఖలు మాత్ర ముండును. వార్ధక్యములో శాఖలు, ఉపశాఖలు, ఆకులు, పువ్వులు, పిందెలు, ఫలములుగా విస్తరించి దుఃఖము లను ఫలములను ప్రసాదించునదే సంసార వృక్షము.

336. ఆనందము వెలుపలనున్న దనుకొను అలవాటుకొలది మనస్సు బాహ్యవిషయములకొఱకు పరుగులు పెట్టుచుండును. ఆనందమిచ్చునది బాహ్యవిషయములు కావను జ్ఞానము కలిగినచో మనస్సు అట్లు పరుగులు పెట్టదు. ఆనందము నాయందే కల దనియు, నేను ఆనందస్వరూపుడ ననియు తెలియుట సమ్యగ్దృష్టి.

337. గంగతో నున్న చెంబును పూజించెదరు; చెంబును పూజింపరు. జ్ఞానిని పూజించెదరుగాని అజ్ఞానిని పూజింపరు.

338. బహిర్ముఖమే దుఃఖము. అంతర్ముఖమే ఆనందము. కోరికలు లేనిస్థితిలో మనస్సు అంతర్ముఖమై యుండును. ఆత్మానుభూతి కిదియే లక్షణము.

339. ఉపాసన అదృష్టఫలము. జ్ఞానము దృష్టఫలము. ఉపాసకులు క్రమముక్తులు. జ్ఞానులు సద్యోముక్తులు. జీవన్ముక్తులు.

340. పిల్లగ్రుడ్డు కానట్లు, చెట్టు విత్తు కానట్లు, ముత్యము నీరు కానట్లు బ్రహ్మభావము చెందినవారికి జన్మలేదు. విచిత్రమేమన పోవుమార్గమున్నచో వచ్చు మార్గముండును. జ్ఞానికి గమనమే లేదు.

341. పవిత్రహృదయ మను ప్రమిదెయందు భక్తి యను తైలము సంపూర్ణముగనున్నవారికే అజ్ఞానాంధకారమును పోగొట్టు జ్ఞానదీపము ప్రకాశించును. అట్లే భక్తియను సుగంధపుష్పము గల వారికే శాశ్వతానందమైన జ్ఞానఫలము లభించును.

342. మీరు ఏకార్యమును జేయుటకు సంకల్పించినను అంతఃకరణము పవిత్రముగా నుండవలెను. సింహముపాలు బంగారుపాత్రలోనే పోయవలయును. ఏపాత్రలో పోసినను కశ్మల మగును. అట్లే శుద్ధాంతఃకరణమునందు బ్రహ్మాకారవృత్తి నిలుచును. లేనిచో తొలగును.

343. కామవిజయమునకు గల మార్గములలో సజ్జన సహవాసము శ్రేష్ఠమైనది.

344. పాపములకెల్ల దురాశయే తండ్రి. ఓర్పు కలిగియున్న నీ శత్రువులుగూడ మిత్రులై నీ యాజ్ఞలను శిరసావహింతురు.

345. ఐహికానందము లన్నియు బ్రహ్మానంద సాగరములో నొక్కబిందువు. రసాలవృక్షమును సమీపించి పరిపక్వములైన ఫలములను విడిచిపెట్టి ఆకుల నమలుట ఎటువంటిదో పరమార్థమును విస్మరించి యర్థమునే యాశ్రయించుట యట్టిది.

346. మనము భయపడుచో కుక్కపిల్లలుగూడ భయపెట్టును. నిర్భయులమైనచో సింహములుగూడ భయపడును.

347. శిక్షించువానికి రెండుచేతులైన రక్షించువానికి వేయిచేతులు. కాన నిర్భయులై పరమాత్మనే యాశ్రయింపుడు.

348. మురికిగుంటలో నున్న తాబేటికి మురి కంటునట్లు అజ్ఞానులతో కలిసియున్నవానికి దుఃఖమే యంటును.

349. ఆత్మస్తుతి, పరనింద యధమలక్షణము.

350. సద్బ్రాహ్మణుని పంచముని సమముగా జూచుటయే మహాత్ముని లక్షణము.

351. నామరూపములు జూచుట సామాన్యము. ఆత్మను గాంచుట విశేషము.

352. వినయములేని విద్య పరిమళములేని పుష్పము వంటిది.

353. నీలో కుటిలత్వము గల్గుచో కుశలత్వము నశించును.

354. కర్తవ్యపరాయణుని భాగ్యలక్ష్మి వరించును.

355. మనస్సును భగవంతునియందుంచిన బాధలు కని పింపవు.

356. స్పర్శవేది కసాయివాని కత్తిని ఆలయములోని విగ్రహమును బంగారముగా మార్చునటుల మహాత్ముల ప్రబోధము పాపాత్ములను, అల్పాత్ములను మహాత్ములుగా మార్చును.

357. సామాన్యులు కోపముగలవానిని విశ్వామిత్రుడందురు. మహాత్ములు తపోధనుడు గాయత్రీమంత్ర ద్రష్ట యందురు. అల్పులు మనుజునియందుగల చెడుగును చూచెదరు, మహాత్ములు మంచినే చూచెదరు.

358. త్రిమూర్తులుగూడ మాకు నీ సృష్టి, స్థితి, లయముల నుండి యెప్పుడు విముక్తి గలుగునాయని తపము చేయుచున్నారు. కాన అన్నిటికి నాధారమైన స్వయంప్రకాశుని యాశ్రయింపుము.

359. ఇనుమును మట్టి భక్షించునటులు తన పాపకర్మలే తన్ను భక్షించును. కట్టెలను అగ్ని దహించునటుల తన దురాశయే తన్ను దహించును.

360. మార్పుచెందు ప్రపంచపరిస్థితులకు అనుగుణముగా ప్రవర్తింపుము.

361. మీరు ఆత్మారాములు, ఆత్మతృప్తులు, ఆత్మసంతుష్టులు గావలెనేకాని విషయారాములు, విషయతృప్తులు, విషయసంతుష్టులు కారాదు.

362. ప్రవాహవేగమును దుర్బలు లెదురీదజాలరు. అట్లే సంసారప్రవాహమున అజ్ఞాని ఎదురీదలేడు. జలజంతువు లెదురీదునట్లు జ్ఞానముగలవాడే యెదురీదగలడు.

363. పరమార్థదృష్టిలో త్రిలోకములను జయించినను గొప్పగాదు. తన యింద్రియములను జయించుటే గొప్ప.

364. శిలావిగ్రహములు భూషించిన పొంగవు. దూషించిన క్రుంగవు. జ్ఞాని మానావమానములకు పొంగడు క్రుంగడు.

365. శుష్కవేదాంతుల మాటలకు లోనైనచో దుఃఖము, అనుభవజ్ఞానము గలవారి నాశ్రయించుచో సుఖము.

366. అజ్ఞానమే దుఃఖములకు కారణము, జ్ఞానమే సంతోషములకు మూలము.

367. భక్తి శూన్యమైన తత్త్వజ్ఞానమువలన అహంకారమతిశయించును. అందువలన ముక్తిమార్గమున కడ్డమువచ్చును. అటులనే జ్ఞాన శూన్యమైన భక్తి ప్రమాదమని తెలియుము.

368. బద్ధుడు భగవదనుగ్రహపాత్రుడు కాజాలడు. ప్రపంచము శాశ్వతమనియు, భగవంతుడు శాశ్వతుడనియు తెలియువాడే ముక్తుడు.

369. రణరంగమున యోధునకు కవచమెట్లు రక్షణ కల్పించునో భగవచ్చింతనమను కవచము అంతశ్శత్రువులైన అరిషడ్వర్గమును, మిత్రవర్గముగా మార్చి ప్రశాంతిని కలిగించును. యుద్ధరంగమున యోధుని కవచము ఖండింపబడవచ్చును. భక్తి కవచము ఖండింపబడదు. అది శత్రుదుర్భేద్యము.

370. స్వార్థరహితుడై విశ్వకల్యాణమున కెవడు ప్రయత్నించునో వాడే మనుష్యరూపముతో నున్న మాధవుడు.

371. జన్మమువలన మనుష్యుడు బ్రాహ్మణుడుగ, చండాలుడుగ కాజాలడు. వాని ప్రవర్తనమును బట్టియే నిర్ణయింపుము.

372. భగవంతుడు చూచునది బాహ్యవేషములుగావు. నిర్మలహృదయము. ఇతడేమి చేయుచున్నాడని చూడడు. ఏభావముతో చేయుచున్నాడా యని చూచును. భగవంతునకు గజేంద్రుడు భక్తితో పుష్పమర్పింప మోక్షమిచ్చెను. మన్మథుడు అహంకారముతో పుష్పమును ప్రయోగింప భస్మమయ్యెను.

373. వానచినుకు గమ్యము చేరవలెనన్న ఒక నది నాశ్రయింపవలెను. లేనిచో ఆరిపోవును. మానవుడు గమ్యము చేరవలెనన్న సద్గురువు నాశ్రయింపవలెను. లేనిచో ఆగిపోవును.

374. అహంకారమను బీజమునుండి పుట్టి మమకారమను కొమ్మలతో వ్యాపించి దుఃఖ మను ఫలముల నిచ్చునదే సంసారమను వృక్షము. అమృత ఫలముల నిచ్చునదే పరమేశ్వరుడను కల్పవృక్షము.

375. ప్రపంచ విషయములందు కష్టములు అధికములు. సుఖములు స్వల్పములు, పరమార్థ విషయములయందు కష్టములు స్వల్పములు, సుఖములు అధికములు. అయినను అజ్ఞానులు ప్రపంచ విషయములందే మొగ్గు చూపెదరు. జ్ఞానులు పరమార్థ విషయములయందే మక్కువ చూపెదరు.

376. మానవులు స్వాధీనమందున్న వస్తువులయందు అశ్రద్ధ గలిగియుందురు. స్వాధీనములో లేని వస్తువులయందు శ్రద్ధ గలిగియుందురు. మూఢులు హృదయాంతర్వర్తియైన పరమాత్మయందు అశ్రద్ధ గలిగియుందురు. జ్ఞానులు శ్రద్ధగలిగియుందురు.

377. సామాన్యగురువులు చూపు సంపాదించుకొన్నవారికి చూపెదరు. అవతారగురువులు చూపు నిచ్చెదరు, చూపించెదరు. అధికారియైన వానికి అనుభవము కలిగించుట సామాన్య గురువుల లక్షణము. అనధికారిని అధికారిగా జేసి అనుభవము కలిగించు సామర్థ్యము అవతారగురువుల లక్షణము. కావున సద్గురువు నాశ్రయింపుము.

378. సముద్రము జలనిధియైనను ఆ నీటిని త్రాగుటకెవరును కోరరు. మేఘోదకమునే కోరెదరు. కుబేరునివంటి యైశ్వర్యము గలవానినైనను దాతృత్వము లేనిచో హీనుడందురు. ఈవి కల వానినే మహాత్ముడందురు.

379. మార్పుగలది ప్రపంచము. మార్పులేనివాడు పర మాత్మ. అతడు సృష్టికి పూర్వము గలడు. సృష్టిలోగలడు. ప్రళయములో గలడని తెలియువాడేసిద్ధుడు. తెలియనిచో బద్ధుడే.

380. సమదృష్టిగలవానికి నరకమన్న దుఃఖము, స్వర్గ మన్న ఆనందముండదు. వాడు ఆత్మరతుడై యుండును.

381. ప్రమిదె దీపము గాలిలేనిచోట ప్రకాశించును. మనస్సునకు ఏకాగ్రత ప్రశాంతమగుచోటనే కలుగును. లేత మొక్కకు చుట్టును కంచెవేయుచో పశువులు తినవు. ఆ మొక్క వృక్షమైనచో దానిఫలము లనేకపక్షులు భక్షించును. దాని యాకు లనేక పశువులు మేయును. చాలమంది యాచెట్టు నీడను విశ్రాంతి నొందుదురు. ఏనుగును కట్టినను చలింపదు. కావున సాధన స్థితిలో నేకాంతముగ నుండుము. సిద్ధస్థితిలో నెచటనున్నను ప్రశాంతియే కల్గును.

382. సంసారవృక్షమునకు మనస్సే బీజము. కామమే యంకురములు, ఈషణత్రయములే చిగుళ్లు. స్వర్గనరకములే

కొమ్మలు. అహంకార మమకారములే మూలము. సుఖదుఃఖము లను ఫలములు గల్గి యశాంతి యను పక్షులతో గూడినదే సంసార వృక్షము. దానిని జ్ఞానకుఠారముచే మూలచ్ఛేదము చేయుచో ప్రశాంతి కలుగును. లేనిచో నశాంతియే.

383. వి త్తనము వేయగనే ఫలము చేతికందదు. కొంత కాలము పట్టును. అటులనే యే ఘనకార్యమైనను ఫలించుటకు కొంత వ్యవధి పట్టును.

384. తల్లిని హింసపెట్టువానికి, పరులమీద నకారణముగ నిందారోపణ చేయువానికి, చేసిన మేలు మఱచినవానికి ప్రాయ శ్చిత్తము లేదు.

385. తెలియనపుడు నాకు తెలియదనుటలో గొప్ప కలదు. తెలియకపోయినను నాకు తెలిసిన దనుట హేయము. దీనిని గు ర్తించినవాడే ప్రాజ్ఞుడు.

386. అహంకార మను త్రాచుపాములు వివేక మను గరు త్మంతుని చూచి పర్వెత్తుచుండును.

387. ప్రతిజ్ఞ చేసినంతమాత్రమున ఘనకార్యము నెఱ వేరదు. కావలసినది నిరంతరకృషి.

388. అల్పులను ఆశ్రయించి ఫలము పొందుటకంటె నిష్ఫలమైనను మహాత్ముల నాశ్రయించుట మంచిది.

389. వ్యర్థమైన మాటలకన్న సార్థకమైన క్రియలు మేలైనవి.

390. మన మొకదానిని సంకల్పింతుము; దైవము వేఱొకటి చేయును.

391. అడుగక పోయినను శుభమును చెప్పుము.

392. ధనమున్నపుడే పనులను పూర్తిగానించుకొనుము. లేనిచో కాలము ఆ ధనము నపహరించును.

393. మహాత్ములు సాధింపలేని కార్యములేదు. సాహసము లేక మానవుడే ఘనకార్యమును సాధింపలేడు. తాను తరించి పరుల తరింపజేయవలెను.

394. ప్రయత్నము చేయుము. అది సిద్ధింపనిచో విచార పడవలదు. ప్రయత్నము చేయకుండుట యవివేకము.

395. భూమి సమస్త జంతువుల కాశ్రయమై చేయుచున్న పనులన్నియు సహించునట్లు ముముక్షువు క్షమతో నుండవలెను. ఓర్పులేక యెన్ని సద్గుణము లున్నను నవి నిష్ప్రయోజనములు.

396. జలము పరిశుద్ధము. మధురగుణము కలిగి స్నాన పానముల కుపయోగపడురీతిని ముముక్షువు లోపల వెలుపల పరిశుద్ధతకలిగి సత్ప్రవర్తనతో నుండవలయును.

397. అగ్నిహోత్రము చీకటిని పోగొట్టి ప్రకాశించుచుండు నటుల జ్ఞాని యజ్ఞానమును పారద్రోలి ప్రకాశించుచుండును. ఆజ్య ముతో అగ్ని వెలుగునట్లు పరిశుద్ధమైన తపస్సుచే జ్ఞాని ప్రకాశించుచుండును.

398. వాయువునకు సుగంధ దుర్గంధములు - చల్లదనము వేడిమి సంసర్గమువలన కలిగినవేకాని సహజములుకావు. అట్లే ఆత్మకు సుఖదుఃఖములు సహజములుకావు. దేహసంసర్గమువలననే కలుగుచున్నవి.

399. ఆకాశము అన్నింటియందున్నను దేనిని అంటక యుండునటుల పరమాత్మ సృష్టి స్థితిలయముల కంటడు. వృద్ధి క్షయములు చంద్రకళలకేగాని చంద్రునకు లేనట్లు షడ్భావ వికార ములు శరీరమునకేగాని యాత్మకు లేవు.

400. పర్వతము తృణవృక్షలతాదులను నదీప్రవాహములను నన్నింటిని శిరమున ధరించియున్నట్లు స్వార్థరహితుడై పరోపకార మొనర్పవలెను.

401. ముముక్షువు తనకీయబడినదానిని తన్ను యాచించిన వారి కీయవలెను. శ్రోత్రాదులైన యింద్రియములచే శబ్దాది విషయముల గ్రహించినను మనసునందు నిలుపక విడువవలయును.

402. పావురము దారాపుత్రాదులయందు మోహముచే వలలోబడి నశించునటుల జీవుడు ఈషణత్రయములకు బద్ధుడై చెడుచున్నాడు.

403. కొండచిలువ యప్రయత్నముగా లభించిన పదార్థములతో తృప్తిపడునట్లు ముముక్షువు లభించినదానితో తృప్తినందవలయును.

404. సముద్రము గాంభీర్యము, ప్రసన్నత గలిగియుండును. అట్లే జ్ఞాని కలతనొందక నిశ్చలుడై యుండును. సముద్రము వర్ష కాలములో పొంగక ఎండకాలములో క్రుంగక యుండునట్లు జ్ఞానియైనవాడు వెలుపల ప్రసన్నతయు, లోన గాంభీర్యమును గలిగియుండును. మఱియు నితరులకు లొంగక పరులవలన క్షోభము నొందక జ్ఞానవైరాగ్యములచేత చిత్తస్థైర్యమునొంది కర్మవశమున కలిగిన లాభనష్టములకు మోద ఖేదములను బొందక సమత్వము కలిగి యుండును.

405. మిడుత అగ్నిహోత్రమును జూచి యాకర్షింపబడి మడియు నటుల కులటల హావభావములకు భ్రమియించి యజ్ఞాని నశియించును.

406. తుమ్మెద యనేక పుష్పములయందు వ్రాలి యే పుష్పమునం దెంత మధువుగలదో యంతే గ్రహించును. అటులనే మానవుడు తనకు లభించిన దానితో తృప్తిపడి యుండవలయును. తుమ్మెద సకలపుష్పములలోని మధువును చవిచూచునటుల వివేకవంతుడు సమస్త శాస్త్రములను జదివి వానిసారమును గ్రహింపవలయును.

407. తేనెటీగలు మధువును కూడబెట్టి పరుల కర్పించునటుల లోభి పరమార్థదృష్టిలేక యార్జించిన ధనమును పరులపాలు చేయును.

408. ముముక్షువు ఆకలియను రోగమునకై మితముగా భుజింపక జిహ్వాచాపల్యమున రుచిగల పదార్థములని యపరిమితముగా భుజించుచో చేప యెరకాశపడి గాలమున తగులుకొనినట్లు నశించును.

409. ఏనుగు స్పర్శసుఖ మపేక్షించి బంధింపబడునట్లు సంగమమున కాశించి తనకుగలదానికన్న నెక్కువ బలముగల యేనుగుచేత జిక్కి మరణించునట్లు యోగి స్పర్శసుఖ మపేక్షించినచో పతనము పొందును.

410. పింగళ యనువేశ్య ధనమున కాశించి రాత్రి నాలుగు జాములు విటులకొఱకు పరితపించి కన్నులు కాయలుకాచి పోగా బహిర్ముఖవృత్తిని వదలి యంతర్ముఖముగలదై యనుభవము వలన ఆత్మానంద మొందెను. అటులనే ముముక్షువు బహిర్ముఖము నుండి అంతర్ముఖుడై యాత్మానందము పొందవలయును.

411. గ్రద్ద మాంసమును తెచ్చి భుజింపవలెనని ప్రయత్నించి తోడిగ్రద్దలతన్నులు తినజాలక మాంసమును విడిచి

సుఖించునట్లు ముముక్షువు విషయముల కాశించి క్లేశమునొందక యాత్మానందము పొందవలెను.

412. ఒక కన్యక తనయింటికి బంధువులు వచ్చినందున తియ్యమునకై వడ్లు దంచుచుండెను. చేతిగాజులు శబ్దముచేయగా నాకన్య తాను దంచుట బంధువులకు తెలియకుండుటకై సౌభాగ్య చిహ్నముగ చేతికి నొక గాజుమాత్రమే యుంచుకొని తక్కినవి తీసివైచి పని నెఱవేర్చుకొనెను. అట్లే సాధకుడు వ్యర్థప్రసంగ ములు చేయక అంతర్ముఖుడై యాత్మానుభవ మొందవలెను.

413. విలుకాడు తన లక్ష్యమందు మనసునిల్పి వేఱుదేనిని చూడనటుల దృఢవైరాగ్యముచే ఏకాగ్రత కలిగియుండవలెను.

414. సర్పము ఒంటరిగా సంచరించుచు స్వస్థలమన్న నిర్ణ యములేక చీమలు పెట్టిన పుట్టలయందు నివసించుచు నప్రమత్తత కలిగి ఒంటరిగా చరించుచు విషము కలదనిగాని లేదనిగాని పరీ క్షించుటకు వీలులేనట్లు కాళ్ళున్నవా లేవాయని తెలిసికొనుటకు శక్యముగానట్లు శరవేగముగా బరువెత్తుచు మితముగా బుసలు కొట్టుచు మెలగుచున్నట్లు జ్ఞాని యొంటరిగా సంచరించుచు ననిత్య మైన శరీరమునకు గృహనిర్మాణము దుఃఖముగనుక స్వస్థలమన్న నిర్ణయములేక తటస్థించిన గృహములయందు నివసించుచు నింద్రియ వికారములకు లోపడక జాగ్రత్తకలిగి యేకాంతమున నివసింపవలయును.

415. వృక్షము తనకు నీరుపోసి పోషించువానికి, రంప ముతో కోయువానికి భేదము చూడక నీడనిచ్చునట్లు మహాత్ము లన్ని భూతములయందును గల చైతన్యమును సమదృష్టితో వీక్షించి, శత్రు మిత్రభేదములేక యుండవలయును.

416. అజ్ఞానిమనస్సు నిరంతర మశాంతి కల్గియుండును. జ్ఞానిమనస్సు ప్రశాంతి కల్గియుండును. అజ్ఞాని మనస్సు ప్రపంచ వ్యాపారములయందు నిమగ్నమై యుండును. జ్ఞానిమనస్సు స్వయంప్రకాశమందు లగ్నమై యుండును. జ్ఞాని కంటితో చూచి నను నిర్లిప్తుడై యుండును.

417. మనుజునకు దుఃఖము కల్గుటకు అజ్ఞానమే కారణము. చచ్చినకుక్క బావిలో నున్నచో నెన్నిపర్యాయములు నీరు తోడి పారబోసినను వాసనపోదు. బావిలోనున్న కశ్మలమును తొలగించినచో వాసనపోవును. గావున సద్గురువు నాశ్రయించి అజ్ఞానమును పారద్రోలి విజ్ఞానము కల్గియుండుము.

418. అన్ని విద్యలకంటె బ్రహ్మవిద్య అతి సులభము. ఇతరవిద్యలకు త్రిపుటి (తెలియువాడు తెలివి తెలియదగునది) యుండును. బ్రహ్మవిద్య కా కష్టము లేదు. శ్వాసను పీల్చుట వదలుట యెంత సులభమో బ్రహ్మవిద్య అంత సులభము. తాను తానై యుండుటే బ్రహ్మవిద్య.

419. భగవంతుడు ఈ సృష్టి నెందుకు చేయవలయును, భాగ్యవంతులు, మధ్యములు, బీదలు నిరంతరము మనోవ్యథల చేతనో శరీరవ్యథలచేతనో, బాధపడుచున్నారు గదా యని కొందఱు ప్రశ్నించెదరు. ఈ ప్రశ్న వేయువారు మాయకు స్వాధీనులై వేయుచున్నారు. త్రిగుణాతీతున కీ ప్రశ్నయే ఉదయించదు. అతడు నిరంతరము ఆత్మతృప్తుడై ఆత్మారాముడై యుండును.

420. కొందరు బాలుని జ్ఞానితో పోల్చుచుందురు. అంత మాత్రమున బాలుడు జ్ఞాని కానేరడు. జ్ఞానివలె బాలుడు జ్ఞాన ప్రబోధము చేయజాలడు. బాల్యమున బాలునిలో అహంకారము సూక్ష్మముగా నుండును. బాలుడు పెరుగుచున్నకొలది అహం

కారము పెరుగుచుండును. జ్ఞానిలో అహంకారము పూర్తిగా నశించి యుండును.

421. జ్ఞానిదృష్టి సమత్వము, అజ్ఞానిదృష్టి భిన్నత్వము కలదై యుండును. జ్ఞానియైనవాడు ఈ భిన్నత్వమున కాధారమగు సమత్వము ఒకటి కలదని అనుభవపూర్వకముగా తెలిసికొనును. అజ్ఞాని అనుభవము లేనందున విషమదృష్టి కలిగి యుండును.

422. కలిమి గలవారు, ఉన్నతోద్యోగులు, సార్వభౌములు, ప్రతిసంవత్సరము పుట్టినరోజు పండుగ చేసికొందురు. ఆ ఒక్కరోజైనను నేను ఎవడను? నా జీవితగమ్యమేది? యను పరితాపము లేక పుట్టినరోజు పండుగ చేసికొనుట శవాలంకారము వంటిదే యగును.

423. కర్తృత్వము కల్గి యున్నంతవరకు అహంకారముండును. అది యున్నంతవరకు నరులు అసురులే. అహంకారము తొలగినవారే సురలు. బహిర్ముఖులు అసురులు. అంతర్ముఖులు సురలు. అంతర్ముఖులకే ఆత్మసాక్షాత్కారము.

424. మనస్సునకు ధ్యానము, బుద్ధికి తత్త్వచింతన, చిత్తమునకు లయము నను పనులు పెట్టుచో ప్రశాంతి కల్గియుండువు.

425. జాగ్రదవస్థలో అంతరింద్రియములు బహిరింద్రియములు పనులుచేయును. స్వప్నములో మనస్సు మాత్రమే అన్నిపనులు చేయుచుండును. గాఢ సుషుప్తిలో కారణ శరీరము పనినిజేయును. జాగ్రత,స్వప్నము,సుషుప్తి. ఇవి మనోధర్మములు. వీనికి అంటకుండా అధిష్ఠానముగానుండి చూచువాడు పరమాత్మ. అవస్థలు మారుచున్నను పరమాత్మకు మార్పులేదు. అతడు అవస్థాత్రయసాక్షి.

426. అహింసయను బీజమునునాటి దృఢసంకల్పమను నీరుపోయుచో మొక్క మొలచును. ఆ మొక్కను పశువులు మేయకుండ చుట్టూ వైరాగ్యమను కంచెను వేయుచో ఆమొక్క వృక్షమై ఆత్మసాక్షాత్కారమను అమృతఫలముల నిచ్చును.

427. మహాత్ములు నిర్మలహృదయముతో లోకకల్యాణము కొరకు స్వార్థరహితులై నిరశనులై తపము సల్పుచుండ అల్పులు మలిన హృదయముతో స్వార్థసహితులై నిరశన వ్రతములు సల్పుచుండుట కడు విచిత్రము.

428. విశ్వము గొప్పదే గాని విశ్వేశ్వరు డంతకన్న గొప్పవాడు. విశ్వపరిశోధన గొప్పదే కాని విశ్వేశ్వరుని గూర్చిన పరిశోధన మంతకన్న గొప్పది. మనము దేనిని విశ్వ మనుచున్నామో యది విశ్వనాథునికంటె వేఱుగాదు. కుండ యని దేనిని పిలుచుచున్నామో యది మట్టికంటె వేఱుకాదు. విశ్వము భగవంతుని విపుల విభూతి. కాని విశ్వమే భగవంతుడు గాదు. సూర్యుని విభూతియే ప్రకాశము. ప్రకాశమే సూర్యుడుగాడు. అట్లే ప్రపంచము పరమాత్ముని విభూతి యను దృష్టితో భగవంతుని పొందగలము. భగవత్కార్ముడై, భగవత్పరతంత్రుడై, భగవద్భక్తుడై, సంగరహితుడైన నరునకు నారాయణ సాక్షాత్కారము సిద్ధించినది. ద్రష్టయైన పరమేశ్వరుడు అర్జునునకు దృశ్యమై నిలిచెను. అదే భక్తవాత్సల్యము.

429. అష్టసిద్ధులు—అనగా; అణిమ - అణుస్వరూపుడై కంటికి కనుపింపకుండుట, మహిమ - పర్వతమువలె కన్పించుట, గరిమ - పర్వతమంత బరువు కలిగియుండుట. లఘిమ - దూదిపింజవలె మిక్కిలి తేలికగా నుండుట, ప్రాప్తి - సూర్యుని,

చంద్రుని, నక్షత్రములను చేతితో తాకుట; ప్రాకామ్యము - తన యిచ్ఛ ననుసరించి చరించుట (పరకాయ ప్రవేశము) ఈశ్వరత్వము-ప్రభావ సంపన్నుడై యుండుట, వశిత్వము-సకలచరాచరములు తన యిచ్ఛ ననుసరించి సంచరించు నట్లుండుట. వీనిని అష్టసిద్ధు లందురు. గమ్యము చేరబోవునపుడు అష్టసిద్ధులు కలుగును. స్థితప్రజ్ఞుడు సిద్ధులను అశుద్ధములవలె పరిత్యజించి యాత్మరతుడై యుండును.

430. నాదము : అంతర్ముఖుడై నాసాగ్రమున చూపును నిల్పుచో మొదట (1) చిణీనాదము (2) చిణిచిణీనాదము (3) ఘంటానాదము (4) శంఖనాదము (5) వీణానాదము (6) తాళనాదము (7) వేణునాదము (8) భేరీనాదము (9) మృదంగనాదము (10) మేఘనాదము నను దశవిధ నాదములు విస్పష్టముగా వినిపించుచుండును. దీనినే నాదమందురు.

431. బిందువు (1) నిర్మలాకాశము (2) అంధకారబంధురమైన పరాకాశము (3) ప్రళయదావానలమువలె కన్పించు మహాకాశము (4) చిత్రవిచిత్రాకృతులతో విద్యుత్ప్రభాసహితమైన తత్త్వాకాశము (5) శతసహస్ర సూర్యప్రభాభాసమైన భౌమాకాశము నను నీ పంచాకాశముల మధ్యమున (1) వియన్మండల (2) తమోమండల (3) మేఘమండల (4) విద్యున్మండల (5) తారామండల (6) జ్యోతిర్మండల (7) సూర్యమండల (8) చంద్రమండల (9) వహ్నిమండల (10) హిరణ్మయమండలంబులను దశవిధ మండలంబులు కన్పించుచుండును. దీనినే బిందు వందురు.

432. కళ : వీని యన్నింటియందును గల జీవుదే కళ. పరమాత్మ నాదబిందుకళాతీతుడు.

433. ఆత్మవిదులు : బ్రహ్మవిదుడు, బ్రహ్మవిద్వరుడు, బ్రహ్మవిద్వర్యుడు, బ్రహ్మవిద్వరిష్ఠుడు నని నలుతెఱంగులు. (1) బ్రహ్మవిదుడు సద్గురువు నాశ్రయించి శాస్త్రవిహితకర్మము లాచరించుచు తామరాకుమీది నీటిబిందువువలె సంసారమందుండియే యాత్మసాక్షాత్కారము నొంది శాంతి కలిగియుండును. (2) బ్రహ్మవిద్వరుడు సద్గురువు వలన నుపనిషత్సారమెఱిగి కర్మసన్న్యాసియై యాత్మసాక్షాత్కారము కలిగి ప్రశాంతుడై యుండును. (3) బ్రహ్మవిద్వర్యుడు సర్వసంగపరిత్యాగమొనర్చి యొకపరి యంతర్ముఖుడై మరియొకపరి బహిర్ముఖుడై పరమప్రశాంతుడై యుండును. (4) బ్రహ్మవిద్వరిష్ఠుడు సమదృష్టి గలిగి త్రిగుణాతీతుడై యంతర్ముఖుడై బ్రహ్మస్వరూపుడై యుండును.

434. అహింస – భూతదయ కల్గియుండుట. పరస్పరవైరములు గల ఏనుగు, సింహము, గోవు, పెద్దపులి, భూతదయ గల మహనీయుని సన్నిధియందు అన్యోన్యవైరములు లేనివై నివసించుచుండును.

సత్యము – సత్యమునుపల్కు మహనీయుని వాక్కు వజ్రాయుధమువలె అమోఘమై యుండును.

అస్తేయము – పరద్రవ్యాపేక్ష లేకయుండుట.

అపరిగ్రహము – ఉచితముగా ఇచ్చుదానిని స్వీకరింపకుండుట.

బ్రహ్మచర్యము – సౌందర్యవతి యగు స్త్రీ కనిపించినను వికారము లేక యుండుట.

435. పరమాత్మునికి శిరము ఆకాశము. కటిప్రదేశము భూమి. పాదములు పాతాళము. ముఖము అగ్నిహోత్రము.

నేత్రము సూర్యుడు. కర్ణములు దిక్కులు. ఊర్పులు ఉపనిషత్తులు. నాలుక వరుణుడు. మనస్సు చంద్రుడు. ఉదరము బ్రహ్మాండము. నాభి స్వర్గము. శుక్లము జలము. శల్యములు పర్వతములు. రోమములు ఓషధులు. హృదయము ధర్మము. గతి కాలము. ఆత్మ పరమాత్మ.

436. జీవుడను వృషభము సంసారమను మహారణ్యమున ఛాయ యను చెట్టుక్రింద మోహము అను నీడలో నిద్రించుచు కోరికలను త్రాళ్ళచే బంధింపబడుట వలన వ్యాధులను కీటకములు కరచుచున్నవి. కళంకభూయిష్ఠమైన అంధకారబంధురమైన యింద్రియభోగానుభవమునకై పాపకర్మములను బురదయందు పొరలుచు సత్సాంగత్యప్రభావముతో సంసారమహారణ్యమును దాటి విజ్ఞానమును సాధించి యథార్థమును గ్రహించుటయే యాత్మసాక్షాత్కారము.

'దృఢకాయుడవగు నీవు భిక్షాటనమేల చేసెదవు? కృషి చేసి జీవింపరాదా' యని యొక కర్షకు డడుగ బుద్ధు డిట్లనెను. "అహింస, సత్యము, అస్తేయము, అపరిగ్రహము, బ్రహ్మచర్యము, సుశీలములే నా క్షేత్రము. దృఢసంకల్పము అను ఎద్దులతో దున్ని యహింస యను విత్తనమువేసి ధైర్యమను మేఘుని సహాయముతో శాంతియను వర్షమును బుద్ధియను కాలువద్వారా ప్రవహింపజేయుచు శక్తి యను పంట పండించుటకొఱకు భ్రమలు అను కలుపుమొక్కలు తీసివేసి నిర్వాణము అను పంట ననుభవించుచుంటి" ననెను. అంత నాగృహస్థు నీ పంటయే సత్యము. నిత్యము. మా పంటకు అతివృష్టి, యనావృష్టి యను రెండు దోషములు గలవు. మీ పంట కా దోషములు లేదని పలికి క్షీరాన్నము సమర్పించెను. బుద్ధునిది సమదృష్టి. ఆ రైతుది విషమదృష్టి.

437. మదించి పర్వెత్తుచుండు మదపుటేనుగును చేతులతో ఆపుటకు ప్రయత్నించువాడు అజ్ఞాని, వివేకమను అంకుశముతో ఆపువాడు జ్ఞాని.

438. యంత్రముయొక్క ప్రధానచక్రమునకు గల బెల్టు తొలగించుచో చిన్నచక్రము లాగిపోవును. మనస్సును ప్రపంచ జిజ్ఞాసనుండి బ్రహ్మజిజ్ఞాసకు మరల్చుచో, సంసారచక్ర మాగి పోవును.

439. ఇష్ట దైవమును తనకంటె వేరుగా భావించుట ప్రతీ కోపాసన. తనకంటె అభిన్నముగా భావించి పూజించుట అహం గ్రహోపాసన.

440. ద్వేషించినవారిని భూషించువాడు, తిట్టిన వారిని దీవించువాడు మహాత్ముడు.

441. తుమ్మెద మొగలిపువ్వు పరిమళమును ఆఘ్రాణించి వచ్చుచుండ మొగలి "నాయందు మకరందము లేదు. ఆశించి వచ్చుచో నీశరీరము దుమ్ము దుమ్మగును, బొమ్మ"ను చున్నది." లోభివాని ఐశ్వర్యము, అట్టహాసము చూచి భ్రమ పడుచో దుఃఖమేగాని సుఖముండదు.

442. స్వానుభవములేక వేదాంతమును చెప్పుట, సూర్యు డస్తమించిన తరువాత హిమాలయశిఖరమును ప్రమిదె దీపపు కాంతిచే చూపించుట వంటిది.

443. భక్తుడు భగవంతునియందు భక్తివిహీనుడు విషయ ములయందు ఆసక్తి గలిగి యుందురు.

444. వ్యామోహమును విడువనివానికి సంసారమును విడిచి అరణ్యమం దున్నను అశాంతియె. వ్యామోహమును విడిచినవానికి సంసారమందున్నను ప్రశాంతియె.

445. తత్త్వవేత్త తనకాలమంతయు ధ్యానమందే గడపును.

446. ఎంతవరకు జాతి మత కులభేదములు కన్పించునో అంతవరకు దేహాభిమానముండును. నేను పరమాత్మనని తెలిసుచో అభిమానముండదు.

447. కోరికలు విస్తరించునది శిరస్సునందైనను అది పుట్టుచోటు హృదయమే. హృదయమునుండి ఒక అణువు బయల్వెడలి శిరస్థానముచేర మెదడు దానిని విస్తరించి చూపును.

448. వ్యర్థప్రసంగములు చేయుటవలన ఆయువు క్షీణించును. మనము చేయు పుణ్యాపాపముల ప్రభావము నీడవలె మనలను వెంబడించుచుండును.

449. మేకపిల్ల బావిపై దట్టముగా మొలచిన లేతగడ్డిని చూచి పరుగునవచ్చి బావిలోపడును. అజ్ఞాని విషయముల కాశించి అధోగతి జెందును.

450. జితేంద్రియుడు లక్ష్మణుడు, అతీంద్రియుడు శ్రీరాముడు. లక్ష్మణుడు శేషాంశ, శ్రీరాముడు విష్ణ్వంశ వారి మైత్రికిదేకారణము.

451. జనులకు ధనము, ఏనుగులకు దంతములు, చెట్లకు ఫలములు, స్త్రీలకు అందము, జంతువులకు చర్మము, చిలుకలకు ముద్దుపల్కులు శోభను కల్గించును, ప్రమాదమును కల్గించును.

452. రాజులకు నీతియు మంత్రులకు యోచనయు, గురువులకు జ్ఞానము, సతులకు మానము ముఖ్యము. ఇవి కల్గుచో రాణించెదరు. లేనిచో క్షీణించెదరు.

453. రసగ్రహణశూన్యులైన అవివేకులకడ పెద్దల వాక్యములు వ్యర్థములగును.

454. దెబ్బగలచోట దెబ్బయు ఆపదలయందు వైరమును కష్టములపై కష్టములు వచ్చుచుండును.

455. అజ్ఞానులు భోగపరాయణులై యుందురు, జ్ఞానులు మోక్షపరాయణులై యుందురు.

456. జీవించుటకు తినువాడు ముక్తుడు; తినుటకే జీవించువాడు బద్ధుడు. భక్తుడు, జ్ఞాని, ద్వేషభావము లేనివారై యుందురు. వారు అందరిని ప్రేమించెదరు. ద్వేషమేరూపములో నున్నను వాడు భక్తుడుగాడు, జ్ఞానిగాడు.

457. సాధువులు మాటలతోకాక క్రియలతో సహాయము చేయుదురు.

458. త్రిలోకములను జయించిన హిరణ్యకశిపునికంటె, కైలాసపర్వత మెత్తిన రావణునికంటె, రావణుని జయించిన వాలి కంటె ఇంద్రియనిగ్రహము గలవాడు బలవంతుడు.

459. వ్యక్తియనగా అవ్యక్తమైనపరమాత్మను దెలియు వాడే.

460. గౌతమబుద్ధుడు దుఃఖనివృత్తి; సుఖప్రాప్తి అవ్యక్తమైన భగవంతుని వలనగాక వ్యక్తమైన ధర్మమువలన కలుగునని స్పష్టముజేసెను.

461. ఇంద్రియ నిగ్రహము గలవారి శక్తి ఊర్ధ్వముఖమై ప్రజ్ఞాజ్యోతిగా పరిణమించును, ఇంద్రియలోలునిశక్తి అధోముఖమై అంధకారముగా పరిణమించును. ఇంద్రియ నిగ్రహము ఆయువును వృద్ధిజేయును. ఇంద్రియలోలత ఆయువును క్షీణింపజేయును.

462. బిడ్డ పుట్టగానే ఏడ్పు ప్రారంభించును. బిడ్డ ఏడ్వక పోయినచో తలిదండ్రులైనను ఏడ్చెదరు. మానవుడు ఏడుపుతో పుట్టి ఏడుపుతో పెరిగి సంపాదనకొరకు నిరంతర మేడ్చుచుండినను దీర్ఘప్రయాణకాలమందు నవ్వుచు పోవలయును.

463. మనుష్యునకు శరీరము బంధమునకు కారణము. ఐనప్పటికి అన్ని జన్మములలో మనుష్యుని జన్మము ఉత్కృష్టము. పశువు ప్రకృతికి స్వాధీనమై దాని దయమీద ఆధారపడును. మానవుడు ప్రకృతిని స్వాధీనమొనర్చుకొని తన ఇష్టప్రకారము త్రిప్పును. జననము అజ్ఞానికి బంధకారణమగును. జ్ఞానికి మోక్ష కారణమగును.

464. ఋగ్వేద మెరిగినవానిని హోత యనియు, యజుర్వేదమెరిగిన వానిని అధ్వర్యుడనియు, సామవేద మెరిగినవానిని నుద్గాత యనియు, నీ మూడువేదములు తెలియువానిని బ్రహ్మ యనియు చెప్పుదురు. వీరిని ఋత్విక్కు లందురు.

465. చెప్పుటకంటె చేసిచూపించుట మంచిది. ప్రతి మానవునియందు గంభీరమగు దివ్యశక్తిగలదు. దానిని బహిర్గతము చేయుటయె యోగసాధనకు ముఖ్యాశయము.

466. ఆనందము వెలుపల నున్నదని మనస్సు బాహ్య సుఖములకొరకు పర్వెత్తుచుండును. ఆనందము వెలుపలలేదనియు నేను సచ్చిదానందస్వరూపుడననియు సమదృష్టిగలవాడు గ్రహించును.

467. ఉపాసన అదృష్టఫలము, జ్ఞానము దృష్టఫలము. ఉపాసకులు క్రమముగా ముక్తులగుదురు. జ్ఞాని సద్యోముక్తుడగును.

468. జీవితము దీర్ఘస్వప్నము వంటిది. అది గారడివాని మాయవంటిది.

469. కామవిజయమునకు సజ్జనసహవాసము చేయవల యును. లోకమున సజ్జనులు కలరు. వారి సహవాసము లభించుట దుర్లభము. పండితులలో కొందరు కామమును జయించినవారు గలరు. కాని వారు కాంచనదాసులై పరమలోభులై యున్నారు. కామినీకాంచనములు, కీర్తిప్రతిష్ఠలు కోరనివారే సజ్జనులు.

470. దండపాణిభయము పోవలె నన్నచో కోదండపాణిని ఆశ్రయింపుడు.

471. బ్రహ్మజిజ్ఞాసగలవాడు, శాస్త్రోక్త కర్మానుష్ఠాన ఫలము నతిక్రమించి పోవుచున్నాడు.

472. మనము అన్నముతో జీవించుటలేదు. ఆయుష్య ముతో జీవించుచున్నాము.

473. చక్రవర్తులు సన్న్యాసుల నాశ్రయించి ప్రశాంతి నొందుచున్నారు.

474. ఇంద్రియములను జయించిన లక్ష్మణుడు ఇంద్ర జిత్తును జయించెను.

475. మోక్షము త్రిలోకములయందు లేదు, నిర్మలాంతః కరణమే మోక్షము.

476. లక్ష్యము, లక్ష్యసాధన పవిత్రముగా నుండవలెను.

477. అన్నిటికంటె విలువయైనది కాలము.

478. ఆశలేనిచోట యత్నముండదు.

479. అన్నిబంధములకంటె వివాహబంధము దృఢమైనది.

480. ప్రపంచమను పుస్తకభాండాగారము నుండి నేర్చు కొనవలసిన విషయము లనంతములు.

481. మనస్సను సరోవరమునుండి కోర్కెలను తరంగ ములు నిరంతరము వచ్చుచుండును.

482. విద్యవలన జ్ఞానమను పుష్పము వికసించి విజ్ఞానమను ఫలమునిచ్చును.

483. మనస్సు స్వాధీనమగుచో మిత్రుడగును. లేనిచో శత్రువగును.

484. క్రోధమను నిత్యశత్రువు వెలుపలలేడు, నీయందే గలడు.

485. ఏపనినైనను సగముచేసి విడిచిపెట్టవలదు.

486. భక్తిలేనిచో జ్ఞానము కలుగదు. భక్తియను పుష్పము నుండియే జ్ఞానఫలము కల్గును. భక్తియొక్క ఘనీభావమే జ్ఞానము.

487. జీవితనాటకములో జననమరణములు రెండంకములు.

488. అధ్యాత్మ విషయములలో వాదనలు పనికిరావు. అవి నిన్ను భ్రష్టునిచేయును.

489. ప్రశాంతము కల్గి మాటలాడువానికి విజయము సిద్ధించును. నిష్కపటియైన భక్తుడు ప్రపంచమునకు చక్రవర్తివంటివాడు.

490. అన్నికోరికలకంటె ప్రబలమైనది కామేచ్ఛ.

491. దైవప్రేరణవలన మహర్షులకు విషయవాంఛ కలుగుచుండును.

492. అల్పులు వారి చిత్తవృత్తి ననుసరించి మహాత్ములను విమర్శించుచుందురు.

493. ఆకలిగలవాడు భుజియించిన తృప్తికలుగును. సద్గురువు నాశ్రయించిన బ్రహ్మవిద్య పట్టుబడును.

494. కలిమిగలిగియుండి శక్తికొలది ధర్మముచేయనిచో పాపము సంభవించును.

495. అన్ని వస్తువులకంటె విలువగలవాడు తానై యుండియు మూర్ఖుడు తన వస్తువులకే విలువ నిచ్చుచుండును.

496. వీర్యవంతునకే బ్రహ్మచర్యముగాని నపుంసకునకు బ్రహ్మచర్యమే లేదు. కర్మనాచరించువాడు కర్మఫలము విడువ గలడు. సోమరి విడుచుట కేమున్నది ?

497. ఆత్మసాక్షాత్కారమునకు ప్రతికూలమైన ప్రపంచాధిపత్యము నిష్ప్రయోజనమని శంకర రామానుజ మధ్వ ఆచార్య త్రయమును, క్రీస్తు, మహమ్మద్ ప్రవక్తలు చేసిన తత్త్వోపదేశములు భారతీయుల, క్రైస్తవుల, మహమ్మదీయుల దృష్టిపథము నుండి అదృశ్యమైనవి. పరమార్థమున కడ్డువచ్చుదానిని దేనినైనను విడువవలయును. తల్లిని భరతుడు, తండ్రిని ప్రహ్లాదుడు, గురువును భీష్మాచార్యుడు. భార్యను రామానుజుడు, భర్తను మీరాబాయి విడిచినటుల విడిచిపెట్టి ప్రశాంతి కల్గియుండవలెను.

498. సంసారమను అశ్వత్థ వృక్షమునకు పుణ్యపాపములు బీజములు. విషయవాసనలు వేళ్లు. ఇంద్రియములు కొమ్మలు. వాత పిత్త శ్లేష్మములు బెరడులు. ఆశలను ఆకులు కోరికలను చిగురులు కలిగి క్షణభంగురమైనదే సంసారవృక్షము.

499. తనదుర్గుణములను ఇతరుల సుగుణములను తెలుపువాడుత్తముడు. తనసుగుణములను ఇతరుల దుర్గుణములను తెలుపువాడు మధ్యముడు. తనయందు లేని సుగుణములను ఇతరులయందు లేని దుర్గుణములు తెలుపువా డధముడు. తనక్షేమము, పరులకు కీడుగోరువాడు అధమాధముడు.

500. చెట్టునుండి పరిపక్వమైన ఫలము రాలును. ఆయువు తీరినవాడు మరణించును.

501. టెంకాయలు బ్రద్ద లవుచున్నవి, అజ్ఞానము బ్రద్దలు కావడములేదు.

502. బండను కొండమీదనుండి క్రిందకు తోయుట సులభము, పైకెక్కించుట కష్టము. ఇంద్రియ నిగ్రహము కష్టము, లోలత్వము సులభము.

503. పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరి యనువాక్కులు నాలుగు విధములు. పరావాక్కు నాభినుండియు, పశ్యంతీవాక్కు హృదయమునుండియు, మధ్యమవాక్కు కంఠమునుండియు, వైఖరీవాక్కు నాలుకనుండియు బయలుదేరును.

504. కొబ్బరిమొక్కకు కొద్దిగా నీరుపోయుచో గొప్పదై కృతజ్ఞత కలిగియుండి ఆజన్మాంతము ఫలములొసంగును. అట్లే సాధువులు కొలదిగా తీసికొని గొప్పగా నిచ్చెదరు. కొబ్బరికాయ ఆకలిదప్పులను పోగొట్టి యారోగ్యమునిచ్చును. మహాత్ములు ఆకలిదప్పులులేని యమృతమే ప్రసాదించెదరు.

505. అన్నింటికన్న విశిష్టమైన వస్తువు నెఱిగి బోధించు వాడే వసిష్ఠుడు.

506. తాను దుర్మార్గుడై యుండి యితరులను విమర్శించుట తన కంటియందు దూలముంచుకొని యితరుల కంటియందు నలుసు కలదని చెప్పుటవంటిది.

507. నరుడు చెడుదినములలో దుష్కర్మములు చేయు చుండును. మంచిదినములలో సత్కర్మలు చేయుచుండును.

508. ప్రపంచ జిజ్ఞాసనుండి బ్రహ్మ జిజ్ఞాసకు మరలుచో సంసారచక్ర మాగిపోవును.

509. పాయసములోని గరిటెనుజూచి యొకడు "మాధుర్య మును నీవు ముందనుభవించుచుంటివిగదా" యన గరిటె యత

నితో "నేను సాధనమునేగాని, యనుభవము మీదే" యనెను. ఇంద్రియములు సాధనములేగాని యనుభవము మనస్సుదే.

510. దుఃఖనివృత్తికి సుఖప్రాప్తికి ప్రయత్నముజేయుము. సిద్ధింపనిచో విచారపడవలదు, ప్రయత్నము చేయకపోవుటయే అవివేకము.

511. న హి ప్రతిజ్ఞా మాత్రేణ అర్ధసిద్ధిః ? మనుజుడు ప్రతిజ్ఞచేసినంతమాత్రమున కార్యము సిద్ధింపదు. తీవ్రప్రయత్నము చేయవలెను.

512. విద్యకొరకు బ్రహ్మచర్యము, సంసారరక్షణకొరకు గృహస్థాశ్రమము, విశ్వమానవ కల్యాణముకొరకు సన్న్యాసము స్వీకరించుచుందురు.

513. ప్రకృతియందుగల వస్తువులలో రంగులు కన్పించును. అవన్నియు అగ్నిలోవేయుచో భస్మమగును. ఆ భస్మమును తిరిగి అగ్నిలో వేయుచో స్వచ్ఛమగు తెలుపువచ్చును. దానికి మార్పురాదు. అందువలన విభూతిని ధరించుట శ్రేయోదాయకము.

514. (1) సత్॥ కార్యరూపముగా కనిపించెడి లోకము. అసత్॥ ఈ కనిపించెడి లోకమునకు కారణమైన అవ్యక్తత్వము. ఈ రెండింటికిని (2) చిద్రూపమైన జీవునకు అచిద్రూపమైన జగత్తునకు నీ రెండింటికిని పరమైనవాడు పరమాత్మ.

515. విభూషణం మౌనమపండితానామ్. మూర్ఖుడు సభలో మాట్లాడకుండుటయే భూషణము.

516. కేవలము శాస్త్రజ్ఞానము కలవానికంటె పరిశుద్ధజీవనము గలవాడు గొప్పవాడు.

517. సాధన స్థితిలో కామ్యకర్మలయం దాసక్తియున్నను సిద్ధస్థితిలో ఆసక్తియుండదు.

518. అజ్ఞానికి సంసారమే ఆనందము, అలవాటుపడిన వానికి కారాగారమే ఆనందము.

519. జిహ్వేంద్రియము స్వాధీనమగుచో సమస్త ఇంద్రియములు స్వాధీనమగును.

520. ఇంద్రియారాముని జీవితము వ్యర్థము. ఆత్మారాముని జీవితము సార్థకము.

521. భోగములలో రోగములున్నవి.

522. ఇచ్చిన దానమును వచ్చిన గౌరవమును మఱువనిచో చిత్తశాంతి కలుగదు.

523. సమాజమున్నచోటనే సమస్యలుండును.

524. ఆత్మస్తుతి పరనింద అధముల లక్షణము.

525. మొదటకింకరుడవగుచో తదుపరి శంకరుడవగుదువు.

526. అధికప్రసంగము ఆయుఃక్షీణము.

527. ఆయుష్యమునకు, వైద్యుడు కర్తగాడు.

528. మణులనేకములైనను సూత్రమొక్కటే, మానవులనేకులైనను సూత్రధారి ఒకడే.

529. జీవితము భోగమువలనగాక యోగమువలన ప్రకాశించును. మనుష్యజన్మము మహోత్కృష్టము, అది లభించునపుడే సార్థకము గావించుకొనుము.

530. ఆధులన మనోవ్యధలు, వ్యాధులన శరీరవ్యధలు.

531. ఉప్పుబొమ్మ సముద్రములోతు తెలియుటకు ప్రయత్నించి సముద్రమైనయటుల పరమాత్మను ధ్యానించువాడు పరమాత్మయగుచున్నాడు.

532. ఆస్తికతయే భారత జీవనస్రవంతికి ఆధారము, అది లేని సంఘసంస్కరణలు మృతప్రాయము.

533. వీరుడు బాహ్యశత్రువులను నురుమాడును, మహాత్ముడు అంతర్గత శత్రువులను చించి చెండాడును.

534. కూకటివేళ్లు నరకబడినవృక్షము ఎంతపెద్దదైనను ఆకులు పుష్పములు ఫలములు రాలిపోవును, ఎంతగొప్పసాధువైనను శీలము కోల్పోవుచో పతనముపొందును.

535. ద్వేషమున్నంతవరకు ముముక్షువునకు విజయము సిద్ధింపదు. ముముక్షువు ఎవరిపైనను ఆగ్రహింపడు, ఎవరికి భయపడడు.

536. ద్రావకములో వేసిన కలితీబంగారము శుద్ధమగును. సద్గురువు నాశ్రయించువాడు ముక్తుడగును.

537. మనస్సు నిరంతరసాధనవలన స్వాధీనమగును.

538. విషయాసక్తియె బంధము విషయవిరక్తియె మోక్షము.

539. పర్వతశిఖరమున నున్నవానికి క్రింద హెచ్చుతక్కువలు కన్పింపవు, బ్రహ్మదృష్టిగలవానికి రూపనామములు గోచరింపవు.

540. అల్పుడు తన్ను పరులు నిందించినచో వారియెడల శత్రుభావమును చూపును. మహాత్ముడు పరులు నిందించినచో నది తన పురాకృత కర్మఫలమని మిత్రభావముతో నుండును.

541. ఎదుటివారిలో మంచిగ్రహించుచో సన్మార్గుడవగుదువు, దోషములనే పరిగణించుచో దుర్మార్గుడవగుదువు.

542. కన్నులున్నవానికే సూర్యదర్శనము, జ్ఞానముకలవానికే ఆత్మదర్శనము.

543. నిరుత్సాహముగలవారికి దారిద్ర్యము, ఉత్సాహముగలవానికి ఐశ్వర్యము కలుగుచుండును.

544. ఐహికానందములన్నియు బ్రహ్మానందములో ఒక అణువుమాత్రమె.

545. మహాత్ములకు కష్టము లధికమగుచున్నకొలది సత్యము వృద్ధియగుచుండును.

546. ఏబాధ్యతయు వహించవలదు. అది నీబుద్ధివృత్తికి ఆవరణగా పరిణమించును. అందువలన ప్రశాంతిలేక అశాంతి పాలగుదువు.

547. తీయమామిడిచెట్టును సమీపించి పరిపక్వములైన ఫలములను విడిచిపెట్టి ఆకులునమలుట ఎటువంటిదో పరమార్థమునకు విముఖుడవై అర్థమునకు సుముఖుడవగుట అటువంటిది.

548. దారము ఆధారముతో పూలమాలయున్నటుల భగవంతుని ఆధారముతో ప్రపంచమున్నది.

549. దేవతలకు భోగాధికారమేగాని యోగాధికారములేదు. యోగాధికారము ఒక మానవజన్మకే.

550. తెలుపు సబ్బులోనిదికాదు. బట్టలోనిదే. ఆనందము వెలుపలలేదు, నీ హృదయమందే.

551. ధనము దానిని ఆర్జించువిధము పవిత్రత కలిగి యుండవలెను.

552. పుణ్యము నిన్ను రక్షించును, పాపము నిన్ను శిక్షించును. నీవుచేయు సత్కర్మలు దుష్కర్మలు భగవంతుడు చూచుచుండునని తెలియుము.

553. కష్టములను సహించుటయె తపస్సు.

554. మనస్సుయొక్క ఏకాగ్రత అంతరంగతపము ఇంద్రియ నిగ్రహము బహిరంగ తపము.

555. దేహదృష్టి కలిగియుండుట అజ్ఞానము, ఆత్మదృష్టి కలిగియుండుట విజ్ఞానము.

556. గురువు దీపమువంటివాడు. భగవంతుడు సూర్యునివంటివాడు. ప్రయత్నముజేసి గుర్వనుగ్రహము సంపాదించుచో ప్రయత్నములేకయె భగవదనుగ్రహము కలుగును.

557. ప్రతివానిని నీవెవరవని అడుగకముందు నేనెవడనని విచారించుకొనుము.

558. ద్రోహచింతలేక యవలంబింపబడు ఏవృత్తియైనను మహోన్నతమే యగును.

559. ధర్మముకొఱకు పడినకష్టములు కొంతకాలముండును, దానివలని కీర్తి శాశ్వతముగానుండును. అధర్మముతో ఆర్జించిన ధనము కొంతకాలముండును. దానివలని అపకీర్తి శాశ్వతముగానుండును; కావున ధర్మమునే ఆశ్రయింపుము.

560. దేహమును విషమదృష్టితో చూచిన మలభాండము, సమదృష్టితోజూచిన అమృతభాండము.

561. అజ్ఞాని నాకన్నియు తెలియు నను, తానెవరో తెలియడు.

562. అన్నిపనులకు తీరుబాటుండును. తన్ను తెలిసికొనుటకు తీరుబాటుండదు.

563. కండబలముకంటె గుండెబలముగలవాడు అధికుడు.

564. కళ్లెములేని గుఱ్ఱము, పగ్గములేని ఎద్దు ఇంద్రియనిగ్రహములేని జీవితము నిరుపయోగము.

565. చితి చచ్చినవానిని దహించును, చింత బ్రతికినవానిని కాల్చును.

566. తత్త్వదృష్టిగల గురువును పరమాత్మభావముతో చూడుము.

567. విద్యార్థికి పరీక్షలు లక్ష్యము, మానవునకు పరమార్థము లక్ష్యము.

568. శ్రద్ధ యెంత అధికమైన సిద్ధి అంత దగ్గరగును.

569. స్త్రీలైనను పురుషులైనను పరమార్థదృష్టిగలవారే సధవలు లేనిచో విధవలే.

570. పొట్లకాయ లేతగనున్నపుడే రాయికట్టినచో వంకరలుపోక తిన్నగా నుండును. బాల్యమందే బిడ్డలకు క్రమశిక్షణ గరపుచో నేర్పుతోనుందురు.

571. నిర్మమము ఐనప్పుడే మనస్సు నిర్మలమగును.

572. గాఢసుషుప్తిలో జగద్వ్యవహారము గోచరించదు. బ్రహ్మానుభవముకలవానికి మరణవేదన కనుపింపదు.

573. అనారోగ్యముగల లక్షాధికారికంటె, ఆరోగ్యముగల భిక్షాధికారి అదృష్టవంతుడు.

574. అజ్ఞానియగు కోటీశ్వరునికంటె జ్ఞానియగు బీదవాడు అధికుడు.

575. కులములేనివాడు కలిమితో ప్రకాశించును.

576. దుర్లభమగు మానవజన్మ కలుగుట అవయవ లోపము లేకుండుట జ్ఞానముకల్గియుండుట భగవదనుగ్రహమే.

577. పరమార్థమును విస్మరించినవాడు స్వర్గమర్త్య పాతాళములలో చక్రమువలె జననమరణముల పరిభ్రమించుచుండును.

578. కడుపుచిచ్చు, కామాగ్ని, క్రోధాగ్ని నరుని దహించు త్రేతాగ్నులు.

579. అర్జునునకు కృష్ణ సారథ్యమువలన సుఖము, కర్ణునకు శల్యసారథ్యమువలన దుఃఖము కల్గెను, ఆశ్రయించినదానిని బట్టి ఫలితము కల్గుచుండును.

580. ఆస్తికత, గంభీరత, ప్రశాంతతగలవాడే బ్రాహ్మణుడు. పరాక్రమము, కార్యదక్షత, రాజనీతి కుశలతగలవాడే క్షత్రియుడు. సమయస్ఫూర్తిగా మాట్లాడగల ధీశాలియే వైశ్యుడు. శరీరబలము పైననే ఆధారపడువాడు శూద్రుడు.

581. పశుత్వమునుండి మానవత్వమునకు మానవత్వము నుండి దైవత్వమునకు పయనించువాడే మహాత్ముడు.

582. తనసుఖమునుచూచుకొను స్వార్థపరుడు శూద్రుడు. ధర్మబద్ధమైన సంసారమునుకోరువాడు వైశ్యుడు. జితేంద్రియుడై ఆత్మరాజ్యమును స్థాపింప ప్రయత్నించువాడు క్షత్రియుడు. సద్గుణ సంపన్నుడై ఆత్మసాక్షాత్కారముగలవాడు బ్రాహ్మణుడు.

583. ఆకసమందు గల నక్షత్రములను భూమియందుగల ఇసుకను సముద్రమందుగల నీటిబిందువులను లెక్కవేయుట సాధ్యమగునేమోగాని మాయను తెలియుట అసాధ్యము.

584. మేఘములు నదులు తటాకములు ఫలవృక్షములు పరోపకారమెట్లుచేయునో స్వార్థరహితులైన సత్పురుషులట్లు లోక కల్యాణముకొరకే కృషిచేయుచుందురు.

585. పసిపిల్లలకు విషయానందము తెలియనటుల లౌకికునకు బ్రహ్మానందము తెలియదు.

586. తన్నుతాను తెలిసికొనిన తగవులుండవు, తన్నుతాను తెలియక ఎన్ని తెలిసికొన్నను తగవులుండును. తన్నుతాను తెలియువాడే మహాత్ముడు.

587. మనస్సు ఇంద్రియములకు వశమైనచో సంసార ప్రాప్తి. బుద్ధికి వశమైనచో ఆత్మప్రాప్తి.

588. మనస్సుతోకూడినవాడు జీవుడు, మనస్సుదాటినవాడు ఈశ్వరుడు, ఊరకున్నవాడు దేవుడు. ఊగులాడువాడు జీవుడు.

589. అందరు ఏదో ఒకదానికి భక్తులయ్యేయున్నారు. భార్యకో బంధువులకో పుత్రులకో డబ్బునకో భక్తులయ్యే యున్నారు. అందరు కామభక్తులేగాని రామభక్తులు కోటికొకడు.

590. నీయుక్తులు కొన్నియెడల సాగును. మృత్యువుదగ్గర సాగవు.

591. ఆగ్రహముకలిగి క్రిందమీ దెరుగక అరచెడువాని కంటె ఓంద్రపెట్టు గాడిదమేలు.

592. లౌకికులు కనడము ప్రధానమందురు, జ్ఞానులు వినడము ప్రధానమందురు.

593. పరాక్రమవంతున కొకదినమే మరణము. పిరికివంద ప్రతిదినము మరణించుచుండును.

594. ప్రమాత - తెలియువాడు, ప్రమాణములు - తెలియుటకు సాధనములైన ఇంద్రియములు, ప్రమేయము - తెలియబడెడి విషయము, అప్రమేయము - యే ప్రమాణముచేత తెలియుటకు వీలుగానిది.

595. సత్కర్మలే బీజములు, భక్తియే వర్షము, ప్రయత్నమే నాగలి, ధర్మమే మేడి, వివేకమే యెద్దులు, మనస్సే కళ్లెముగా భ్రమ నాశమను సేద్యముచేయుచో నిత్యానందమను పంట ననుభవింప వచ్చును.

596. వక్త, తన ఉపన్యాసములో, అనేక నిదర్శనములను చూపుచు వినువారు ప్రశ్నించకుండ సమయోచితముగ విషయములను వివరించుటయందు ప్రజ్ఞగలబుద్ధిని ప్రతిభ యందురు.

597. పసికందును వృద్ధురాలిని చూచినపుడు వికారము గలుగదు. నవయౌవనముతో విలసిల్లు సౌందర్యవతిని గాంచినను మహాత్ములు నిర్వికారముగ నుందురు.

598. శరీరమను భూమియందు మనస్సను పుట్టలో కోరికలను పాములు నిరంతరము బుసలుకొట్టుచుండును. పరమాత్మ ధ్యానమే ప్రశాంతిని గల్గించును.

599. తుమ్మెదలు సుగంధమును,వినయవంతుని లక్ష్మియు, పల్లపునేలను నీరును చేరునటుల బ్రహ్మలిఖితము ననుసరించి బుద్ధిపుట్టుచుండును.

600. ప్రయత్నశీలురను లక్ష్మి వరించును.

దయగలవాని హృదయమే దైవమందిరము.

పంచపాండవులే పంచేంద్రియములు, జీవుడే ద్రౌపది, ఆమె మానసంరక్షణకొరకు, ఆరవవాడగు కృష్ణుని ప్రార్థించెను.

మనుజునకు దేనియందు అధికమగు ప్రేమయుండునో దానియందే మిక్కిలి దుఃఖముండును.

సమిష్టిప్రార్థనలు ప్రపంచశాంతికి తోడ్పడును.

శ్రీకృష్ణుడు గోపికల అభిమానమను ఘటమును పగుల గొట్టి హృదయమను వెన్నను దొంగిలించెను.

అర్జునుడు సత్యధర్మజిజ్ఞాసువై భగవంతునికొరకేడ్చుట వలన అతని విషాదము యోగముగా పరిణమించెను. నశ్వరపదార్థముల కేడ్చుచో రోగముగా పరిణమించెడిదే.

## బ్రహ్మస్వరూపము

పరిపూర్ణ మనాద్యంత మప్రమేయ మవిక్రియమ్
సద్ఘనం చిద్ఘనం నిత్య మానంద ఘనమవ్యయమ్
ప్రత్యగేకరసం పూర్ణమనంతం విశ్వతోముఖమ్
అహేయ మనుపాదేయ మనాధేయమనాశ్రయమ్
నిర్గుణం నిష్క్రియం సూక్ష్మం నిర్వికల్పం నిరంజనమ్
అనిరూప్య స్వరూపం యన్మనో వాచామగోచరమ్
సత్సమృద్ధం స్వతస్సిద్ధం శుద్ధం బుద్ధ మనీదృశమ్
ఏకమేవాద్వయం బ్రహ్మ నేహనానా స్తి కించన.

పాలలో వెన్నవలె, నువ్వుగింజలో నూనెవలె, చెఱకు గడలో రసమువలె నంతట నిండియున్నది గావున బ్రహ్మమన బడును. అది పరిపూర్ణమైనది. ఆద్యంతములు లేనిది. దృశ్య మగు ప్రపంచమునకు తాను ద్రష్టయై యే ప్రమాణముల వలనను నిట్టిదని నిర్ణయింపవీలుగానిదగుటచేత నప్రమేయు డనబడును. ప్రపంచము మార్పుగలది. తాను మార్పులేనివాడగుటవలన నిర్వి కారుడనబడును. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, అగ్ని యతని ప్రకాశమువలననే వెలుగుచుండ తాను స్వయంప్రకాశుడై నాశరహితుడగుటవలన నవ్యయుడనబడును. త్రికాలములందును ప్రకాశించు నానందమే స్వరూపముగ గలవాడగుటవలన సచ్చి దానంద స్వరూపుడగును. సత్యము, శుద్ధము, బుద్ధము స్వభావ సిద్ధములుగ గల పరబ్రహ్మమొక్కటియేగాని వేఱేదియు లేదని యుపనిషత్తులు ఘోషించుచున్నవి.

**ఆంధ్రప్రదేశము పశ్చిమగోదావరిజిల్లా పాలకొల్లు శ్రీకృష్ణాశ్రమ స్థాపకులగు నిశ్చలానందస్వామిచే విరచితమగు విశ్వజ్యోతి కావ్యము నాల్గవ అధ్యాయము సంపూర్ణము.**

---

# విశ్వజ్యోతి

## ఐదవ అధ్యాయము

## శ్రీవాసవీ కన్యకా జీవిత చరిత్రము

శ్లో. శ్రీమన్ కృపాజలనిధే కృతసర్వలోక
సర్వజ్ఞశక్త, నతవత్సల సర్వశేషిన్
స్వామిన్ సుశీల సులభాశ్రిత పారిజాత
శ్రీవేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే.

శ్లో. హృదయకమలమధ్యే సూర్యబింబాసనస్థో
నిఖిల భువనబీజం సృష్టిసంహారహేతుం
నిరతిశయ సుఖాత్మ జ్యోతిషాహం స్వరూపం
పరమ పురినివాసం చింతయేత్ ఆత్మమూర్తిం.

శ్లో. సప్త ప్రాకారమధ్యేసరసిజ ముకుళోద్భాసమానే విమానే
కావేరీ మధ్యదేశే మృదుతర ఫణిరాట్ భోగపర్యంకభాగే
నిద్రాముద్రాభిరామం కటినికటశిరః పార్శ్వ విన్యస్తహస్తం
పద్మా ధాత్రీకరాభ్యాం పరిచితచరణం రంగనాథం భజేహమ్.

ధర్మ సంస్థాపనార్థమై జన్మించిన శ్రీ వాసవికన్యక బాలనగరులను నిమిత్త మాత్రులుగా జేసికొని జగత్కల్యాణమునకై సకలోపనిషత్సారమును సంగ్రహముగా ప్రబోధించి తన యవతార ప్రయోజనము నెఱవేరినంత పరమేశ్వరునిట్లు ధ్యానించెను.

# శ్రీ వాసవీ పరమేశ్వర సాయుజ్యము

## దండకము

జయజయమహాదేవ! సర్వేశ! సర్వాంతరాత్మా! సమస్తాగమాతీత! విద్యాస్వరూపా! మహామేరుచాపా! లసత్తారకానాథ రేఖాకలాపా! జగత్సృష్టి సంస్థాపనోత్పాటనప్రాభవా! ఫాలనేత్రోద్భవాగ్నిచ్ఛటా దగ్ధచేతోభవా! సర్పకేయూర! హాలాహలాహార! సత్యామృతానంత తేజోమయా! నిర్వికల్పా! నిరాకార! నిత్యప్రకాశా! వియత్కేశ! సంఛేదితార్థ్యోఘ సంసారపాశా! విరాజజ్జటాజాల సంలగ్న ముక్తాఫలప్రాయ దివ్యాపగా గోపగాస్వర్ణ వీర్యాయవార్యా! దయాపాంగ! గౌరీ యుతార్ధాంగ! శంభో నమస్తే నమస్తే నమః.

కైలాసంబుననుండి నాకొఱకు నాకాంతుండు విన్నంప ది
క్పాలోత్తంసమ! నన్ను దోడుకొని పోవన్ వచ్చినావీవు నా
పాలన్ దైవమవోయి యింకకృపతో భద్రమ్ముగా నన్ను మా
కైలాసంబునజేర్చి నీవు యశమున్ గైకొమ్ము వైశ్వానరా!

అగ్నిహోత్రా! నీవలన ముప్పదిమూడుకోట్ల దేవతలు హవిర్భాగములుగొని సంతృప్తి నొందుచున్నారు. జీవకోట్లకు జఠరాగ్నిరూపమున నంతర్యామివై యాహారమును జీర్ణింపజేసి రక్షించుచున్నావు. నిన్ను వేదములు వేనోళ్ళ స్తుతించుచున్నవి. నన్ను స్వస్థానమునకు జేర్చుమని యగ్నిదేవుని స్తుతించి

సీ. ముఖచంద్ర మండలమ్మున దోచు నవ్వువె
న్నెలకాంతి గగన మండలము నిండ
కర్ణతాటంక సంఘటిత రత్నద్యుతుల్
కడువేడ్క సాంధ్యరాగంబు గాయ
నేలజీరాడు పెన్నెఱివేణి దిక్కుల
కటికచీకటులను గప్పుచుండ

శిఖితాపమున మేనజెన్నొందు ఘర్మంబు
కణములు చుక్కల కరణి మెరయ
బరమకల్యాణి శర్వాణి భ్రమరవేణి
సైకతశ్రోణి శ్రీమహాశంభురాణి
వదనజిత శశిబింబ శ్రీవాసవాంబ
యగ్నిలోనుండి సకలేశు నభవుచేరె.

శ్రీవాసవి తన హృదయమున బరమేశ్వరుని పదిలపఱిచి యంతర్ముఖయై యున్నంత పార్థివశరీర మదృశ్యమై చిన్మయ స్వరూపముతో నఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడైన పరమేశ్వరు నందైక్యమందెను.

## విరూపాక్షుని పట్టాభిషేకము

ఇటుల జగన్మాత శ్రీవాసవీకన్యయు, నూటరెండు గోత్రముల యార్యవైశ్యులును స్వస్థానములు చేరిరి.

విష్ణువర్ధన మహారాజ కుమారుడగు రాజరాజనరేంద్రుడు ఈ వృత్తాంతమంతయు దెలిసి తండ్రి మరణమునకంటె నతి దుఃఖప్రదమైన వైశ్యుల యగ్నిప్రవేశ వృత్తాంతము మనసును మిక్కిలి కలతనొందింపగా సైన్యముతో పెనుగొండకేతెంచి యూరి వెలుపల జతురంగబలములనుంచి కతిపయ పరివారసహితుడై యూరిలో ప్రవేశించి తండ్రికి తిలోదకముల నొసంగెను. విరూపాక్షుడు శ్రీరాజరాజనరేంద్రుని యాగమన వార్త నెఱింగి బాలనగరుల వెంటనిడుకొని మహారాజున కభివందనమొనర్ప రాజును విరూపాక్షుని యుక్త వచనముల నాశ్వాసపఱచుచు బాలనగరులకు స్వాగతము బలికి యిట్లనెను: "మీకు మా తండ్రిగారివలన తీఱని దుఃఖము కలిగినది. ఇదిమొదలు మీరు మాకు కప్పములు

చెల్లింప నక్కఱలేదు. సర్వతంత్ర స్వతంత్రమున మీ నగరముల బరిపాలించుకొనుడ''నగా రాజరాజనరేంద్రుని జూచి విరూపాక్షు డిట్లనెను: ''మహారాజా : మా పితృదేవతల చితాభస్మముల జీవ నదులయందు నిమజ్జన మొనర్పవలయును. మేము వచ్చుపర్యం తము పెనుగొండ పట్టణమును రక్షించుచుండుమ'నగా ప్రభు వందుల కంగీకరించెను. బాలనగరులు చితి భస్మములను గంగ, యమున మున్నగు పవిత్ర నదులందు నిక్షేపించిరి. గోభూతిల హిరణ్యాది మహాదానముల నొసంగిరి.

కాశినుండి పెనుగొండ పట్టణమునకు వచ్చునపుడు కొందఱు గంగోదక ఘటములను, కొందఱు శివలింగములను గొనివచ్చిరి. కొందఱు మార్గమధ్యమున బలు సేవలొనర్చిరి.

గంగోదకములను దెచ్చినవారు గంగకావిళ్ళవారనియు, శివలింగములను దెచ్చినవారు మైలారులనియు, వీరి కన్ని విధముల సేవలొనర్చినవారు వీరముష్ఠులనియు ప్రసిద్ధిపొందిరి.

కాశినుండి నూటరెండు శివలింగములను శ్రీవాసవి పేర నొక శివలింగమును తెచ్చి యొక్క వీధియందే ప్రతిష్ఠించిరి. ఆ వీధి నిప్పటికి ప్రజలు లింగాల వీధియందురు.

రాజరాజు తీర్థయాత్ర లొనర్చి వచ్చిన వైశ్యుల నాదరించి వారిచ్చిన ప్రసాదముల స్వీకరించెను. పెనుగొండకు విరూపాక్షుని పట్టాభిషిక్తుని గావించి స్వయముగ మణికిరీటము నతని శిరమున నుంచెను. పిదప రాజరాజుందఱివలన పూజలంది రాజమహేంద్ర వరము చేరెను. ప్రతిసంఘటనమును మనమేలుకొఱకే సంభవించు చుండును. అగ్నిప్రవేశ మొనర్చిన యార్యవైశ్యుల స్వచ్ఛంద

మరణములు జగత్ప్రఖ్యాతమై వారి చరిత్రములు సువర్ణాక్షరము లతో లిఖింపబడెను. వారి కీర్తి యాచంద్రతారార్కమయ్యెను.

శ్రీ వాసవీ ప్రబోధము విశ్వసాహిత్యమున ప్రథమస్థాన మలంకరించెను. శ్రీవాసవీచరిత్ర వ్రాసినవారికి, చదివినవారికి, విన్నవారికి నా పరమేశ్వరి యనుగ్రహము సంప్రాప్తమై యమృతత్వసిద్ధియు కలుగును.

ఆంధ్రప్రదేశము పశ్చిమగోదావరిజిల్లా పాలకొల్లు శ్రీకృష్ణాశ్రమ స్థాపకులగు నిశ్చలానందస్వామిచే విరచితమగు విశ్వజ్యోతి కావ్యము ఐదవఅధ్యాయము సంపూర్ణము.

ఓం తత్సత్

## లక్ష్మీస్తోత్రము - దండకము

శ్రీమద్రమా మానినీ! ఇందిరా ఇందిరా! కంధిరాణ్మందిరా! సారమందారకుందారవిందంబులన్ పుష్పబృందంబులన్ పెక్కుచందంబులన్ నీదుపాదారవిందంబులన్ గొల్తుతల్లీ!పురంధ్రీమతల్లీ! నతేంద్రాగవల్లీ! భళీ! తొల్లి బృందారకుల్ పూర్వబృందారకుల్ మందరాగంబు నిర్మందరాగంబునన్ రజ్జునాగంబుగా పాలవెల్లిన్ మథింపంగ రంగారు బంగారు పొంగారు సింగార మంగంబునన్ జెంగలింపంగ బృందారకీ బృందమందార కల్పేందు చింతామణీ సోదరీ ఖ్యాతి గైకొంచు జన్మించి మించున్ జిగిన్మించుమైసంచుతో నంచయానంబుతో భృంగగానంబుతో ముద్దుగెమ్మోవితో దమ్మిపూదావితో వచ్చి నీలాంబుదశ్యాము నార్తావనోద్దాము వక్షంబునన్ నిర్జరాళీ సమక్షంబునన్ జేరవే తల్లి! పూతానుకంపాసమేతా! నమస్తే నమస్తే నమః.

శ్రీరస్తు

# శ్రీ కన్యకాపరమేశ్వరీ

# అష్టోత్తర శతనామావళిః

ఓం శ్రీవాసవాంబాయై నమః
ఓం కన్యకాయై నమః
ఓం జగన్మాత్రే నమః
ఓం ఆదిశక్త్యై నమః
ఓం దేవ్యై నమః
ఓం కరుణాయై నమః
ఓం ప్రకృతిస్వరూపిణ్యై నమః
ఓం విద్యాయై నమః
ఓం శుభాయై నమః
ఓం ధర్మస్వరూపిణ్యై నమః 10
ఓం వైశ్యకులదేవతాయై నమః
ఓం సర్వాయై నమః
ఓం సర్వజ్ఞాయై నమః
ఓం నిత్యాయై నమః
ఓం త్యాగస్వరూపిణ్యై నమః
ఓం భద్రాయై నమః
ఓం వేదవేద్యాయై నమః
ఓం సర్వపూజితాయై నమః
ఓం కుసుమపుత్రికాయై నమః
ఓం కుసుమదంపతీవత్సలాయై నమః
ఓం శాంతాయై నమః
ఓం గంభీరాయై నమః
ఓం శుభాయై నమః
ఓం సౌందర్యనిలయాయై నమః
ఓం సర్వహితాయై నమః
ఓం శుభప్రదాయై నమః
ఓం నిత్యముక్తాయై నమః
ఓం సర్వసౌఖ్యప్రదాయై నమః
ఓం సకలధర్మోపదేశకారిణ్యై నమః
ఓం పాపహారిణ్యై నమః 30
ఓం విమలాయై నమః
ఓం ఉదారాయై నమః
ఓం అగ్నిప్రవిష్టాయై నమః
ఓం ఆదర్శవీరమాత్రే నమః
ఓం అహింసాస్వరూపిణ్యై నమః
ఓం ఆర్యవైశ్యపూజితాయై నమః
ఓం భక్తరక్షణతత్పరాయై నమః
ఓం దుష్టనిగ్రహాయై నమః
ఓం నిష్కళాయై నమః
ఓం సర్వసంపత్ప్రదాయై నమః 40
ఓం దారిద్ర్యధ్వంసిన్యై నమః
ఓం త్రికాలజ్ఞానసంపన్నాయై నమః
ఓం లీలామానుషవిగ్రహాయై నమః
ఓం విష్ణువర్ధనసంహారకాయై నమః
ఓం సుగుణరత్నాయై నమః
ఓం సాహసౌదార్యసంపన్నాయైనమః
ఓం సచ్చిదానందస్వరూపాయై నమః
ఓం విశ్వరూపప్రదర్శిన్యై నమః
ఓం నిగమ వేద్యాయై నమః
ఓం నిష్కామాయై నమః 50
ఓం సర్వసౌభాగ్యదాయిన్యై నమః
ఓం ధర్మసంస్థాపనాయై నమః

ఓం నిత్యసేవితాయై నమః
ఓం నిత్యమంగళాయై నమః
ఓం నిత్యవైభవాయై నమః
ఓం సర్వోపాధివినిర్ముక్తాయై నమః
ఓం రాజరాజేశ్వర్యై నమః
ఓం ఉమాయై నమః
ఓం శివపూజాతత్పరాయై నమః
ఓం పరాశక్త్యై నమః 60
ఓం భక్తకల్పకాయై నమః
ఓం జ్ఞాననిలయాయై నమః
ఓం బ్రహ్మవిష్ణుశివాత్మికాయై నమః
ఓం శివాయై నమః
ఓం భక్తిగమ్యాయై నమః
ఓం భక్తివశ్యాయై నమః
ఓం నాదబిందుకళాతీతాయై నమః
ఓం సర్వోపద్రవవారిణ్యై నమః
ఓం సర్వరూపాయై నమః
ఓం సర్వశక్తిమయ్యై నమః 70
ఓం మహాబుద్ధ్యై నమః
ఓం మహాసిద్ధ్యై నమః
ఓం సద్గతిదాయిన్యై నమః
ఓం అమృతాయై నమః
ఓం అనుగ్రహప్రదాయై నమః
ఓం ఆర్యాయై నమః
ఓం వసుప్రదాయై నమః
ఓం కళావత్యై నమః
ఓం కీర్తివర్ధిన్యై నమః
ఓం కీర్తితగుణాయై నమః 80
ఓం చిదానందాయై నమః
ఓం చిదాధారాయై నమః
ఓం చిదాకారాయై నమః
ఓం చిదాలయాయై నమః
ఓం చైతన్యరూపిణ్యై నమః
ఓం యజ్ఞరూపాయై నమః
ఓం యజ్ఞఫలదాయై నమః
ఓం జ్ఞానదాయై నమః
ఓం తాపత్రయవినాశిన్యై నమః
ఓం గుణాతీతాయై నమః 90
ఓం విష్ణువర్ధనమర్దిన్యై నమః
ఓం తీర్థరూపాయై నమః
ఓం దీనవత్సలాయై నమః
ఓం దయాపూర్ణాయై నమః
ఓం తపోనిష్ఠాయై నమః
ఓం శ్రేష్ఠాయై నమః
ఓం శ్రీయుతాయై నమః
ఓం ప్రమోదదాయిన్యై నమః
ఓం భవబంధవినాశిన్యై నమః
ఓం భగవత్యై నమః 100
ఓం ఇహపరసౌఖ్యదాయై నమః
ఓం ఆశ్రితవత్సలాయై నమః
ఓం మహావ్రతాయై నమః
ఓం మనోరమాయై నమః
ఓం సకలాభీష్టప్రదాయై నమః
ఓం నిత్యమంగళరూపిణ్యై నమః
ఓం నిత్యోత్సవాయై నమః
శ్రీకన్యకాపరమేశ్వర్యై నమః 108

అష్టోత్తర శతనామావళిః సమాప్తా.

## అహింసాజ్యోతి

సీ. ఆత్మస్వరూపుడై యాదిచరాచరా
త్మ్యమైన భువనత్రయము సృజించి
కృతయుగంబున దైత్యతతి మదంబడప బ్రా
హ్మణుడయ్యె వామనాఖ్యను జనించి
త్రేతాయుగమున క్షత్రియుడయ్యె దశకంఠు
హతుజేయ శ్రీరాముడై జనించి
ద్వాపరంబున యదూద్వహుడయ్యె భూభార
మును దీర్ప కృష్ణాఖ్య జననమంది
కలియుగంబున వైశ్యుడై కర్మభూమి
ప్రాచ్య పాశ్చాత్యఖండ సౌభాగ్యగరిమ
పెంపుసేయగ నెల్లర ప్రేమజూడ
నవతరించెను గాంధి మహాత్ముడగుచు.

సీ. వరగుణాన్విత మనోవాక్కాయ కర్మల
సత్యహరిశ్చంద్ర చక్రవర్తి
అభ్యర్థి జనవాంఛితార్థ సంధాన ని
శ్చలనిరతిన్ బలిచక్రవర్తి
అనుపమానంద బ్రహ్మజ్ఞాన ధారణా
నూనప్రహ్లాద మార్గానువర్తి
అనితర కార్యదీక్షావేళ శమదమ
తతి భగీరథ ప్రయత్నానువర్తి
యల యహింసను ఖండఖండాతరముల
ఆత్మశక్తిని జాటిన యనఘమూర్తి
యార్యవైశ్యకులాబ్ధి హిమాంశుడఖిల

కల్మషవిరాగి నిస్తుల కర్మయోగి
యజమహాపరిపంథి మహాత్మగాంధి.

సీ. తనదు దేశస్వతంత్రమునకై స్వార్థంబు
త్యాగంబొనర్చిన ధన్యమూర్తి
సతమహింసాధర్మరతుడై యజాతశా
త్రవుడౌ దిగంత విశ్రాంతకీర్తి
జాతిభేదమను రాక్షసి నొంచి దీనుల
కృపజూచినట్టి సాధుపదవర్తి
మన రాట్నమున వడికిననూలు మూరవ
స్త్రంబె చాలను పేద చక్రవర్తి

సర్వదేశ సర్వమత విస్తారజనుల
హృదయములయందు భగవంతు డీతడంచు
కరము గొనియాడబడుచున్న గాంధిగన్న
భవ్యగుణగణ పూత మా భరతమాత.

## విశ్వేశ్వరపుర శోభ (బెంగుళూరు)

విశ్వవిఖ్యాతినందిన బెంగుళూరు పట్టణములో భారత యాత్రాకేంద్రములలో ముఖ్యమైనవి.

(1) లాల్ బాగ్ - ఇయ్యది మహోన్నతములగు వృక్షసంతతులతో ప్రశాంతమగు వాతావరణముతో నేత్ర పర్వమొనర్చు నద్దాల మహాలుతో నలరారుచు నుద్యానవనములలో నగ్రస్థాన మలంకరించుచున్నది.

(2) విధానసౌధము - ఇయ్యది సువిశాలములు, సుందరములునగు గదులతో, నందమైన పరిసరములతో దేవేంద్రభవనమా యనిపించుచు సౌధములలో నగ్రస్థాన మలంకరించుచున్నది.

(3) విశ్వేశ్వరపురమందుగల శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీ దేవస్థానము - విశ్వేశ్వరపురము వైకుంఠమువలె నొప్పుచుండును. ఇందు శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవస్థానము అందముగులుకు శిల్ప సౌందర్యముతో చలువరాతి పరపుతో తీర్చిదిద్దబడిన కట్టడములతో నలరారుచుండును.

ఇందు వెలసియున్న శ్రీ కన్యకాపరమేశ్వరి సందర్శన మాత్రముచే తన్మయత్వమును గలిగించుచుండును. మరియు దర్శించువారికి నభయ ప్రదానమునకు సంసిద్ధుడై నిలిచియున్న విఘ్నేశ్వరుడు, అందముచిందుచుండు లక్ష్మీనారాయణులు, పార్వతీపరమేశ్వరులు, నవగ్రహములు, నాగప్రతిమలు గలిగి యీ యాలయము మహాక్షేత్రమున కుండవలసిన లక్షణములతో నలరారుచున్నది. ప్రస్తుతము ప్రసిద్ధులగు శిల్పులచే నిర్మాణింపబడుచున్న మహాద్వారము గాంచుచో సంభ్రమాశ్చర్యములు గలుగుచుండును. యావద్భారతదేశమందుగల కన్యకాపరమేశ్వరియొక్క యాధునిక దేవాలయములలో నిది యగ్రస్థాన మలంకరించుచున్నది.



# సృష్టి క్రమము




శుద్ధ సత్త్వ మాయా ప్రతిబింబ బ్రహ్మచైతన్యము - ఈశ్వరుడు.

మలిన సత్త్వ మాయా ప్రతిబింబ బ్రహ్మచైతన్యము - జీవుడు.

తమఃప్రధాన మాయనుండి సృష్టి ప్రారంభము.

పృథివి - అప్ - తేజస్సు - వాయువు - ఆకాశము

| ఆకాశమునుండి | వాయువునుండి | అగ్నినుండి | నీటినుండి | భూమినుండి |
|---|---|---|---|---|
| శోకము | పరుగిడుట | ఆకలి | శుక్లము | ఎముకలు |
| కామము | విస్తరించుట | నిద్ర | లాలాజలము | వెంట్రుకలు |
| క్రోధము | సుళ్లు తిరుగుట | దప్పి | చెమట | చర్మము |
| మోహము | ప్రయాణము చేయుట | కాంతి | మూత్రము | నరము |
| భయము | ముకుళించుట | ఆలస్యము | రక్తము | మాంసము |

## జ్ఞానేంద్రియ త్రిపుటి

### త్వక్ - చక్షు - శ్రోత్ర - జిహ్వా - ఘ్రాణములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| అధ్యాత్మము | చర్మము | నేత్రము | చెవి | నాలుక | ముక్కు |
| అధిదేవత | వాయువు | సూర్యుడు | దిక్పాలురు | వరుణుడు | అశ్వినీకుమారులు |
| అధిభూతము | స్పర్శము | రూపము | శబ్దము | రసము | గంధము |

## కర్మేంద్రియ త్రిపుటి

### వాక్ - పాణి - పాద - పాయు - ఉపస్థలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| అధ్యాత్మము | వాక్కు | చేతులు | పాదములు | శిశ్నము | గుదము |
| అధిదేవత | అగ్ని | ఇంద్రుడు | వామనుడు | ప్రజాపతి | యముడు |
| అధిభూతము | వచనము | ఇచ్చి పుచ్చుకొనుట | నడచుట | రతిభోగము | మలవిసర్జనము |

## అంతరింద్రియ త్రిపుటి

### మనస్సు - బుద్ధి - చిత్తము - అహంకారము

| | | | | |
|---|---|---|---|---|
| అధ్యాత్మము | మనస్సు | బుద్ధి | చిత్తము | అహంకారము |
| అధిదేవత | చంద్రుడు | బృహస్పతి | వాసుదేవుడు | రుద్రుడు |
| అధిభూతము | సంకల్పవికల్పములు | నిశ్చయము | చింతనము | అహంత్వాభిమానము |

## షట్చక్రములు

| చక్రము | స్థానము | అధిదేవత |
|---|---|---|
| మూలాధారము | గుదము | విఘ్నేశ్వరుడు |
| స్వాధిష్ఠానము | లింగము | చతుర్ముఖుడు |
| మణిపురము | నాభి | విష్ణువు |
| అనాహతము | హృదయము | రుద్రుడు |
| విశుద్ధము | కంఠము | జీవుడు |
| ఆజ్ఞేయము | భ్రూమధ్యము | ఈశ్వరుడు |

పంచకోశములు :—అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములు. హృదయమందు ప్రాణవాయువు; గుదమునందు అపానము; నాభియందు సమానము; కంఠమునందు ఉదానము; శరీరమంతట వ్యానము నను వాయువులు ప్రవర్తించును.

# గాయత్రీ మంత్రము

ఓం భూర్భువ స్సువః
తత్సవితుర్వ రేణ్యమ్
భర్గో దేవస్య ధీమహి
ధియో యోనః ప్రచోదయాత్.

ఓం - ప్రణవాత్మకమైన పరమాత్మ; భూః - ప్రాణమునకు ప్రాణము; భువః - సర్వదుఃఖములను పోగొట్టి; సువః - సమస్త సుఖముల నిచ్చునట్టి; యత్ - ఏ పరమాత్మ; నః - మా యొక్క; ధియః - బుద్ధులను; ప్రచోదయాత్-ప్రేరణ చేయునో; తత్ - ఆ; సవితుః - సర్వ జగత్తులను సృష్టిచేయు; దేవస్య - దివ్యమహిమగల యా పరమాత్మయొక్క; వరేణ్యమ్ - మిక్కిలి శ్రేష్ఠమై కోరదగిన; భర్గః - సర్వదుఃఖనాశకమగు శుద్ధ స్వరూపమును; ధీమహి - ధారణచేయుదముగాక.

ప్రణవస్వరూపుడును, అన్నిటికాధారమైనవాడును, అంతట నిండియుండువాడును, సర్వేంద్రియములను ప్రకాశింపజేయువాడును, సృష్టి స్థితి లయ కారణభూతుడును, సమస్త దుఃఖములను పోగొట్టి సర్వసుఖముల నిచ్చునట్టి స్వయంప్రకాశమైనవాడును నగు పరమాత్మునకు మా నమస్కారములు.

గాయత్రీ ఛందస్సు - అనుష్టుప్ శ్లోకము - మంత్రద్రష్ట: విశ్వామిత్ర మహర్షి.

ఓం తత్ సత్